మానవాదర్శగ్రంథమండలి. ఆఱవపుష్పము.

# నిష్కామయోగము.

(శ్రీ గాంధి భగవద్గీతానువాదము-వ్యాఖ్యానసహితము)

అనువాదకులు:

బుద్ధపురాణ, మానవజీవిత, ఆత్మవిజయాది

గ్రంథకర్త

బౌద్ధవాఙ్మయబ్రహ్మ

దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.


తృతీయముద్రణము 5000 ప్రతులు.

1931.

[సాదా రేపరు ప్రతి వెల రు 0-6-0.

స్టిఫ్ బైండ్. రు 0-8-0.

# రెండు మాటలు

హిందూధర్మము విశ్వమతశిరోమణి. భగవద్గీత హిందూధర్మగ్రంథసారము. ఇట్టి భగవద్గీతకు వ్యాఖ్యాత నవవిశ్వజ్ఞానభాస్కరుఁ డగు శ్రీ గాంధిమహాత్ముఁ డు. అనువాదకులుమామండలిసంపాదకులగు బౌద్ధవాఙ్మయ బ్రహ్మ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు. మతమును జనసామాన్యమునకు బోధపఱచుటకు, ధర్మవిజ్ఞానకిరణ తేజఃపుంజములసామాన్యమానవహృదయమందిరములఁ బ్రవేశింపఁజేయుటకు ననుభవసిద్ధజ్ఞానమూర్తులగు మహాత్ముల వ్యాఖ్యలతోడి మతగ్రంథములు జనసామాన్యమందు వ్యాప్తిని గాంచవలయును. మతవిజ్ఞాన వ్యాప్తికిఁ బ్రభువుల యనుగ్రహము మిక్కిలి ప్రయోజనకారి. అశోకునివంటి మతపక్షపాతియగు సార్వభౌముని యాశ్రయముబౌద్ధవిజ్ఞానవ్యాప్తికు త్తమసాధనమయ్యెను. దాస్యగ్రస్తమగు భరతఖండమునకు నేఁ డట్టి భాగ్యము లేదు. సామాన్యులే యీకార్యమునకుఁ గడంగి గ్రంథ

మాలలచే నార్యవిజ్ఞానప్రచార మొనరింపవలసివచ్చి నది. మామండలి ముఖ్యాశయము భారతజాతీయ నైతిక జీవితసౌభాగ్యమందిరనిర్మాణమునకు వలయు వాఙ్మ యమును వృద్ధిఁగావించుటయే. మా సంపాదకులీ యుద్దే శ్యముతోడనే మహాత్ముని గీతావ్యాఖ్యానము నను వదించిరి. ప్రథమముద్రణము అజమేరు సస్తా సాహిత్య మండలివారి హిందీ అనాసక్తియోగమున కనువాదము. ద్వితీయసంస్కరణమును నదియే. ఆ హిందీయనాసక్తి యోగమునఁ గొన్నిదోసఁగులుండుటయు, అనువాదకులు కారాగారమున శిక్ష ననుభవించుచుండుటచేఁ గలిగిన కొన్నిసాధకబాధకములవలనను బ్రథమద్వితీయసంస్కర ణములు సంతసప్రదములుగ నుండనందుల కనువాదకులు తమవిచారమును సూచించిరి. ఈతూరి హిందీయనాసక్తి యోగము నాశ్రయింపక స్వయముగ మహాత్మునిచే గుజ రాతీయందు వ్రాయఁబడిన అనాసక్తియోగమునకే శుద్ధానువాదమును జేసియున్నారు. అనువాదకు లంతగా

గుజరాతీలోనర్థముకాని శబ్దాదికములయర్థమును గ్రహిం
చు సందర్భములఁ గొంచెము హిందీయనువాదసాహాయ్య
మును గైకొనిరి. ఈతని అనువాదము సర్వాంగసుంద
రముగను, నిర్దుష్టముగను నుండఁగల దని యూహించు
చున్నారము. గతానువాదముల సవరణఁ జేసికొను నవ
కాశమే పొసఁగియుండనందుకుఁ బశ్చాత్తాపమును
దెలుపుచున్నారము. ఆంధ్రసోదరు లచిరకాలముననే
తృతీయసంస్కరణమునకు సుస్వాగత మొసంగి గీత
యందును, మహాత్మునియందును దమకుఁగల భక్తి
శ్రద్ధల వెల్లడించినందులకు వందనీయులు. నిష్కామ
యోగముయొక్క ధరను జాలవఱకుఁ దగ్గింపవలె నని
యత్నించితిమి. కాని అది సాధ్యపడకపోయినది. గుజ
రాతీ అనాసక్తియోగము నిష్కామయోగముకంటెఁ
జిన్నసైజున 200 పుటలు గలది. ఆంధ్రమున నా సైజు
కంటెఁ బెద్దసైజున రెట్టింపు అయినది. కారణము అక్షర
ములు పెద్దవి. అనేకులకోరికపై మూలమును జేర్చితిమి.

మహాకవిశేషము భారతజాతీయజీవితవికాసమున కర్థ
దాస్య మంతరింపవలెను. దేశీయపారిశ్రామికాభివృద్ధి అర్థ
స్వాతంత్ర్యమునకు దోహద మని యెంచినదే మహాత్ము
నికిఁ బ్రియమైనపని యని తలంచి, ధర్మ మని భావించి ధర
కొంచెము హెచ్చుగనున్నను ఆంధ్రపేపరుమిల్లుకాగితము
మీఁదనే దీనిని ముద్రింపఁజేసితిమి. ఇన్ని కారణములచే
ధరను దగ్గింపలేక పోయితిమి. అనేకులు గీతవంటి నిత్య
పారాయణయోగ్యమగు మతగ్రంథరాజము బైండు లేని
దిగనున్న బాగుండదనియు వెలహెచ్చినను బైండు అవ
సరమనియు వ్రాసిరి. సొంతముద్రణాలయము లేమిచే బైం
డింగునకు మామూలుగ నిచ్చు ఛార్జికంటె హెచ్చుఛార్జి
చెల్లింపవలసినవారలమయితిమి. మాకు స్వయముగఁ
గోరిక లేకున్నను స్టిఫ్ బైండు కొన్ని ప్రతులు చేయించితి
మి. అందుచే స్టిఫ్ బైండు ప్రతి 0-8-0 అయినది. సాదా
రేపరు ప్రతి యెప్పటి 0-6-0 ధరయే. హిందీ గుజరాతీ
భాషలలో దాదాపు 20 వేల ప్రతులు ఒకటిరెండు

సంస్కరణములకే ఖర్చయినవి. ఆంధ్రభాష కట్టిభాగ్యము మృగ్యము. మూలములేని ప్రతులు సయితము కొన్ని వేయించి సమస్తరీతుల గీతాప్రచార మొనరింప నెంచితిమి. మాయీయుద్యమమున కనేకవిధములఁ దోడ్పడుచున్న దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికిని, చల్లా శేషగిరిరావు పంతులుగారికిని కృతజ్ఞతాభివందనములు. ఈతృతీయసంస్కరణమున కాంధ్రమహాశయులు నిండుప్రేమతోఁ దమహృదయముల స్థానమిత్తు రని విశ్వసించుచున్నారము.

మానవాదర్శగ్రంథమండలి,<br>
కార్యస్థానము,<br>
అంగలూరు. 1—4—31.

వ్యవస్థాపకుఁడు,<br>
తిపిర్నేని లక్ష్మీనారాయణ.



# అనువాదకుని విన్నపము.



ఆంధ్రలోకమునకు సకలదేశవిఖ్యాతుఁడును, ప్రేమావతారమును, అహింసావ్రతపరాయణుఁడును నగు శ్రీ గాంధిమహాత్ముని "అనాసక్తియోగము"ను సమర్పించు భాగ్యమునకు నోఁచి నన్ను నేను ధన్యునిగ భావించుకొనుచున్నాఁడను. నవయుగప్రవర్తకుఁ డగు పూజ్యబాపుజీ హిందూధర్మగ్రంథరాజ మగు భగవద్గీతకు వ్యాఖ్యాత యగుటచే నా గ్రంథగౌరవము ద్విగుణితమయ్యె ననుట కేమియు సందియము లేదు. లోకశాంతికయి ప్రపంచరాజ్యాంగవేత్త లెల్లరు ప్రజ్ఞావాదములు బలుకుచుండ గాంధిమహాత్ముఁడు ప్రగల్భములతో నిమిత్తము లేకయే ఆత్మబలిదానముచే దేశస్వాతంత్ర్యవ్యాజమున ధర్మసంస్థాపన మొనరింపఁ గడంగుట కడుంగడు శుభావహము. నేఁడు సకలప్రపంచము సామ్రాజ్యవాదముచే విజృంభితమయి పరమార్థ

మునే విస్మరించినది. సకలదేశీయులు, మతస్థులు 'దేవుఁడు, ధర్మము, అహింస' అని నోటనుచ్చరించుచుఁ జేయుచున్న పాషండకార్యములకుఁ బారము లేదు. నేఁడు మతము గ్రంథములయందే యుండిపోయినది. ఆ గ్రంథములం దయినను మాలిన్యము లేకయే యున్న దని నుడువవలనుపడకున్నది. మానవులు విజ్ఞానప్రధాన జీవులయి జీవించుటయందు శ్రద్ధ లేనివారయి, భౌతిక సుఖముల కపేక్షపడి పరస్పరకలహము, ఈర్ష్య, ద్వేషము, పరపీడనము, రక్తపాతము, కార్పణ్యము, కాఠిన్యము మున్నగు రాక్షససహజములగు దుర్గుణములకుఁ దమజీవితముల స్థానమొసంగియున్నారు. ఆత్మ పరిశోధనము, సత్యాన్వేషణము, ఈశ్వరచింతనము, జీవితలక్ష్యము నేఁడు కలలోని వార్తలయినవి. సకల మతశిరోమణి యగు హిందూధర్మవిశ్వాసము ననుసరించి ధర్మము లోపించుసందర్భమున భగవదవతార మావశ్యకమయినది. అధర్మము వృద్ధియయినపుడు

ధర్మసంస్థాపనము నిమిత్త మీశ్వరుఁడు జగతీతలంబునం దవతరించు నని శ్రీకృష్ణయోగీంద్రులు గీతాగ్రంథమున నుడివియున్నారు.

"యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం."
"పరిత్రాణాయ సాధూనాంవినాశాయ చదుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."

౪ అ. ౭-౮ శ్లో.

"అర్జునా! ధర్మమునకు హానియు, అధర్మమునకు వృద్ధియుఁ గలిగినపుడు నేను పుట్టుచుందును."

"సాధువుల సంరక్షించుటకును, దుష్టుల శిక్షించుటకును, ధర్మమును బునరుద్ధరించుటకును బ్రతియుగము నందు నే నవతరించుచుందును.

గీతావాక్యములు సత్యములు. గాంధిమహాత్ముని యవతారముచే నవి చరితార్థము లయినవి. నశ్వరమును, లోకశ్రేయస్కరము కానట్టియు స్వార్థవాదము

నిండిన నవయుగమును సంస్కరించుటకును, దుష్ట మును, పరమార్థదూరమును, సత్యవిరుద్ధమును నగు భౌతికవాదమును ద్రోసిపుచ్చి దాని స్థానమున ధర్మవాద మును నెలకొల్పుటకును గాంధిమహాత్ముఁడు కంకణ బద్ధుఁడై కర్మక్షేత్రమున నిలిచియున్నాఁడు. ఈ మహా వీరుఁడు ధర్మసంగ్రామరంగమున సత్యధర్మశౌచాహిం సాది బ్రహ్మాస్త్రములతో నలంకృతుఁ డయి, ఆత్మబలి దాన మను కవచమును ధరించి అధర్మపిశాచముతో ఘోరముగఁ బోరుసలుపుచున్నాఁడు; సూర్యుని తేజస్సు యొకరిసొత్తు కానట్లు గాంధియు ధర్మావతార మగుటచే నొకదేశమువారికే పూజ్యుఁడు. అపుడు నని చెప్ప వీలు లేదు. వ్యామోహపంకమున, అజ్ఞానాంధకారమున, అధర్మకూపమునఁ బడియున్న సమస్తమానవాళి కతఁ డారాధ్యుఁడు - పూజ్యుఁడు - మార్గదర్శకుఁడు, భగవ ద్గీత అహంకారమమకారములఁ బాసి యధర్మమును విధ్వంస మొనరించుటకును, ధర్మసంస్థాపనము సేయు

పూజ్యబాపుజీ గీత కనువాదమును గుజరాతీ భాషలో అనాసక్తియోగ మను పేర వ్రాసియున్నారు. అందుపై వ్యాఖ్యానమును వ్రాసియున్నారు. ఈయనువాద మా గుజరాతీ అనాసక్తియోగమునకుఁ దర్జుమా. ప్రథమద్వితీయసంస్కరణములు హిందీ అనువాదమునకు భాషాంతరీకరణము. అందు దొరలియుండిన దోసఁగులకయి పశ్చాత్తాపపడుచు సీతూరి మహాత్ముని గుజరాతీ అనాసక్తియోగమునకు శుద్ధానువాదమును జేసియున్నాను. ఆంధ్రభాషయందు వ్యవహారమందున్నంత వఱకు గుజరాతీయందలి తత్సమశబ్దముల నెట్టిమార్పు లేకయే ఆంధ్రమునఁ బ్రయోగించితిని. శైలి తేటతెల్లముగ నుండునట్లు చేసితిని. భావములనుగాని, మఱి యెట్టి సందర్భములనుగాని మార్పుఁజేయుటలో స్వాతంత్ర్యమును గైకొనియుండలేదు. హిందీఅనువాదములలోఁ గొన్నిమార్పులు కనిపించుటచే వాని నాశ్రయింప నిష్టము లేక గుజరాతీఅనాసక్తియోగమునే శరణుఁజొచ్చితిని.

కొన్ని గుజరాతీపదముల కర్థము తెలియని తావుల హిందీ అనువాదములు తోడ్పడినవి. సామాన్యపాఠకులకు సయితము సులభగ్రాహ్యముగ నుండునిమిత్తము యథేచ్ఛగా విసంధుల నుపయోగించితిని. 9 వ అధ్యాయములో గుజరాతీప్రతిలో 25 వ శ్లోకము పిదప చిన్న వ్యాఖ్య కలదు. అది 26 వ శ్లోకమునకు సంబంధించినదగుటచే 26 వ శ్లోకము పిదపనే చేర్చితిని. 12 వ అధ్యాయములో 10 వ శ్లోకముపిదప గుజరాతీప్రతిలో వ్యాఖ్యకలదు. ఆవ్యాఖ్యయే హిందీలో 12 వ శ్లోకము పిదపనున్నది. ఆవ్యాఖ్యగుజరాతీప్రతి ననుసరించి 10వ శ్లోకముపిదప నుండుటయే యుచితము. ఆవ్యాఖ్య 10 వ శ్లోకముపైన వ్రాయఁబడినదే కాన నది యట్లనే యుంచితిని. హిందీఅనువాదములు చదువుకొనువారు నిష్కామయోగములోఁగల సామాన్యములగు మార్పులను గాంచి భ్రాంతిపడరాదు. ఈ యనువాదము కేవలము మహాత్ముని గుజరాతీ అనాసక్తియోగమునకు భాషాంత

రీకరణమే యని గ్రహింపవేడెదను. లోకవిఖ్యాతుఁడును జ్ఞానమూర్తియు నగు మహాత్ముని వ్రాఁతల ననువదింప నావంటి సామాన్యయువకుఁడు పూనుకొనుట కడుసాహసము. అనేకమిత్రుల ప్రోద్బలమును, మహాత్ముని పాదరజోలేశమందలి భక్తియు, ధార్మికసారస్వతమందలి గాఢాభిమానమును నన్నీకార్యమునకుఁ బురికొల్పినవి. ఈ నాసాహసమునకు క్షంతవ్యుఁడను. పెద్ద లనేకులు గట్టిగాఁ గోరుటచే నిష్కామయోగమున మూలమును జేర్చక తప్పినది కాదు. మూలమున కర్థము వ్రాయుటలో వ్యాఖ్యాత లనేకములగు తావులఁ గొన్ని భేదాభిప్రాయముల సూచించిరి. ఆభేదముల నన్నింటి నీచిన్నగ్రంథమున వివరింపఁ దలంపు లేదు. కొందఱు కోరిరి. కాని నే నిపు డది చేయఁజాలను. ఇంతవఱకు గీతాశ్లోకముల కర్థము వ్రాసినవారిపద్ధతులలో మహాత్ముని పద్ధతి అతిసరళమును, సుస్పష్టమును, సముచితమును నని నాకుఁ దోచినది. కావున సమస్తరీతుల సమంజసముగ

నుండుటకయి మహాత్ముని గుజరాతీ అనాసక్తియోగ
ముయొక్క ప్రతిబింబముగ నుండునట్లుగనే నిష్కామ
యోగమును జేసితిని. ఆంధ్రసోదరీసోదరులు నిష్కా
మయోగము నాదరించి క్రైస్తవుల మతగ్రంథములవలె
దీనివ్యాప్తి నొనరించి మతముపట్లం దమకుంగల గౌరవా
తిశయములం గార్యరూపమునం బ్రదర్శింతురుగాత మ్మని
ప్రార్థన. ధనాఢ్యులు, ప్రభువులు, వేదాంతులు, దాత
లు దీనిని జనసామాన్యమం దుచితముగా వితరణము
సేయు పుణ్యకార్యమునకుం బూనుకొని గీతావిజ్ఞాన
వితరణపుణ్యభాగులయి వందనీయు లగుదురుగాక! గీతా
నువాదము సంతృప్తిజనకముగం జేయంజాలకపోయిన
నన్ను సోదరులు మన్నింపం బ్రార్థితులు.

మానవాదర్శగ్రంథమండలి,
అంగలూరు, 1-4-31.

సత్యాగ్రహిపాదరేణువు,
అనువాదకుండు.

---

శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీర్భోక్తాదుగ్ధంగీతామృతంమహత్.

సంసారప్రవృత్తియందు దుఃఖనివృత్తికి సంశయాత్మత్వము బీజముగ నున్నవిధమును గీతాతత్వము విశదముచేయుచున్నది. సంశయాత్ములు వినాశనమును బొందుదురు.

"అశోచ్యానన్వశోచ స్త్వంప్రజ్ఞావాదాంశ్చ భాషసే."

అని శ్రీకృష్ణపరమాత్ముఁడు కురుక్షేత్రమునందు విషాదయోగపరవశుఁడైన విజయునకుఁ బ్రసాదించిన గీతామృతబీజము పురుషార్థమును బడయుటకు సాధనంబుగ నున్నది. సంసారప్రవృత్తియందుఁ బురుషార్థమునకు మూలమైన పరమధర్మము ఖండరూపములను నారాధింపఁబడుచు దుఃఖమునకుఁ గారణం బగుచున్నది. కులధర్మము, జాతిధర్మము, వృత్తిధర్మము, మతధర్మము, నైతికధర్మము, సాంఘికధర్మము, రాజ్యధర్మము మొదలగుధర్మములు భేదభావమును గలిగించుచుదుఃఖమునకు

మూలము లగుచున్నవి. ప్రజాపతి ప్రజలను యజ్ఞసహిత ముగ సృజించి పురుషార్థసాధనము ననుగ్రహించెను. యజ్ఞము నాత్మార్థముచేయునపుడు సుఖమును, దేహార్థముచేయునపుడు దుఃఖమును గలుగుచున్నవి. ఫలరహితమైన కర్మయోగము యథార్థమైన బ్రహ్మయజ్ఞము, ఆత్మయజ్ఞము. పూర్ణయోగము సర్వగతమైన బ్రహ్మము వలెనే కర్మమును, యజ్ఞమును, ధర్మమును, ఆత్మయును సర్వగతములై వెలయుచున్న విధమును విశదముచేయుచున్నది.

ధర్మలక్ష్యమునందుఁగల భేదము కర్మలక్ష్యమునందును భేదమును గలుగఁ జేయుచున్నది. ప్రవృత్తియందుఁగల యీ భేదబుద్ధియే ప్రజ్ఞావాదములకును, పురుషార్థమునందుఁ బలువిధములైన యోగములకును మూలమగుచున్నది. కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము, సన్న్యాసయోగము మొదలగు యోగములు ధర్మలక్ష్యమునందు భేదబుద్ధిని గలుగఁ జేయు

మును, భాగ్యభోగములును, హింసాధర్మమును, సన్న్యాసయోగమును విపరీతాకృతిని దాల్చినయుగమునందు కర్మయోగతత్త్వమును అసందిగ్ధముగఁ బ్రతిపాదించుట భారతీయప్రతిష్ఠకును లోకకల్యాణమునకును బరమావసరముగ నున్నది.

సర్వగతమైన కర్మయోగము పరిమితవిపరీతాకృతులను దాల్చి విశ్వశ్రేయస్సునకు నిరర్థకమైనది. సంకుచితమతాభిమానమును, విపరీతదేహాభిమానమును ఆత్మశక్తిని స్తంభింపఁజేసినవి. సర్వగతమైన ఆత్మశక్తియును, సర్వగతమైన కర్మయోగమును ధర్మలక్ష్యమునందు లగ్నమగునపుడు పూర్ణయోగము కలుగుచున్నది. అహింసాపరమోధర్మ మను నుత్తమధర్మమునకు గీతోపదేశము ప్రతికూలము కాదను విషయమును గాంధిమహాత్ముఁడు ప్రస్తావనయందు విశదము చేసెను. గీతకు బీజము విషాదయోగము. శక్తి ఆత్మయోగము. కీలకము పరమపదప్రాప్తి. భారతయుద్ధము

కేవలము నిమిత్తకారణము. దేహాత్మల సంరంభమునందు నీరులు సయితము సంభ్రమమును బొందెడివిధమును, విజయుని విషాదయోగమును, ఆత్మవిజయమును వెల్లడిచేయుచున్నవి. గీతోపదేశానంతరమున విజయుఁడు కర్మయోగారూఢుఁడై స్వధర్మనిర్వహణమును జేసికృతార్థుఁడైనవిధమున సకలజనులు గీతాపాఠకులై పరమార్థమును బడయఁగలరు.

"అహం బ్రహ్మాస్మి", "తత్త్వమసి", "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాది మహావాక్యార్థమును జ్ఞానయోగసాధనరూపమునను భగవద్గీత పరిస్ఫుటము చేయుచున్నది. స్వాత్మస్వరూపమైన ప్రపంచమునందు అహింసకును, ధర్మమునకును, కర్మయోగమునకునుగల ప్రతిష్ఠ హింసకును, అధర్మమునకును, అకర్మమునను గలుగఁజాలదు. ఈ పరమధర్మమును అనాసక్తియోగము, నిష్కామయోగము సువ్యక్తము చేయుచున్నవి.

భగవద్గీతకుఁ బ్రయోజనము భగవత్సంకీర్తనము, భగవద్ధ్యానము, భగవత్సందర్శనము, భగవత్కైంకర్యము, భగవత్సాక్షాత్కారము, భగవత్త్వము. సకలకర్మలు, సకలయజ్ఞములు, సకలయోగములును భగవత్త్వము నకు సాధనములు. కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, మనోబుద్ధిచిత్తాహంకారములును ఆత్మార్పణము చేయునప్పుడు భగవత్సాక్షాత్కారము సాధ్యమగుచున్నది. అకర్మయందును, అయజ్ఞమునందును, అజ్ఞానమునందును, అశ్రద్ధయందును, అనాత్మత్వమునందును యోగసంసిద్ధి గలుగఁజాలదు. అష్టాదశయోగములును ఆత్మయోగమునందు లగ్నమగునపుడు పూర్ణయోగము సాధ్యమై ఆత్మసాక్షాత్కారము గలుగుచున్నది.

గీతాశాస్త్రమునందు ప్రతిపాదితమైన "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" యనెడి పూర్ణయోగాదర్శమును గాంధిమహాత్ముని వ్యాఖ్యానము విస్పష్టము చేయుచున్నది. గీతాప్రయోజనము

దేశకాలపాత్రాతీతమైన పూర్ణయోగముగాని సంకుచితమైన సన్న్యాసయోగము గాదు. చరాచరప్రపంచము కర్మబద్ధమై చరించుచున్నది. ఫలత్యాగరూపమైన, ఆత్మపరాయణమైన, భగవదర్పితమైన కర్మయోగమునందు సన్న్యాసయోగము, భక్తియోగము, జ్ఞానయోగము పరిపక్వము లగుచున్నవి. కర్మయోగారూఢుఁడు స్థితప్రజ్ఞుఁడై సర్వమును తనయందును, తనను సర్వమునందును జూచుచు, బ్రహ్మనిర్వాణమును బడయుచుచున్నాఁడు. జీవయాత్రకు పరమార్థమును సాధకసాధనసాధ్యరూపములను సుబోధము చేయుచున్న భగవద్గీత సకలజనులకును నిత్యమును పారాయణయోగ్యముగనున్నది.

శ్రీయుత బలరామకృష్ణయ్యగారు గాంధిమహాత్ముని గీతావ్యాఖ్యానమున కాంధ్రానువాదమును జేసి యాంధ్రుల ధన్యవాదములకుఁ బాత్రు లగుచున్నారు. బలరామకృష్ణయ్యగారి భక్తిశ్రద్ధలు, కార్యదీక్ష, పాండి

త్యము, శైలి ఆంధ్రలోకమునకు సుపరిచితములు. ఆంధ్రులు బలరామకృష్ణయ్యగారి నిష్కామయోగమునకు స్వాగతము నొసంగి, గీతామృతమును గ్రోలి, స్వధర్మ పరాయణు లగుటకు భగవంతుఁ డనుగ్రహించుఁగాత! ఈయమూల్యగ్రంథమునకుఁ బరిచయవాక్యములను వ్రాయఁగలగౌరవమును నాకుఁగలుగఁజేసినందులకు నామిత్రులు శ్రీయుత బలరామకృష్ణయ్యగారికి వందనము లర్పించుచున్నాను.

నష్టోమోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత,
స్థితో ఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ.

విజయునివలెనే సకలజనులును సమ్మోహమును విడిచి స్థితప్రజ్ఞులయి కర్మయోగారూఢు లగుదురు గాత!

దుర్గావిలాసము.
విజయవాడ,
4—10—30.

ఓమ్ తత్సత్
కాశీనాథుని నాగేశ్వరరావు.

---

# ప్రస్తావన.

౧

ఎట్లానందస్వామి మున్నగు మిత్రుల ప్రేమకు వశుఁడనయి నేను సత్యప్రయోగముకొఱకే ఆత్మకథను వ్రాయ నారంభించియుంటినో అట్లు గీతానువాద విషయమునను జరిగెను. "మీ రొకతూరి సంపూర్ణ గీతానువాదముఁ జేసి దానిపై వ్రాయవలసిన వ్యాఖ్యానమును వ్రాసినచో మేము దానినంతయు నొకసారి చదివి గీతకు మీరు చెప్పుచున్న యర్థమును గ్రహింపఁ గలుగుదుము. ఇట నటఁగల శ్లోకములందుండి అహింసాదులఁ బ్రతిపాదించుట నాకుచితముగఁ దోచుటలేదు" అని యానందస్వామి అసహాయోగయుగమున నాతో నుడివెను. నా కాయన హేతువాదము తథ్యముగఁ గన్పట్టెను. "అవకాశము లభించినంతనే యిది చేయుదును" అని నేను మాఱుపలికితిని. పిదప నేను చెఱసాల కేగి

తిని. అచటఁ గొంచెము విశేష మగు సూక్ష్మదృష్టితో గీతాధ్యయన మొనరించు నవకాశము లభించెను. లోకమాన్యుని జ్ఞానభండారమును జదివితిని. వారే మొదట నాకు మరాఠీ, హిందీ, గుజరాతీ అనువాదములను ప్రేమపూర్వకముగఁ బంపియుండిరి; మరాఠీ అనువాదము చదువఁజాలకపోయిన గుజరాతీ అనువాదమును దప్పక చదువుఁ డని గట్టిగాఁ గోరియుండిరి. జైలునకు వెలుపల దానిని జదువఁజాలకపోయితిని, కాని జైలులో గుజరాతీ అనువాదమును జదివితిని. దీనిని జదివిన పిమ్మట గీతవిషయమునం దధికముగాఁ జదువ నభిలాష కలిగెను; అంత గీతాసంబంధమయిన యనేకగ్రంథములఁ దిరుగవైచితిని.

నాకు గీతతోఁ బ్రథమపరిచయము ఎడ్విను ఆర్నాల్డుయొక్క పద్యానువాదముచే క్రీ. శ. 1888-89 సంవత్సరములోఁ గలిగెను. అందుచే గీతయొక్క గుజరాతీ అనువాదము జవుదుటకుఁ దీవ్రమగు వాంఛ కలి

గెను. అంతఁ జేఁజిక్కిన యనువాదముల నన్నింటిని
జదివి వైచితిని. కాని యిట్టిపఠనము నాకు నాయను
వాదమును లోకము నెదుటఁ బెట్టుట కధికారమును బా
త్రిగా నొసంగనేరదు. ఇంతియేగాక నాకుఁగల సంస్కృ
తజ్ఞానము స్వల్పము, గుజరాతిపరిజ్ఞానమయినను విద్వ
ద్దృష్టితోఁ జూచినఁ గొంచెమును లేదు. అట్టిచో నేనీ
యనుచితసాహసమున కేల పూనుకొంటిని?

గీతను నే నెట్లు గ్రహించితినో యట్లే నే దాని నాచ
రణమునఁ బెట్టుటకు నేనును నాతోడ నుండువారిలోఁ
గొందఱును నెడతెగకుండఁ బ్రయత్నించుచున్నాము.
గీత మాకాధ్యాత్మికనిదానగ్రంథము. దాని ననుస
రించి యాచరణమును గలిగియుండుటయందు విఫలత
నిత్యము కలుగుచున్నది. కాని యీవిఫలత మేము ప్ర
యత్నించుచున్నప్పటికిని గలుగుచున్నది; ఈవిఫలత
యందు మాకు సఫలతయొక్క యుదయించుచున్న కిర
ణముల ప్రకాశము గోచరించుచున్నది. ఈ మిక్కిలి

చిన్న జనసముదాయమే యర్థమును నాచరణయందుఁ బెట్టఁ బ్రయత్నించుచున్నదో, ఆయర్థ మీయనువాద మందుఁ గలదు.

మఱియు మూలమగు సంస్కృతమున గీత నర్థముఁ జేసికొనుటకు సమయము లేనివారును, ఇచ్ఛ లేనివారును, కాని గీతారూపమగు నాధారముయొక్క యవసరము గలవారును, స్వల్పమగు నక్షరజ్ఞానము కలవారును నగు స్త్రీలు, వైశ్యులు, శూద్రుల నిమిత్త మీయనువాదమును జేసితిని. గుజరాతీభాషాపరిజ్ఞానము నాకు స్వల్పముగనున్నను దాని ద్వారమున నాయొద్దఁ గల యల్పమగు మూలధనమును గుజరాతీయులకు సమర్పించవలయు ననుగాఢమగు నభిలాష నా కెప్పటినుండియో కలదు. అశ్లీలవాఙ్మయప్రవాహవేగముగల యీ సమయమున హిందూధర్మమునం దద్వితీయముగ భావింపఁబడు నీగ్రంథముయొక్క సులభానువాదమును గుజరాతీప్రపంచమున కొసంగవలయుననియు దానిచే నది

యాప్రవాహము నెదుర్కొనఁగల శక్తిని బడయవలయు ననియు నే నవశ్య మభిలషించుచున్నాను.

ఈ యభిలాషయం దితర గుజరాతీ అనువాదకుల తిరస్కారము లేదు. వాని కన్నింటికి వానికిఁ దగు స్థాన ముండిన నుండవచ్చును, కాని వాని విషయమయి అనువాదకుల యాచరణరూపమగు ననుభవము కల దని నొక్కివక్కాణింప వీలుండు నని నేను తలంపను. ఈ యనువాదవిషయమున ముప్పదియొనిమిది సంవత్సరముల యాచరణప్రయత్నము కల దని బల్లగుద్ది చెప్పఁగలను. ఇందుచే ధర్మము నాచరణమునఁ బెట్టఁగోరు ప్రతి గుజరాతీసోదరుఁడును, సోదరియు దీనిని జదువుటకును, విచారణసేయుటకును మఱియు నిందులోనుండి శక్తిని బడయుటకును నే నవశ్యము కోరుచున్నాను.

ఈ యనువాదమున నా సహచరులఁ బరిశ్రమయుఁ గలదు. నాకుఁగల సంస్కృతజ్ఞానము మిక్కిలి యపూర్ణమగుటచే శబ్దార్థమందు నాకుఁ బూర్తిగా

విశ్వాసము కలుగఁ జాలకుండెను. కావునఁ గేవల మింతవఱకే యీ యనువాదమును వినోబా, కాకా కాలేల్కరు, మహాదేవ దేశాయి మఱియు కిశోరీలాలు మశరూవాళా చూచియున్నారు.

౨

ఇంక గీతార్థమునకు వత్తును.

క్రీ. శ. 1888-89 వ సంవత్సరమున నాకు గీతా పరిచయసందర్భన మయినపు డిది ఐతిహాసిక గ్రంథము కాదు, కాని దీనియందు భౌతికయుద్ధవర్ణన మను మిషతోఁ బ్రతిమానవుని హృదయములోపల నిరంతరము జరుగుచుండు ద్వంద్వయుద్ధముయొక్క వర్ణనము కలదు; మానవయోధుల సృష్టి హృదయములోపల జరుగు యుద్ధమును రసవంతముగఁ జేయు నిమిత్తము రచింపఁబడిన కల్పన మని నాకుఁ దోచెను. ధర్మమును గూర్చియు మఱియు గీతను గుఱించియు విశేషవిచారణచేసినపిదప నీ ప్రాథమికస్ఫురణ స్థిరపడెను.

మహాభారతమును జదివినపిమ్మట నీ భావము మఱెంత దృఢమయ్యెను. మహాభారతగ్రంథము నాధునికావ్యములలో నే నితిహాస మని విశ్వసింపను. దీనికిఁ బ్రబల మగు ప్రమాణము లాదిపర్వమునందే కలవు. పాత్రల యమానుషమును మఱియు నతిమానుషమును నగు నుత్పత్తిని వర్ణించి వ్యాసభగవానుఁడు రాజుయొక్క-యు, ప్రజలయొక్కయు నితిహాసమును నాశనముచేసి యున్నాఁడు. దానియందు వర్ణింపఁబడినపాత్రలు మూలమునం దైతిహాసికము లయిన వయి యుండవచ్చును, కాని మహాభారతమున వ్యాసభగవానుఁడు కేవలము ధర్మమును దర్శింపఁజేయుకొఱకే వాని నుపయోగించి యున్నాఁడు.

మహాభారతకారుఁడు భౌతికయుద్ధావశ్యకతను నిరూపించియుండలేదు. దాని నిరర్థకతనే నిరూపించెను. విజేత నేడ్పించినాఁడు, పశ్చాత్తాపతప్తుని గావించినాఁడు

మఱియు దుఃఖమునకు మినహా యేమియు శేషముండ లేదు.

ఈ మహాగ్రంథమున గీత శిరోమణిరూపమున విరాజిల్లుచున్నది. దాని రెండవ యధ్యాయము భౌతిక యుద్ధవ్యవహారమును నేర్పుటకు మాఱుగ స్థితప్రజ్ఞుని లక్షణముల బోధించుచున్నది. స్థితప్రజ్ఞున కైతిహాసిక యుద్ధముతో నెట్టి సంబంధమును నుండదు. ఈ సంగతి వాని లక్షణములవలననే నాకుఁ దెలిసెను. సామాన్య కుటుంబకలహములయొక్క యౌచిత్యమును, అనౌచిత్యమును నిర్ణయించు నిమిత్తము గీతవంటి పుస్తకము రచింపఁబడుట సంభవము కాదు.

గీతయొక్క కృష్ణుఁడు మూర్తిమంతమయిన శుద్ధసంపూర్ణజ్ఞానము, కాని కల్పితుఁడు. ఇచటఁ గృష్ణ నామధారి యగు నవతారపురుషుని నిషేధము లేదు. కేవలము సంపూర్ణకృష్ణుఁడు కల్పితుఁడు, సంపూర్ణావతారము తరువాత చేయఁబడిన ఆరోపణము.

అవతార మనఁగా శరీరధారియగు పురుషవిశేషము. ప్రతిజీవుఁ డీశ్వరుని యవతారము, కాని లౌకిక భాషయందు మనమందఱి నవతార మని చెప్పము. ఏపురుషుఁడు తనయుగమం దెల్లరికంటె శ్రేష్ఠధార్మికుఁడో వానినే భవిష్యత్ప్రజలు అవతారముగఁ బూజింతురు. ఇందు నా కేమియు దోషమున్నట్లు తోఁచదు. ఇం దీశ్వరుని గొప్పతనమున కెట్టిలోపమును గలుగుటలేదు, సత్యమునకు సయిత మెట్టి యాఘాతమును గలుగుట లేదు. "జీవుఁడు దేవుఁడు గాఁడు; కాని దేవుని తేజస్సునుండి జీవుఁడు భిన్నముగా లేఁడు." ఎవనియందు ధర్మజాగృతి తనయుగమం దెల్లరికంటె నధికము కలదో అతఁడు విశేషావతారము. ఈవిచార శ్రేణిచేఁ గృష్ణరూపమగు సంపూర్ణావతారము నేఁడు హిందూధర్మమున సామ్రాజ్యమును భోగించుచున్నది.

ఈదృశ్యము మనుష్యుని యంతిమశుభవాంఛా సూచకము. ఈశ్వరరూపుఁడు గాకుండ మనుష్యుఁడు

సమాధాన పడలేఁడు, వానికి శాంతి లభింపదు. ఈశ్వర రూపుఁడగుటకుఁ జేయు ప్రయత్నమే యథార్థమును మఱియు నేకమాత్రమగు పురుషార్థమును నయియున్నది. మఱియు నిదియే యాత్మదర్శనము. ఈ యాత్మదర్శన మెట్లు సమస్తధర్మగ్రంథములవిషయమయి యున్నదో అట్లనే గీతకును నయియున్నది. కాని గీతాకారుఁ డీ విషయమును బ్రతిపాదించుకొఱకు గీతను రచింపలేదు. కాని ఆత్మార్థి కాత్మదర్శనముయొక్క యొక యద్వితీయోపాయమును దెలుపుట గీతాశయము. ఏ వస్తువు హిందూధర్మగ్రంథములఁ జెల్లాచెదరుగఁగాన నగుచున్నదో దానిని గీత అనేకరూపముల, అనేక శబ్దముల, పునరుక్తిదోషమును స్వీకరించియుఁగూడ బాగుగా స్థాపించెను.

ఆ యద్వితీయోపాయము కర్మఫలత్యాగము. ఈ మధ్యబిందువు (గురుత్వాకర్షణశక్తి) నకు నలువైపుల గీతయొక్క సంపూర్ణమగు నలంకరణము చేయబడినది. భక్తి, జ్ఞానము మున్నగునవి దాని కిరుగు పొరుగునఁ

దారామండలములీతి సలంకృతము లయినవి. ఎచట దేహము కలదో యచటఁ గర్మ యుండనే యున్నది. దానినుండి ముక్తుఁడుగనున్న వాఁ డెవఁడును లేఁడు. అయినప్పటికి శరీరమును బ్రహ్మమందిరముగఁ జేసికొనుటచేఁ దద్ద్వారమున ముక్తి లభించు నని సమస్తధర్మములు ప్రతిపాదించినవి. కాని ప్రతికర్మయందుఁ గొంచెము దోషముండనే యున్నది. ముక్తి నిర్దోషికే కలుగుచున్నది. అట్టిచోఁ గర్మబంధనమునుండి అనఁగాఁ గర్మస్పర్శనుండి విమోచనము కలుగు టెట్లు? దీనికిఁ బ్రత్యుత్తరము గీత నిశ్చయాత్మకశబ్దములం దొసంగియున్నది: "నిష్కామ కర్మవలన, యజ్ఞార్థము కర్మచేయుటచేత, కర్మఫలత్యాగమున, సమస్తకర్మలఁ గృష్ణార్పణ మొనరించుటచేత, అనఁగా మనస్సును, వాక్కును, కాయమును నీశ్వరుని యందు హోమముచేయుటచేత."

కాని నిష్కామము, కర్మఫలత్యాగము నోటఁ జెప్పినంతమాత్రమున నెఱవేరవు. ఇది కేవలబు

ప్రయోగము కాదు. ఇది హృదయమథనమువలననే యుత్పన్న మగుచున్నది. ఈ త్యాగశక్తిని బుట్టించుటకు జ్ఞానము కావలయును. ఒకవిధమగు జ్ఞానము నయితే పండితు లనేకులు పొందుచునే యున్నారు. వేదాదులు వారికిఁ గంఠస్థము లగుచున్నవి. కాని వారియం దనేకులు భోగాదులందు మునిఁగి తేలుచున్నారు. జ్ఞానాతిరేకము శుష్క-పాండిత్యరూపముగ నయిపోరాదు. కాఁబట్టి గీతాకారుఁడు జ్ఞానముతోడ భక్తిని గలిపి దానికిఁ బ్రథమస్థానము నొసంగెను. భక్తిశూన్యమగు జ్ఞానము హాని నొదవించును. "కావుననే భక్తిని సాధించుము, జ్ఞానము లభించియే తీరును" అని చెప్పఁబడినది. కాని భక్తి తలక్రిందుగఁ దపస్సుచేయుట వలెఁ గష్టసాధ్యము (అనగాఁ దలవేపనగాయ యగును), కాఁబట్టి గీతాకారుఁడు భక్తుని లక్షణములను స్థితప్రజ్ఞుని లక్షణములవలెనే వర్ణించియున్నాఁడు.

అనఁగా గీతయొక్క-భక్తి బాహ్యాచారిత్వము గాదు,

అంధశ్రద్ధయుఁ గాదు. గీతయందుఁ జెప్పఁబడిన యుపచారములకు బాహ్యచేష్టతో లేదా క్రియతోఁ జాల తక్కువసంబంధమున్నది. జపమాల, తిలకము మఱియు వస్త్రాదిసాధనముల భక్తుఁ డుపయోగించిన నుపయోగించుఁగాక, కాని యవి భక్తియొక్క లక్షణములు గావు. ఎవఁ డెవ్వానిని ద్వేషింపఁడో, ఎవఁడు కరుణాభండారమో, మమకారరహితుఁడో, ఎవఁడు నిరహంకారియో, ఎవనికి సుఖదుఃఖములు శీతోష్ణములు సమానములో, ఎవఁడు సహనశీలుఁడో, ఎవఁడు నిత్యసంతోషియో, ఎవని నిశ్చయము లెన్నఁడు మాఱ్పుఁజెందవో, ఎవఁడు మనస్సును మఱియు బుద్ధిని నీశ్వరుని కర్పణమొనరించివైచెనో, ఎవనివలన జను లుద్వేగమును బడయరో, ఎవఁడు జనులవలని భయమును గలిగి యుండఁడో, ఎవఁడు హర్షము, శోకము మఱియు భయాదులనుండి ముక్తుఁడో, ఎవఁడు పవిత్రుఁడో, ఎవఁడు కార్యదక్షుఁ డయినప్పటికిని తటస్థుఁడో, ఎవఁడు

శుభాశుభములఁ ద్యజించువాఁడో, ఎవఁడు శత్రు మిత్రులందు సమభావమును గలిగి యుండువాఁడో, ఎవనికి మానావమానములు సమానములో, ఎవనికి స్తుతిచే సంతోషమును మఱియు నిందచే గ్లానియుఁ గలుగదో, ఎవఁడు మౌనధారియో, ఎవని కేకాంతము ప్రియమో, ఎవఁడు స్థిరబుద్ధియో వాఁడు భక్తుఁడు. ఈ భక్తి ఆసక్తులగు స్త్రీపురుషులయందుఁ గలుగుట యసంభవము.

ఈరీతిగ జ్ఞానమును బొందుట, భక్తుఁ డగుటయే ఆత్మదర్శన మని మనము చూచుచున్నాము. ఆత్మదర్శనము దానికి భిన్నమగు వస్తువు కాదు. ఎట్లాకరూపా యచే విషమును గొనవచ్చునో మఱియు నమృతమును దేవచ్చునో అట్లనే జ్ఞానము లేదా భక్తిచే బంధనమును బఱయవచ్చును మఱియు మోక్షమును బొందవచ్చు ననుట పొసఁగనేరదు. ఇచట సాధనము మఱియు సాధ్యము పూర్తిగా నొక్కటే. నాకున్నను రమారమిగ నొకే

వస్తువు. సాధనముయొక్క పరాకాష్ఠయే మోక్షము. మఱియు గీతయొక్క మోక్ష మనఁగాఁ బరమశాంతి.

కాని యీవిధమగు జ్ఞానమును మఱియు భక్తిని త్యాగముయొక్క యొరగల్లుపైఁ బరీక్షింపవలసియున్నది. లౌకికకల్పనయందు శుష్కపండితుఁడు సయితము జ్ఞానిగఁ దలంపఁబడుచున్నాఁడు. చేయుటకు వాని కెట్టిపనియు నుండదు. చేతితోఁ జెంబుఁ దీసికొనుట కూడ వానికిఁ గర్మబంధనమే. యజ్ఞశూన్యుఁ డెచట జ్ఞానిగ గణింపఁబడుచున్నాఁడో అచటఁ జెంబునెత్తి తీసికొనుటవంటి తుచ్ఛలౌకికక్రియకు స్థానమే యెట్లు లభించును ?

లౌకికకల్పనయందు భక్తుఁ డనఁగా బాహ్యాచారి, మాలను చేకొని జపము సేయువాఁడు, సేవాకర్మ చేయుచున్నను గూడ వాని మాలయందు విక్షేపము కలుగును. కాఁబట్టి వాఁడు భోజనపానీయాదిభోగముల భోగించు సమయమందే జపమాలను జేతినుండి క్రిందఁ

బెట్టును. తిరుగలి విసరుట లేదా రోగికి సేవాశుశ్రూషచేయు నిమిత్తమెన్నఁడు వారలను విడువఁడు.

ఈ రెండువర్గములకు "కర్మచేయకయే యెవఁడును సిద్ధిని బొందలేఁడు, జనకాదులు సయితము కర్మద్వారముననే జ్ఞానులయి యుండిరి. నేనుకూడ నాలస్యరహితుఁడనయి కర్మచేయకుండ నుందునేని యీలోకములు నాశనమగును" అని గీత స్పష్టముగఁ జెప్పివైచినది. అట్టిచో జనులవిషయమయి యడుగవలసిన దే ముండును?

కాని యొకవైపునుండి సకలకర్మలు బంధనరూపములనుట నిర్వివాదము. రెండవవైపునుండి దేహి యిచ్ఛానిచ్ఛలచేఁగూడ కర్మచేయుచునే యుండును. శారీరకములును లేదా మానసికములును నగు చేష్టలన్నియుఁ గర్మలు. అట్టిచోఁ గర్మచేయుచుండియుఁగూడ మనుష్యుఁడు బంధనముక్తుఁడుగ నెట్లుండును? నాకుఁ దెలిసినంతవఱకీ సమస్య నెట్లు గీత పరిష్కరించియున్నదో

అ క్లోయితర గ్రంథమును జేసియుండలేదు. "ఫలాసక్తిని విడువుము, కర్మచేయుము", "ఆశారహితుఁడవయి కర్మ చేయుము", "నిష్కాముఁడవయి కర్మచేయుము" అని గీతచెప్పుచున్నది. ఇది గీతయొక్క మఱువవీలులేని ధ్వని. కర్మను విసర్జించువాఁడు పడిపోవును. కర్మచేయుచుండియుఁ గూడ దానిఫలమును త్యజించువాఁడు పైకెక్కును.

త్యాగికి ఫలము లభింప దని యిచట ఫలత్యాగమున కేవఁడును నర్థము తీయరాదు. గీతయం దిట్టి యర్థమున కెచ్చటను స్థానములేదు. ఫలత్యాగ మనఁగా ఫలవిషయమం దాసక్తియొక్క యభావము. వాస్తవమునకు ఫలత్యాగికి వేయిరెట్లధికముగ ఫలము లభించును. గీతయొక్క ఫలత్యాగ మం దపరిమితశ్రద్ధయొక్క పరీక్ష కలదు. ఏమనుష్యుఁడు పరిణామమును గూర్చి ఆలోచించుచు నుండునో వాఁ డనేకపర్యాయములు కర్మ-కర్తవ్యము-నుండి భ్రష్టుఁడగును. వాఁ డధీరుఁ డగును,

ఇందుచే నతఁడు క్రోధమునకు వశుఁడయిపోవును, వాఁ డొక కర్మనుండి రెండవదానియందును మఱియు రెండవ దానినుండి మూఁడవదానియందును బ్రవృత్తుఁ డగుచుఁ బోవును. పరిణామమును గుఱించి చింతించువానిస్థితి విషయాంధునిదశవలె నయిపోవును మఱియుఁ దుదకు వాఁడు విషయలోలుని పగిది సారాసారముయొక్కయు, నీత్యవినీతులయొక్కయు వివేకమును విసర్జించివేయును మఱియు ఫలమును బ్రాప్తింపఁజేసికొనుట కిచ్చవచ్చిన సాధనముల నుపయోగించుకొనును మఱియు దానిని ధర్మముగ భావించును.

ఫలాసక్తియొక్క యిట్టి కటుపరిణామమం దుండి గీతాకారుఁడు అనాసక్తియొక్క యనఁగాఁ గర్మఫలత్యాగముయొక్క సిద్ధాంతమును సిద్ధమొన రించెను మఱియు దానిని లోకసమక్షమునం దత్యంతా కర్షణీయమగు భాషయం దుంచెను. ధర్మము మఱియు నర్థము విరోధకములగు వస్తువులని సాధారణముగాఁ దలం

చఁబడుచుండును. "వ్యాపారాది లౌకికవ్యవహారమున ధర్మపాలనము కాఁజాలదు. ధర్మమునకు స్థాన ముండఁజాలదు. ధర్మము కేవలము మోక్షమునిమిత్తమే యుపయోగింపఁబడుచున్నది. ధర్మస్థానమున ధర్మము శోభించును మఱియు నర్థముయొక్క స్థానమునం దర్థము." గీతాకారుఁ డీథర్మమును ద్రోలఁగించెనని నాకు బోధపడెనది. అతఁడు మోక్షమునకును, వ్యవహారమునకును మధ్యమునం దిట్టిభేదము నుంచలేదు. పైపెచ్చు ధర్మమును వ్యవహారమందుఁ బరిణత మొనరించెను. వ్యవహారమునఁ బరిణమింపఁ జేయ వీలులేని ధర్మము ధర్మము కాదను సూచన గీతయం దున్నట్లు నాకు స్పష్టపడుచున్నది. అనఁగా గీతమతానుసారము ఆసక్తి లేకుండ నెఱవేరఁజాలని కర్మలన్నియుఁ ద్యాజ్యములు. ఇట్టి సువర్ణనియమము మనుష్యు ననేకధర్మసంకటములనుండి రక్షించును. ఈ యభిప్రాయము ననుసరించి హత్య, అసత్యము, వ్యభిచారాది కర్మలు సహజముగఁ

ద్వ్యాజ్యము లగుచున్నవి. మానవజీవితము సరళమయి పోవుచున్నది మఱియు సంళత్వమందుండి శాంతి యుదయించుచున్నది. పరిణామవిషయమయి నిర్లక్ష్యముగా నుండుటయు ఫలత్యాగమున కర్థముగాదు. పరిణామము, సాధనవిచారము మఱియు దానిజ్ఞానము అత్యావశ్యకములు. ఇవి కలిగిన పిదప నే మనుష్యుఁడు పరిణామము నిచ్ఛయింపక యే సాధనమందుఁ దన్మయుఁడుగ నుండునో వాఁడు ఫలత్యాగి.

ఈ విచారశ్రేణి ననుసరించుచున్న నాకు గీతాబోధను గార్యాచరణమునఁ బెట్టువాఁడు సహజముగ సత్యమును మఱియు నహింసను బాలింపవలసివచ్చుచుండు నని తెల్లమయ్యెను. ఫలాసక్తి లేకుండ మనుష్యునకుఁ గల్లలాడఁ బేరాసగాని, హింసచేయు వాంఛగాని కలుగనేరదు. ఏహింసాకార్యమును, అసత్యకార్యమును గూర్చి మీరు విచారించినను వానికి మూలము పరిణామేచ్ఛయే యని తెలియఁగలదు. కాని అహింసా

ప్రతిపాదనము గీతావిషయము కాదు. గీతాకాలము నకుఁ దొలుతఁ గూడ, అహింసపరమధర్మరూపముగ భావింపఁబడుచుండెను. గీత అనాసక్తియొక్క సిద్ధాంతమును బ్రతిపాదింపవలసియుండెను. ఈసంగతి రెండవ యధ్యాయమందే స్పష్టపడుచున్నది.

కాని గీత కహింస ప్రాముఖ్యమయి యుండెన లేదా యనాసక్తియం దహింస సహజముగనే వచ్చియే వేయుచున్నచో గీతాకారుఁడు భౌతికయుద్ధము నుదాహరణరూపముగ నేలఁ గైకొనియున్నాఁడు? గీతాయుగమున దహింస ధర్మముగ భావింపఁబడినప్పటికిని గూడ భౌతిక యుద్ధము సర్వసామాన్యవస్తువయి యుండుటచే గీతాకారుఁ డిట్టి యుద్ధము నుదాహరణముగఁ గైకొనుటకు సంకోచించి యుండలేదు, సంకోచింపఁడు.

కాని ఫలత్యాగమహత్త్వము నంచనా వేయుచున్న గీతాకారునిమనస్సునం దెట్టి భావము లుండెను, అతఁడు అహింసయొక్క వ్యాప్తి నెచటికి నిర్ణయించి

యున్నాఁడు, అనువిషయములపై మనము విచారింప నవస
రములేదు. కవి మహాత్వముయొక్క సిద్ధాంతములఁ
బ్రపంచము నెదుటఁ బెట్టును. ఇందుచే నతఁడు లోక
సమస్తమునఁబెట్టు సిద్ధాంతముల మహాత్వమును బూర్తిగ
గ్రహించుచున్నాఁడని గాని, గ్రహించియే యన్నింటిని
భాషాబద్ధ మొనరింపఁగలుగుచున్నాఁ డని గాని అర్థము
తీయవీలు లేదు. ఇందుఁ గావ్యముయొక్కయు మఱియుఁ
గవియొక్కయు మహిమ కలదు. కవియొక్క యర్థముస
కంతము లేదు. మనుష్యులవలెనే మహావాక్యముల యర్థ
ము సయితము వికాసమును జెందుచునే యుండును.
భాషాచారిత్రములఁ బరిశీలించినచో ననేకమహాశబ్ద
ముల యర్థములు నిత్యము నవీనములగుచునే యుండుట
తెలియఁగలదు. ఇదియే గీతార్థము విషయమునను
గలదు. గీతాకారుఁడు స్వయముగ మహావాక్యశబ్దముల
యర్థమును విస్తార మొనరించియున్నాఁడు. ఈవిషయము
గీతను బైపైననే చూచినను స్పష్టపడును. గీతాయుగము

నకుఁ దొలుత నొకవేళ యజ్ఞమందుఁ బశుహింస మాన్య
ముగ నుండెనేమొ, కాని గీతా యజ్ఞమం దెచ్చటను దాని
గంధమయినను లేదు. దానియందు జపయజ్ఞము యజ్ఞ
ములకు రాజు. మూఁడవ యధ్యాయము యజ్ఞమనఁగా
ముఖ్యముగాఁ బరోపకారార్థము శరీరమును వినియోగిం
చుట యని తెలుపుచున్నది. మూఁడు నాలుగు అధ్యా
యములను గలిపి మఱికొన్ని వ్యాఖ్యలను జేయ
వచ్చును. కాని పశుహింసను నిశ్చయింప వీలు లేదు.
అట్లనే గీతయొక్క సన్న్యాసార్థము విషయమునను
బొసఁగుచున్నది. సర్వకర్మపరిత్యాగము గీతయొక్క
సన్న్యాసమునకు నచ్చుటే లేదు. గీతయొక్క సన్న్యాసి
అతికర్మి యయినప్పటికిని గూడ అతియకర్మియుఁ గూడ
ను. ఈరీతి గీతాకారుఁడు మహాశబ్దములకు వ్యాపకార్థ
మును దీసి తన భాషకుఁగూడ వ్యాపకార్థమును దీయు
టను మనకు నేర్పియున్నాఁడు. గీతాకారుని భాషయొక్క
యక్షరములనుండి సంపూర్ణకర్మఫలత్యాగిచే భౌతిక

యుద్ధము కాఁగలదను విషయము కనుపించిన కనుపించవచ్చును. కాని గీతాశిక్షను బూర్ణరూపమునం దాచరణలోఁ బెట్టుటకు 40 సంవత్సరములవఱకు నిరంతర ప్రయత్నముచేసిన నాకు నమ్రతాపూర్వకముగ, సత్యమును మఱియు నహింసను బూర్ణరూపమునఁ బాలింపనిదే సంపూర్ణకర్మఫలత్యాగము మనుష్యున కసంభవమని బోధపడినది.

గీత సూత్రగ్రంథము కాదు. గీత యొకమహోత్తరమయిన ధర్మకావ్యము. దానిలోని కెంతలోతుగఁ బ్రవేశించిన నంతమహోత్తరములును, సుందరములును నగు నర్థములు లభింపఁగలవు. గీత జనసామాన్యముకొఱకేర్పడినది. దానియం దొక్కేవిషయ మనేకవిధములఁ జెప్పఁబడినది. కావున గీతయొక్క మహాశబ్దములయర్థము యుగయుగమున మారుచు విస్తృతమగుచు నుండఁగలదు. గీతయొక్క మూలమంత్ర మెన్నఁడు మారఁజాలదు. ఈమంత్ర మెట్లు సిద్ధింపఁజేయఁబడఁగలదో అట్లు

జిజ్ఞాసులు దీని కర్థమును దీసికొనవచ్చును.

గీత విధినిషేధమును దెలుపునదియుఁ గాదు. ఒకని కేది విహితమగునో అదియే రెండవవానికి నిషిద్ధము కావచ్చును. ఒక కాలమందు లేదా యొకదేశమం దేది విహితమగునో అది మఱొకకాలమున, మఱొకదేశమున నిషిద్ధము కావచ్చును. నిషిద్ధము కేవలము ఫలాసక్తి, విహిత మనాసక్తి.

గీతయందు జ్ఞానమహిమ సురక్షితముగ నున్నది. అయినప్పటికి గీత బుద్ధిగమ్యము కాదు. అది హృదయగమ్యము. అందుచే నది అశ్రద్ధాళువునకయి యేర్పడలేదు. గీతాకారుఁడే చెప్పియున్నాఁడు:

"ఎవఁడు తపస్వి కాఁడో, ఎవఁడు భక్తుఁడు కాఁడో, ఎవఁడు వినఁగోరఁడో మఱియు నెవఁడు నన్ను ద్వేషించుచుండునో వాని కిది (జ్ఞానము) నీ వెన్నఁడును జెప్పవలదు." ౧౮౼౬౭ శ్లో.

"కాని యీ పరమగుహ్యజ్ఞానము నెవఁడు

నా భక్తుల కొసంగునో వాఁడు పరమభక్తిని గలిగియుండు టచే నిస్సందేహముగా నన్నే పడయును."

౧౮అ. ౬౮శ్లో.

"మఱియు నే మనుష్యుఁడు ద్వేషరహితుఁడయి శ్రద్ధాపూర్వకముగఁ గేవలము వినునో వాఁడు సయితము ముక్తుఁడయి పుణ్యాత్ము లెచట నివసించుచున్నారో ఆ శుభలోకమును బొందును."

౧౮అ. ౭౧శ్లో.

కౌసానీ (హిమాలయము)
౧౯౮౬సం॥ జ్యేష్ఠమాస కృష్ణపక్ష
విదియ సోమవారము,
ది ౨౪-౬-౨౯.

మోహనదాసు
కరంచందు గాంధి.

# విషయసూచిక.



# నిష్కామయోగము.

౧

## అర్జునవిషాదయోగము.

జిజ్ఞాస లేకుండ జ్ఞానము లేదు. దుఃఖము లేకుండ సుఖము లేదు. ధర్మసంకటము-హృదయమథనము సమస్త జిజ్ఞాసువుల కొక్కసారి కలుగుచునే యున్నది.

ధృతరాష్ట్ర ఉవాచ:—

శ్లో. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ. ౧

ధృతరాష్ట్రుఁడు చెప్పెను: ఓ సంజయా! ధర్మక్షేత్రరూపమగు కురుక్షేత్రమున యుద్ధముఁజేయు

నిచ్ఛచే గుమిగూడిన నాపుత్త్రులును, పాండుపుత్త్రులును నేమిచేసిరి?

వ్యాఖ్యానము: ఈ శరీరరూపమగు క్షేత్త్రము ధర్మక్షేత్త్రము; కారణమేమన నిది మోక్షద్వారము కాఁ గలుగుచున్నది. పాపమునుండి దీనియుత్పత్తి కలిగినది. మఱియు నిది పాపమునకే భాజనమయి యుండుచున్నది; కావున నిది కురుక్షేత్త్రము.

కౌరవు లనఁగా నాసురీప్రవృత్తులు. పాండుపుత్రులనఁగా దైవీప్రవృత్తులు. ప్రతిదేహమునందు దుష్టశిష్టప్రవృత్తులనడుమ యుద్ధము జరుగుచునే యుండును; ఇది యెవఁ డనుభవించుట లేదు?

సంజయ ఉవాచ:—

దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా,
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. ౨

సంజయుఁడు చెప్పెను: ఆ సమయమునఁ బాండవులసేన వ్యూహాకృతిని ధరించుటఁ జూచి దుర్యోధన

మహారాజు ద్రోణాచార్యుని చెంత కరిగి నుడివెను.

> పశ్యైతాం పాండుపుత్త్రాణా మాచార్య మహతీం చమూమ్,
> వ్యూఢాం ద్రుపదపుత్త్రేణ తవ శిష్యేణ ధీమతా.　　3

ఓ యాచార్యా! బుద్ధిమంతుఁడును, ద్రుపద పుత్త్రుఁడును, మీ శిష్యుఁడును నగు ధృష్టద్యుమ్నునిచే వ్యూహబద్ధమొనరింపఁబడిన పాండవుల యీగొప్పసే నను జూడుఁడు.

> అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి,
> యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః.　　౪

ఇచట భీమార్జునులవంటి యుద్ధమొనరింపఁగల శూరవీరులగు ధనుర్ధరులును, యుయుధానుఁడు (సాత్య కి) ను, విరాటుఁడును, మహారథుఁడగు ద్రుపదరాజును,

> ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్,
> పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః.　　౫

ధృష్టకేతువును, చేకితానుఁడును, వీర్యవంతుఁడగు కాశీరాజును, పురుజితుఁడును, కుంతిభోజుఁడును, మనుష్యు

ఉలో శ్రేష్ఠుఁడగు శైబ్యుఁడును,

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః. ౬

ఈ ప్రకారముగఁ బరాక్రమసంపన్నుఁడగు యుధామన్యుఁడును, బలవంతుఁడగు నుత్తమౌజుఁడును, సుభద్రాతనయుఁడు (అభిమన్యుఁడు)ను, ద్రౌపదీ పుత్రులును వీరందఱు మహారథులయియున్నారు.

అస్మాకంతు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. ౭

ఓ బ్రాహ్మణోత్తమా! ఇఁక మనవైపునఁ గల ముఖ్యనాయకులను మీరు తెలిసికొనుఁడు. మన సేన యొక్క నాయకుల నామములు నేను మీధ్యానమునకుఁ దెచ్చుటకయి తెలుపుచున్నాఁడను.

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ. ౮

మీరొకరు, భీష్ముఁడు, కర్ణుఁడు, యుద్ధమున విజ

యుఁడగు కృపాచార్యుఁడు, అశ్వత్థామ, వికర్ణుఁడు, సోమదత్తుని పుత్రుఁడగు భూరిశ్రివుఁడు.

అన్యేచ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః,
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః. ౯

మఱియు నానావిధశస్త్రములతో యుద్ధముచేయునట్టియు, నానిమిత్తము ప్రాణముల నొసంగునట్టియు నితరులగు ననేకశూరవీరులు కలరు. వారందఱు యుద్ధములోఁ బ్రవీణులు.

అపర్యాప్తం త దస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్. ౧౦

భీష్మునిచే సంరక్షితమయిన మన సేనయొక్క బల మపూర్ణము; కాని భీమునిచే రక్షితమగు వారిసేన పూర్ణము.

అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః,
భీష్మమే వాభిరక్షంతు భవంత స్సర్వఏవహి. ౧౧

కాఁబట్టి మీరందఱు తమతమ స్థానములనుండి

సమస్తమార్గములనుండియు భీష్మపితామహుని బాగుగా రక్షింపుఁడు. (ఈచందమున దుర్యోధనుఁడు చెప్పెను.)

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్. ౧౨

అప్పు డతని నానందింపఁజేయుచుఁ గురువృద్ధుఁడును, ప్రతాపవంతుఁడును నగు పితామహుఁ డుచ్చైస్స్వరమున సింహనాద మొనరించి శంఖము నూఁదెను.

తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః,
సహసైవాభ్యహన్యంత స శబ్ద స్తుములో ఽభవత్. ౧౩

అనంతరము శంఖములును, నగారాలును, డోళ్లును, మృదంగములును, రణభేరులును నొక్కసారిగనే మ్రోగెను. ఈ నాదము భయంకరముగా నుండెను.

తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. ౧౪

ఇంతలో శ్వేతాశ్వములయొక్క గొప్పరథమునఁ గూర్చుండి శ్రీకృష్ణార్జునులు దివ్యశంఖములఁ బూరించిరి.

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. ౧౫

శ్రీకృష్ణుఁడు పాంచజన్యశంఖమును బూరించెను. ధనంజయుఁ డగు నర్జునుఁడు దేవదత్తశంఖము నూఁదెను. భయంకరకర్మగల భీముఁడు పౌండ్ర మను మహాశంఖము నూఁదెను.

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ. ౧౬

కుంతీపుత్రుఁ డగు యుధిష్ఠిరమహారాజు అనంతవిజయ మను శంఖము నూఁదెను. నకులుఁడు సుఘోష మను శంఖమును, సహదేవుఁడు మణిపుష్పక మను శంఖమును నూఁదిరి.

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీచ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః. ౧౭

మహాధనుర్ధరుఁ డగు కాశీరాజును, మహారథుఁ డగు శిఖండియు, ధృష్టద్యుమ్నుఁడును, విరాటరాజును,

అజేయుఁ డగు సాత్యకియు,

దృపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహు శ్శంఖాన్ దధ్ముః పృథక్పృథక్. ౧౮

ద్రుపదరాజును, ద్రౌపదీపుత్రులును, సుభద్రాపుత్రుఁడును మహాబాహుఁడును నగు నభిమన్యుఁడును నీ రందఱును, ఓరాజా! తమ తమశంఖముల నూఁదిరి.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీంచైవ తుములో వ్యనునాదయన్. ౧౯

పృథ్వని, ఆకాశమును బ్రతిధ్వనింపఁజేయు నా భయంకరనినాదము కౌరవుల హృదయముల వ్రయ్యఁజేసెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః. ౨౦
హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే!

అర్జున ఉవాచ:—

సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మే ఽచ్యుత. ౨౧

ఓ రాజా! తన ధ్వజముపై హనుమంతునిగలిగి యున్న యర్జునుఁడు కౌరవులు సజ్జితు లగుటఁ జూచి, శస్త్రప్రయోగసన్నాహసమయమునఁ దన ధనుస్సు నెక్కుపెట్టి హృషీకేశునితో నీ మాటలఁ జెప్పెను; అర్జునుఁడు నుడివెను, 'ఓ యచ్యుతా! నా రథమును రెండుసేనల మధ్యమున నిలుపుము.'

యావ దేతాన్ నిరీక్ష్యే ఽహం యోద్ధుకామా నవస్థితాన్,
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే. ౨౨

అందువలన యుద్ధవాంఛచే నిలిచియున్నవారిని చూచెదను. మఱియు నీ యుద్ధభూమిలో నే నెవనితో బోరవలసియున్నదియుఁ దెలిసికొందును;

యోత్స్యమానా నవేక్షే ఽహం య ఏతే ఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః. ౨౩

'యుద్ధమున దుర్బుద్ధియగు దుర్యోధనుని హిత మొనరింప నిచ్ఛగలిగి పోగయిన యోధులను నన్నుఁ జూడనిమ్ము.'

గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే,
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవచ మే మనః. ౩౦

చేతినుండి గాండీవము జారిపడుచున్నది. దేహము మిక్కిలి దహించుకొనిపోవుచున్నది. నాబుద్ధి తిరిగిపోవుచున్నట్లున్నది. కాన నేను నిలువఁజాలకున్నాఁడను.

నిమిత్తానిచ పశ్యామి విపరీతాని కేశవ,
న చశ్రేయో ఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే. ౩౧

ఇదిగాఁక ఓ కేశవా! నేను విపరీతలక్షణములను జూచుచున్నాఁడను. యుద్ధమున స్వజనులఁ జంపుటలో నా కెట్టి శ్రేయస్సును గాననగుటలేదు.

నకాంక్షే విజయం కృష్ణ నచ రాజ్యం సుఖానిచ,
కిం నో రాజ్యేన గోవింద కిం భోగై ర్జీవితేనవా. ౩౨

వారిని జంపి నేను విజయమును గోరను. నాకు రాజ్య మక్కఱలేదు. సుఖమును వలదు. ఓ గోవిందా! నాకు రాజ్యము, భోగము లేల; బ్రదికియుండవలసిన పని యే మున్నది?

యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖానిచ,
త ఇమే౽వస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ. ౩౩
ఆచార్యాః పితరః పుత్త్రా స్తథైవచ పితామహాః,
మాతులాః శ్వశురాః పౌత్త్రాః శ్యాలా స్సంబంధిన స్తథా. ౩౪

ఎవరికొఱకు రాజ్యమును, భోగమును, సుఖమును మేము గోరియుంటిమో, ఆ యాచార్యులు, పినతండ్రులు, పుత్త్రులు, పితామహులు, మేనమామలు, మామలు, పౌత్త్రులు, బావమఱఁదులు మఱియు నితరులగు స్వజనులు జీవితముయొక్కయు, ధనముయొక్కయు నాశను విడిచి యుద్ధమునకయి నిలిచియున్నారు.

ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతో౽పి మధుసూదన,
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే. ౩౫

వీరు నన్నుఁ జంపినైచినను లేక నాకుఁ ద్రిలోకముల రాజ్యము లభించినను గూడ, ఓ మధుసూదనా! నేను వారిని జంప నభిలషింపను. అట్టిచోఁ గొంచెము భూమికొఱ కెట్లు చంపుదును?

నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన,
పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః. ౩౬

ఓ జనార్దనా! ధృతరాష్ట్రుని పుత్రులఁ జంపి నే నేమి యానందమును బొందఁగలను? ఈయాతతాయులను గూడఁ జంపుటచే మనలఁ బాపమే చుట్టుకొనును.

తస్మా న్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్స్వబాంధవాన్,
స్వజనంహి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ. ౩౭

ఇందుచే నో మాధవా! మనయొక్క బంధువులగు ధృతరాష్ట్రుని పుత్రుల మనము చంపు టుచితము గాదు. స్వజనులనే చంపి మన మెట్లు సౌఖ్యవంతులము కాఁగలము?

యద్యప్యేతే నపశ్యంతి లోభోపహతచేతసః,
కులక్షయకృతం దోషం మిత్రద్రోహేచ పాతకమ్. ౩౮

కథం నజ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్,
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన. ౩౯

లోభముచే మలినములయిన చిత్తములు గల

వారు కులనాశనముచేఁ గలుగు దోషమును, మిత్ర
ద్రోహముయొక్క పాపమును గ్రహింపకపోయిన
గ్రహింపక పోవచ్చును. కాని యో జనార్దనా! కుల
నాశనముచేఁ గలుగు దోషమును గ్రహించు మన
మేల యీ పాపమునుండి తప్పించుకొను తెఱుంగకుండ
నుండవలెను ?

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవ త్యుత. ౪౦

కులక్షయముచే సనాతనకులధర్మములు నశించు
చున్నవి. ధర్మము నశించుటచే నధర్మము సమస్తకుల
మును ముంచివేయు చున్నది.

అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. ౪౧

ఓ కృష్ణా! అధర్మము వృద్ధియగుటచేఁ గుల
స్త్రీలు చెడిపోవుచున్నారు. వారు చెడిపోవుటచే వర్ణ
సంకర మగుచున్నది.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. ౪౨

ఇట్టి సంకరమువలనఁ గులఘాతకుఁడు, వాని కులము నరకవాసమునకుఁ బాల్పడును. మఱియుఁ బిండోదకక్రియలనుండి వంచితు లగుటచే వానిపితరుల కధోగతి సంప్రాప్త మగుచున్నది.

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. ౪౩

కులఘాతకుల యీ వర్ణసంకరము నుత్పన్నముఁ జేయు దోషములచే సనాతనజాతిధర్మములు, కులధర్మములు నశించుచున్నవి.

ఉత్పన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ. ౪౪

ఓ జనార్దనా! ఎవ్వాని కులధర్మము నశించి నదో, అట్టి మనుష్యునకుఁ దప్పక నరకవాసము కలుగుచున్నది, అని మనము వినుచు వచ్చియున్నారము.

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః. ౪౫

అయ్యో! ఎంత విచారకర మగు సంగతి! మనము మహాపాప మొనరింప సిద్ధపడినారము, అనఁగా రాజ్యసుఖలోభముచే స్వజనుల సంహరింప సన్నద్ధుల మయినారము.

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్. ౪౬

శస్త్రహీనుఁడనయి, ఎదుర్కొనని నన్ను ధృతరాష్ట్రుని శస్త్రధారులగు పుత్త్రులు రణమందుఁ జంపి వైచినను నది నాకు మిక్కిలి శ్రేయస్కర మగును.

సంజయ ఉవాచ :—

ఏవ ముక్త్వా ఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః. ౪౭

సంజయుఁడు చెప్పెను: ఇట్లు చెప్పి రణమందు శోకముచే వ్యగ్రచిత్తుఁడయిన యర్జునుఁడు ధనుర్బాణ

కొని నిర్విచారభావముతో దానియందుఁ బరాయణుఁడయి యుండవలయును. ఇట్టి పరాయణతచే వాఁడు మోక్షమును బడయఁగలుగుచున్నాఁడు.

సంజయ ఉవాచ:—

తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః. ౧

సంజయుఁడు చెప్పెను: ఈరీతిఁ గరుణచే దీనుఁడయినట్టియు, నశ్రుపూర్ణ వ్యాకుల నేత్రములు గలట్టియు దుఃఖితుఁ డగు నర్జునునితో మధుసూదనుఁ డీమాటలఁ జెప్పెను.

శ్రీ భగవా నువాచ:—

కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. ౨

శ్రీ భగవానుఁడు చెప్పెను: ఓ యర్జునా! శ్రేష్ఠపురుషుల కయోగ్యమును, స్వర్గమునుండి విముఖముగ నుంచునట్టియు మఱియు నపకీర్తిఁ దెచ్చునట్టియు

నీ మోహము నీ కీవిషమ మగు గడియయం దెటనుండి దాపురించినది ?

> క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే,
> క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప. 3

ఓ పార్థా ! నీవు పిఱికిపందవు గానలదు. ఇది నీకు శోభ నీయదు. హృదయముయొక్క పామరదుర్బలత్వమును త్యజించి యో పరంతపా ! నీవు లెమ్ము.

అర్జున ఉవాచ:—

> కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన,
> ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. ౪

అర్జునుఁడు చెప్పెను : ఓ మధుసూదనా! భీష్ముని ద్రోణుని రణభూమియందు బాణములతో నే నెట్లు చంపుదును ? ఓ యరిసూదనా ! వీరు పూజనీయులు గదా !

> గురూ నహత్వా హి మహానుభావాన్
> శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే,

హత్వార్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్. ౫

మహానుభావులగు గురుజనులఁ జంపుటకు మాఱుగా నీ లోకములో భిక్షాన్నమును దినుటగూడ లెస్స. ఎందు కన గురుజనులను జంపుటవలన నేను రక్తముచేఁ దడిసిన అర్థకామరూపములగు భోగములే భోగింపవలసి యుండును.

నచైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః,
యా నేవ హత్వా న జిజీవిషామ
స్తే ఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. ౬

మనము జయించుటయో లేక వారు మనల జయించుటయో, ఈ రెంటిలో నేది మంచిదియో నాకుఁ దెలియుటలేదు. ఎవ్వారిని జంపి నేను బ్రదుకఁ గోరనో, ఆధృతరాష్ట్రునిపుత్రు లెదుట నిలిచియున్నారు.

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః,

యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి త న్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. ౭

పిఱికితనముచే నా (జాతీయ) వృత్తి హత మొనరింపఁ బడినది. నేను కర్తవ్యవిమూఢుఁడనయి యున్నాను. కాఁబట్టి దేనిచే నాకు హితము కలుగునో, దానిని నాకు నిశ్చయపూర్వకముగఁ జెప్పుటకయి నిన్నుఁ బ్రార్థించుచున్నాఁడను. నేను నీ శిష్యుఁడను, నీశరణుఁజొచ్చి యున్నాఁడను. నాకుమార్గము దెల్పుము.

నహి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మిన్ద్రియాణామ్,
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్. ౮

ఈలోకమున ధనధాన్యసంపన్నమగు నిష్కంటక రాజ్యము లభించినను, మఱియు నింద్రాసనము సయితము లభించినను, దానిలోనుండి యింద్రియముల శోషింపఁజేయు నాశోకమును దొలఁగింపఁగల దెద్దియు నాకుఁ గాన నగుట లేదు.

సంజయ ఉవాచ:—

ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతప,
న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ. ౯

సంజయుఁడు చెప్పెను: ఓరాజా! గుడాకేశుఁడగు నర్జునుఁడు హృషీకేశుఁడగు గోవిందునితోఁ బైరీతిగఁ జెప్పి 'పోరాడను' అని నుడివి యూరకుండెను.

త మువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత,
సేనయో రుభయో ర్మధ్యే విషీదంత మిదం వచః. ౧౦

ఓ భారతా! ఈ రెండుసేనల నడుమఁ జింతితుఁడయి కూర్చొనియున్న యర్జునునితోఁ జిరునగవు నవ్వుచు హృషీకేశుఁ డీవచనముల నుడివెను:

శ్రీభగవానువాచ:—

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. ౧౧

శ్రీ భగవానుఁడు చెప్పెను: నీవు శోకింప నక్కఱలేనివారినిగూర్చి శోకించుచున్నావు, మఱియుఁ

బండితవచనములఁ బలుకుచున్నావు, కాని పండితులు చచ్చినవారిని గూర్చియు బ్రదికియున్నవారిని గుఱించియు శోకింపరు.

నత్వేవాహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః,
నచైవ నభవిష్యామ స్సర్వే వయ మతః పరమ్. ౧౨

కారణ మేమన వాస్తవముఁ జూచిన నేను, నీవు లేక యీ రాజులు నొకానొకకాలమందు లేకుండిరి అథనా ముం దుండరు, అను విషయ మేమియు లేదు.

దేహినో౽స్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర నముహ్యతి. ౧౩

దేహధారి కెట్లీ శరీరమునఁ గౌమారయౌవన వార్ధక్యములు ప్రాప్తించుచున్నవో, అట్లెగనే యన్య దేహప్రాప్తియుఁ గలుగుచున్నది. దానివిషయమున బుద్ధిమంతుఁడగు పురుషుఁడు మోహమును బొందఁడు.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినో౽నిత్యా స్తాం స్తితిక్షస్వ భారత. ౧౪

ఓ కౌంతేయా! ఇంద్రియస్పర్శలు శీతమును, ఉష్ణమును, సుఖమును మఱియు దుఃఖమును నిచ్చునవయి యున్నవి. అవి యనిత్యములయి యున్నవి, వచ్చుచున్నవి మఱియుఁ బోవుచున్నవి. వానిని నీవు సహించుము.

యం హి న వ్యథయం త్యేతే పురుషం పురుషర్షభ,
సమదుఃఖసుఖం ధీరం సో ఽమృతత్వాయ కల్పతే. ౧౫

ఓ పురుషశ్రేష్ఠా! సుఖదుఃఖములందు సమముగా నుండు నే బుద్ధిమంతుఁడగు పురుషు నీ విషయములు వ్యాకులు నొనరింపవో, అతఁడు మోక్షమునకు యోగ్యుఁ డగుచున్నాఁడు.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయో రపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః. ౧౬

అసత్తున కస్తిత్వము లేదు, మఱియు సత్తునకు నాశనము లేదు. ఈ రెంటియొక్క నిర్ణయమును జ్ఞానులు తెలిసికొని యున్నారు.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్,
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి. ౧౭

దేనిచే నీయఖిలజగత్తు వ్యాప్తమయి యున్నదో దానిని నీ వవినాశిగఁ దెలియుము. ఈయవ్యయమును నశింపఁజేయుట కెవఁడును సమర్థుఁడు గాఁడు.

అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః,
అనాశినో ఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత. ౧౮

నిత్యముగా నుండునట్టియు, అపరిమితమును మఱియు నవినాశియు నగు దేహియొక్క యీదేహములు నశ్వరము లని చెప్పఁబడియున్నవి. కాఁబట్టి యోభారతా! నీవు యుద్ధము చేయుము.

య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే. ౧౯

ఎవఁడు దీనిని జంపుదానిగ భావించునో మఱియు నెవఁడు దీనిని జంపఁబడినదానిగఁ దలంచునో వారిరువురి కేమియుఁ దెలియదు. ఇది (ఆత్మ) చంపుట లేదు, చంపఁబడుటయు లేదు.

న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా నభూయః,
అజో నిత్యః శ్శాశ్వతో ఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. ౨౦

ఇది యెన్నడూ పుట్టుటలేదు, గిట్టుటలేదు ; ఇది యుండెను మఱియు నిఁకముందుండదు అను నిట్టి దేమియు లేదు. కాఁబట్టి యిది పుట్టువులేనిది, నిత్యము, శాశ్వతము, పురాతనము; శరీరము నశించుటచే నిది నశింపదు.

వేదా వినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతికమ్. ౨౧

ఓపార్థా! ఏపురుషుఁ డాత్మ నవినాశిగను, నిత్యముగను, జన్మలేనిదిగను మఱియు నవ్యయముగను భావించునో వాఁ డెవని నెట్లు చంపించును లేక యెవనిని జంపును?

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరో ఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ.

ఎట్లు మనుష్యుఁడు చినిగిన వస్త్రముల విడిచి నూతనము లగు వానిని ధరించుచున్నాఁడో, అట్లు దేహధారి జీర్ణమయిన దేహమును ద్యజించి యన్యనూతన దేహమును బొందుచుండును.

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః,
నచైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః. ౨౩

దీని (ఆత్మ)ని శస్త్రములు ఖండింపలేవు, అగ్ని దహింపలేదు, నీరు తడుపలేదు, వాయు వెండింపలేదు.

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ,
నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః. ౨౪

ఇది ఖండింపఁబడఁజాలదు; దహింపఁబడఁజాలదు, తడుపఁబడఁజాలదు, ఎండింపఁబడఁజాలదు, ఇది నిత్యము, సర్వగతము, స్థిరము, అచలము మఱియు సనాతనము.

అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే,
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. ౨౫

తోడనే యింద్రియములకు మఱియు మన

స్సునకు నగమ్యము, వికారరహితమని చెప్పఁబడినది, కాఁబట్టి దీని నట్టిదిగా నెఱింగి నీవు శోకించు టుచితము గాదు.

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్,
తథాపి త్వం మహాబాహో నైనం శోచితు మర్హసి. ౨౬

అథవా నీవు దీనిని నిత్యము జన్మించుదానిగను మఱియుఁ జచ్చుదానిగను దలంచినను గూడ నో మహాబాహుఁడా! నీవు శోకించు టుచితము గాదు.

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహార్యే ఽర్థే న త్వం శోచితు మర్హసి. ౨౭

జన్మించినవారికి మృత్యువును మఱియు మరణించినవారికి జన్మయు ననివార్యములు. కాఁబట్టి యేది యనివార్యమో దానికయి శోకించు టుచితము గాదు.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనా న్యేవ తత్రి కా పరిదేవనా. ౨౮

ఓ భారతా! సకలభూతముల జన్మకుఁ దొల్లింటియు మఱియు మృత్యువునకుఁ బిమ్మటియు స్థితి జూడఁ

బడఁజాలదు; అది యవ్యక్తము, మధ్యస్థితియే వ్యక్తమ గుచున్నది. దీనిలోఁ జింతించుట కేమి కారణ మున్నది?

వ్యాఖ్యానము: భూతము లనఁగా స్థావరజంగమసృష్టి.

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః,
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్. ౨౯

ఒకానొకఁడు దీని నాశ్చర్యసమానముగఁ జూచు చున్నాఁడు; రెండవవాఁడు దాని నాశ్చర్యసమాన ముగ వర్ణించు చున్నాఁడు; మఱియొకఁడు దాని నాశ్చర్యసమానముగ వర్ణింపఁబడగా వినుచున్నాఁడు; కాని వినినప్పటికిని గూడ నెవఁడు దానిని దెలియుటలేదు.

దేహీ నిత్య మవధ్యో ఽయం దేహే సర్వస్య భారత,
తస్మా త్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి. ౩౦

ఓ భారతా! ఎల్లరి దేహముననుండు నీ దేహ ధారియగు నాత్మ నిత్య మవధ్యము; అందుచే భూత ముల విషయమున నీవు శోకించు టుచితము గాదు.

వ్యాఖ్యానము : ఇచటిదనుక శ్రీకృష్ణుఁడు బుద్ధిప్ర యోగముచే నాత్మయొక్క నిత్యత్వమును మఱియు దేహముయొక్క యనిత్యత్వమును దెలిపి, ఏస్థితియందైన దేహమును నశింపఁజేయు టుచితముగఁ దలంపఁబడుచో స్వజనులు పరజను లను భేదమును గావించి కౌరవులు నావారు కాఁబట్టి వారి నెట్లు చంపనగును అను నీత లంపు మోహంజన్యము. ఇఁక నర్జునునకు క్షత్రియధర్మ మేమియో తెలుపుచున్నాఁడు.

స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయో ఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే.

స్వధర్మమును గ్రహించినయితము నీవు చలించు టుచితము గాదు, ఎందు కన ధర్మయుద్ధముకంటె క్షత్రి యునకు మఱెద్దియు నధిక శ్రేయస్కరము కాఁజాలదు.

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్,
సుఖినః క్షత్రియాః పార్థ! లభంతే యుద్ధ మీదృశమ్. ౩౨

ఓ పార్థా! ఇట్లు తనంతట తానుగాఁ బ్రాప్తించి

నట్టియు మఱియు స్వర్గద్వారమే తెరచుకున్నదో యన్న ట్లుగను నున్నయిట్టి యుద్ధము భాగ్యశాలులగు క్షత్రియు లకే లభించుచున్నది.

అథ చే త్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి,
తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి. 33

నీ వీ ధర్మప్రాప్తమగు యుద్ధముఁ జేయకుందు వేని స్వధర్మమును మఱియుఁ గీర్తిని గోల్పోయి పాప మును బొగుచేసికొందువు.

అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తే ఽవ్యయామ్,
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. 34

ఎల్లరు నిన్ను నిరంతరము నిందించుచుందురు. మఱియు సమ్మానితపురుషున కపకీర్తి మరణముకంటెఁ గూడఁ జెడ్డది.

భయా ద్రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః,
యేషాంచ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్. 35

ఏ మహారథులచే నీవు సమ్మానింపఁబడితివో

వారే నిన్ను భయముచే రణమునుండి పాఱిపోయితి వని తలంచెదరు. మఱియు నిన్నుఁ దుచ్ఛునిగ భావింతురు.

అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః,
నిందంత స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్. ౩౬

మఱియు నీ శత్రువులు నీబలమును నిందించుచు ననేకములగు ననరాని మాటల నందురు. ఇంతకంటె నధికదుఃఖదాయకము మఱేమి కాఁగలదు ?

హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్,
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః. ౩౭

నీవు చంపఁబడినచో నీకు స్వర్గము లభించును. నీవు జయింతువేని పృథ్విని భోగించెదవు. ఇందుచే నో కౌంతేయా ! పోరుటకు నిశ్చయించి నీవు లేచి నిలువఁ బడుము.

వ్యాఖ్యానము: ఈరీతి భగవానుఁ డాత్మయొక్క నిత్యత్వమును మఱియు దేహముయొక్క యనిత్యత్వమును దెలిపెను. మఱియు సహజప్రాప్తమగు యుద్ధముఁ

జేయుటలో క్షత్రియునకు ధర్మముయొక్క బాధ కలుగ
దనియుఁగూడఁ దెలిపెను. ఈచందమున 31 వ శ్లోక
ముచే భగవానుఁడు పరమార్థముతోడ నుపయోగసం
బంధమును గలిపియున్నాఁడు. ఇట్లు చెప్పి తిరిగి భగవా
నుఁడు గీతయొక్క ముఖ్యబోధయొక్క దిగ్దర్శనమొక్క
శ్లోకమునఁ గావించుచున్నాఁడు.

సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి. ౩౮

సుఖమును మఱియు దుఃఖమును, లాభమును
మఱియు నష్టమును, జయమును మఱియు బరాజయ
మును సమానముగా భావించి యుద్ధమొనరించుటకుఁ
దత్పరుఁడవు కమ్ము. ఇట్లు చేయుటచేనిన్నుఁ బాపమంటదు.

ఏషా తే ఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి. ౩౯

నేను నీకు సాంఖ్యసిద్ధాంతము (తర్కవాదము)
ననుసరించి నీ యీకర్తవ్యమును దెలిపితిని.

ఇఁక యోగవాదము ననుసరించి తెలుపుచున్నాఁ డను అది వినుము. దీని నాశ్రయించుటచే నీవు కర్మ నమును త్రెంచఁగలవు.

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే,
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్. ౪౦

ఇం దారంభనాశన ముండదు. విపరీతపరిణామ ము కలుగదు. ఈధర్మముయొక్క యత్కించిత్పాలనము గూడ మహాభయమునుండి రక్షించుచున్నది.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన,
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్. ౪౧

ఓకురునందనా! యోగవాదియొక్క నిశ్చయా త్మకబుద్ధి యేకరూపముగనుండును, కాని యనిశ్చయము గలవారిబుద్ధులు అనేకశాఖలు గలవిగను మఱియు ననం తములుగను నుండును.

వ్యాఖ్యానము: బుద్ధి యేకముగానుండక అనేక (బుద్ధులు)ముగనయినపుడు అదిబుద్ధిగానుండక వాసనా

రూపమును ధరించుచున్నది. అందుచే బుద్ధులనఁగా వాసనలు.

యా మిమాం పుష్పితాం వాచం ప్రవదం త్యవిపశ్చితః,
వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః. ౪౨
కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్,
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి. ౪౩
భోగైశ్వర్యప్రసక్తానాం తయా ఽపహృతచేతసామ్,
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే. ౪౪

అజ్ఞానులగు వేదవాదులు, 'ఇదితప్ప వేఱేమియు లేదు' అనిచెప్పువారు, కామనలుగలవారు, స్వర్గమును శ్రేష్ఠముగాఁ దలంచువారు, జనన మరణ రూపమగు కర్మఫలము నిచ్చునట్టియు, భోగము మఱియు నైశ్వర్యము లభించునిమిత్తము చేయఁబడుకర్మల వర్ణనముతో నిండి యున్న మాటలను బెంచిపెంచి చెప్పుచున్నారు; భోగము మఱియు నైశ్వర్యమునం దాసక్తులయియుండువారి యాబుద్ధి హరింపఁబడుచున్నది; వారిబుద్ధి నిశ్చయము

కలదిగఁగాని, మఱియు సమాధివిషయమయి స్థిరమయి నదిగఁ గాని యుండఁజాలదు.

వ్యాఖ్యానము : యోగవాదమునకు విరుద్ధముగ కర్మకాండ అథవా వేదవాదముయొక్క వర్ణనముపైని మూఁడు శ్లోకముల వచ్చినది. కర్మకాండ లేక వేదవాద మనఁగా ఫలము నుత్పన్నముచేయుటకొఱకు మంథనముచేయు నసంఖ్యాకములగు క్రియలు. ఈ క్రియలు వేదరహస్యమునుండియు, వేదాంతమునుండియు వేఱును మఱియు నల్పపరిణామము గలవియు నయియుండుటచే నిరర్థకములు.

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. ౪౫

ఓ యర్జునా! ఏ మూఁడుగుణములు వేదవిషయములయి యున్నవో వానినుండి నీ వలిప్తుఁడవుగా నుండుము. సుఖదుఃఖాది ద్వంద్వములనుండి ముక్తుఁడవగుము. నిత్యసత్యవస్తుస్థితుఁడ వగుము. ఏవస్తువును బడయుట

యొక్కయు, సంబాళించుకొనుటయొక్కయు జాజాట మునుండి ముక్తుఁడవుగా నుండుము. ఆత్మపరాయణుఁడ వగుము.

యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. ౪౬

ఏరీతి నేయేప్రయోజనములు బావిచేఁ గలుగు చున్నవో, అవియన్నియు సమస్తవిధముల సరోవరము వలనఁ గలుగుచున్నవి, ఆరీతిగనే వేదములందుఁగల దంతయు జ్ఞానవంతుఁ డగు బ్రహ్మపరాయణున కాత్మాను భవములోనుండి లభించియుండుచున్నది.

కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతు ర్భూ ర్మాతే సంగో ఽ స్త్వకర్మణి. ౪౭

కర్మవిషయమున నే నీ కధికారము కలదు. దాని నుండి యుత్పన్నములగు ననేకఫలముల విషయమునం దెన్నడు లేదు. కర్మఫలము నీకు హేతువుకారాదు. కర్మ చేయకుండుటకు సయితము నీ కాగ్రహము కలుగరాదు.

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే. ౪౮

ఓధనంజయా! ఆసక్తినివిడిచి యోగస్థుఁడవయి యనఁగా సఫలతా విఫలతల విషయమయి సమానభావమును గలిగియుండి నీవు కర్మచేయుము. సమత్వమే యోగమని చెప్పఁబడుచున్నది.

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. ౪౯

ఓధనంజయా! సమత్వబుద్ధిముందుఁ గేవల కర్మ మిక్కిలి తుచ్ఛము. నీవు సమత్వబుద్ధి నాశ్రయింపుము. ఫలమును హేతువుగఁ జేసికొనుమనుష్యుఁడు దయకుఁ బాత్రుఁడు.

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. ౫౦

బుద్ధియుక్తుఁడనఁగా సమత్వముగల పురుషునకిచటఁ బాపపుణ్యస్పర్శ కలుగదు; అందుచే నీవు సమత్వ

ముకొఱకుఁ బ్రియత్నింపుము. సమత్వమే కార్యకుశలత్వము.

> కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః,
> జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛం త్యనామయమ్. ౫౧

ఎందుకన సమత్వబుద్ధిగల జనులు కర్మనుండి యుత్పన్నమగు ఫలత్యాగ మొనరించి జన్మబంధనమునుండి ముక్తులయి పోవుచున్నారు మఱియు నిష్కళంకగతి- మోక్షపదము- పొందుచున్నారు.

> యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి,
> తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. ౫౨

ఎప్పుడు నీబుద్ధి మోహరూపమగు బురద నతిక్రమించిపోవునో అప్పుడు నీవు విన్నవానివిషయమునను వినుటకు శేషించియున్నవానివిషయమునను నుదాసీనత ప్రాప్తించును.

> శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
> సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి. ౫౩

అనేకప్రకారములగు సిద్ధాంతముల వినుటచే వ్యగ్రమయిన నీబుద్ధి యెపుడు సమాధియందు స్థిర మగునో అప్పుడే నీవు సమత్వమునకుఁ బ్రాపింతువు

అర్జున ఉవాచః—

స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ,
స్థితధీః కిం ప్రభాషేత కి మాసీత వ్రజేత కిమ్. ౫౪

అర్జునుఁడు చెప్పెను: ఓ కేశవా! స్థితప్రజ్ఞున కనఁగా సమాధిస్థుని చిహ్నము లేవి? స్థితప్రజ్ఞుఁ డెట్లు మాట్లాడును, కూర్చుండును మఱియు నడచును?

శ్రీ భగవా నువాచః—

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్,
ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే. ౫౫

శ్రీ భగవానుఁడు చెప్పెను: ఓపార్థా! ఎప్పుడు మనుష్యుఁడు మనస్సునందుఁ దలయెత్తు సమస్తకామనలఁ ద్యజించుచున్నాఁడో మఱియు నాత్మద్వారముననే యాత్మయందు సంతుష్టుఁడయి యుండుచున్నాఁడో అప్పుడతఁడు స్థితప్రజ్ఞుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

వ్యాఖ్యానము: ఆత్మద్వారముననే యాత్మ
యందు సంతుష్టుఁడయి యుండు టనఁగా నాత్మానందము
ను లోపలినుండి యన్వేషించుట. సుఖదుఃఖములనిచ్చు
బాహ్యవస్తువులపైన నానందముయొక్క యాధార
మును గలిగియుండరాదు. ఆనందము సుఖమునుండి భిన్న
మగు వస్తువను విషయమును ధ్యానమునం దిడుకొనవల
యును. నాకు ధనము లభించిన దానియందు నేను సుఖ
మును బడయుదును, అనుతలంపు మోహము. నేనుభిక్షు
కుఁడనయినను, తిండికయి తిప్పలు పడవలసివచ్చినను
గూడ నేను దొంగతనమునకు, ఇతరలాలసలకుఁ బాల్ప
డకుండుటయం దే వస్తువుకలదో, అది యానందము
నొసంగుచున్నది, మఱియు నది యాత్మసంతోషము.

దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః,
వీతరాగభయక్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే. ౫౬

దుఃఖముచే నెవఁడు దుఃఖితుఁడుగాఁడో, సుఖే
చ్ఛను గలిగియుండఁడో మఱియు నెవఁడు రాగము భయ

ము మఱియుఁ గ్రోధమునుండి రహితుఁడగునో అతఁడు స్థిరబుద్ధియగు ముని యని చెప్పఁబడుచున్నాఁడు.

యః సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్,
నాభినందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౫౭

సర్వత్ర రాగరహితుఁ డయి యే పురుషుఁడు శుభమును లేక యశుభమును బొంది హర్షింపఁడో, శోకింపఁడో వానిబుద్ధి స్థిరమయినది.

యదా సంహరతే చాయం కూర్మోఙ్గానీవ సర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౫౮

తాఁబేలు తన్ని వైపులనుండి యంగముల ముడుచుకొనుచున్నదో అట్లెప్పుడీపురుషుఁ డింద్రియములను వాని విషయములనుండి యుపసంహరించుకొనుచున్నాఁడో అపుడు వానిబుద్ధి స్థిరమయినదని చెప్పఁబడుచున్నది.

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. ౫౯

దేహధారి నిరాహారిగా నున్నపుడు వానివిషయములు క్షీణించుచున్నవి కాని రసము పోనేరదు; ఆరస మీశ్వరసాక్షాత్కార మగుటవలన శమించును.

వ్యాఖ్యానము : ఈ శ్లోక ముపవాసాదుల నిషేధించుటలేదు. కాని వానిహద్దును సూచించుచున్నది. విషయముల శమింపఁజేయుకొఱ కుపవాసాదికము లావశ్యకములు కాని వానిమూలము అనఁగా వానియందు రస మీశ్వరదర్శన మయినపిదపనే శమించుచున్నది. ఎవని కీశ్వరసాక్షాత్కారరసము ప్రారంభమగుచున్నదో వాఁ డితరరసముల మఱచిపోవుచున్నాఁడు.

యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః. ౬౦

ఓ కౌంతేయా! చతురపురుషుఁడు ప్రయత్నము చేయుచున్నప్పటికి నింద్రియములు వానిమనస్సునుగూడ

బలాత్కారముగా హరించునట్టి ప్రమథనశీలములయి యున్నవి.

> తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
> వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౬౧

ఈ యింద్రియముల వశమునందుంచుకొని యోగి నాయందుఁ దన్మయుఁడయి యుండవలయును. ఎందుకనఁగాఁ దనయింద్రియము లెవనికి వశపడినవో వానిబుద్ధి స్థిరమయినది.

వ్యాఖ్యానము : అనఁగా భక్తిలేకుండ- ఈశ్వర సాహాయ్యము లేకుండ-పురుషప్రయత్నము మిథ్య.

> ధ్యాయతో విషయాన్ పుంసః సంగ స్తేషూపజాయతే,
> సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధో౽భిజాయతే.

విషయములఁ జింతించు పురుషునకు వానియందాసక్తి పుట్టుచున్నది. మఱియు నాసక్తిలోనుండి కామన కలుగుచున్నది. మఱియుఁ గామననుండి క్రోధము పుట్టుచున్నది.

వ్యాఖ్యానము: కామనగలవానికిఁ గ్రోధ మనివార్యము, ఎందుల కనఁ గామ మేనాటికిఁ దృప్తిఁజెంద నేచెందదు.

క్రోధా ద్భవతి సమ్మోహ స్సమ్మోహా త్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి. ౬౩

క్రోధమునుండి మౌఢ్య ముదయించుచున్నది. మౌఢ్యమునుండి స్మృతి భ్రాంతమయిపోవుచున్నది. స్మృతిభ్రాంతమగుటనుండి జ్ఞాననాశన మగుచున్నది. మఱియు నెవ్వానిజ్ఞానము నశించినదో వాఁడు మృతప్రాయుఁడు.

రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి. ౬౪

కాని యెవనిమనస్సు తన యధీనమునం దున్నదో మఱియు నెవనియింద్రియములు రాగద్వేషరహితములయి వానివశమునం దుండుచున్నవో, ఆమనుష్యుఁడింద్రియవ్యాపారమును గొనసాగించుచుండియుఁ జిత్త

ప్రసన్నతను బడయుచున్నాఁడు.

ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే,
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే. ౬౫

చిత్తప్రసన్నతచే వీనిసకలదుఃఖములు తొలఁగి పోవుచున్నవి మఱియుఁ బ్రసన్నతను బడసిన బుద్ధి తత్క్షణమే స్థిరమగుచున్నది.

నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా,
నచాభావయత శ్శాంతి రశాంతస్య కుత స్సుఖమ్. ౬౬

ఎవనికి సమత్వములేదో వానికి వివేకములేదు. వానికి భక్తి లేదు. మఱియు నెవనికి భక్తి లేదో వానికి శాంతిలేదు. మఱియు నెచటశాంతిలేదో అచట సుఖ మెటనుండి కలుగును?

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాంభసి. ౬౭

విషయములయందు దారితప్పి సంచరించు నింద్రియములవెంట నెవనిమనస్సు వర్తించుచున్నదో వాని

మనస్సు, వాయు వెళ్లు నౌకను నీటియం దీడ్చుకొనిపో
వునో, అట్లు వానిబుద్ధి నిచ్చవచ్చినచోటికి గుంజుకొని
పోవుచున్నది.

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః,
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. ౬౮

కాఁబట్టి యో మహాబాహూ! ఎవని యింద్రి
యములు నలుదెపులనున్న విషయములనుండి వెడలి
తనయధీనమునకు వచ్చివేయునో వానిబుద్ధి స్థిరమయి
పోవుచున్నది.

యా నిశా సర్వభూతానాం తస్యాంజాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. ౬౯

ఎప్పుడు సర్వప్రాణులు నిద్రించు చుండునో,
అపుడు సంయమి మేల్కాంచుచుండును. ఎప్పుడు
జనులు మేల్కాంచుచు నుందురో, అపుడు జ్ఞానవంతుఁ
డగు ముని నిద్రించుచున్నాఁడు.

వ్యాఖ్యానము: భోగులగు మనుష్యులు రాత్రి

పండ్రెండు యొంటిగంటవఱకు నుత్సవములయందు భోజనపానములందుఁ దమ సమయమును గడుపుచున్నారు. మఱియుఁ దిరిగి యుదయమునం దేడెనిమిదిగంటల వఱకు నిద్రించుచున్నారు. సంయమి రాత్రి యేడెనిమిదిగంటలకు నిద్రించి అర్ధరాత్రియందు లేచి యీశ్వర ధ్యానము చేయుచున్నాఁడు. తిరిగి భోగి వాసనాప్రపంచమును వృద్ధిఁ గావించుకొనుచున్నాఁడు. మఱియు నీశ్వరుని మఱచిపుచ్చుచున్నాఁడు, అచట సంయమి విలాస ప్రపంచమున కనభిజ్ఞుఁడయి యుండుచున్నాఁడు. మఱియు నీశ్వరసాక్షాత్కార మొనరించుకొనుచున్నాఁడు. ఈ శ్లోకమున భగవంతుఁ డీచందమున నిరువురి పక్షములు భిన్నములని సూచించియున్నాఁడు.

ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్,
తద్వ త్కామా యం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి న కామకామీ. ౭౦

నదులప్రవేశముచే నిండుచున్నప్పటికినిగూడ సముద్రము ఎట్లు చలముగ నుండుచున్నదో, అట్లే మనుష్యుని విషయమున సాంసారికభోగములు శమించిపోవుచున్నవో వాఁడే శాంతిని బడయుచున్నాఁడు, కామనలుగల మనుష్యుఁడు (పడయుట) లేదు.

విహాయ కామాన్ యః సర్వాన్ పుమాం శ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకార స్స శాంతి మధిగచ్ఛతి.          ౭౧

సమస్తకామనల విడిచి యే పురుషుఁ డిచ్ఛ, మమత మఱియు నహంకార రహితుఁడయి సంచరించునో వాఁడే శాంతిని బడయును.

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి.          ౭౨

ఓ పార్థా! ఈశ్వరుని గుఱించువానిస్థితి యిట్టిది. దానిని బడసినపిదప మఱల వాఁడు మోహామునకు వశుఁడు గాఁడు మఱియు మరణాకాలము నందును నిట్టిదే స్థితి నిలిచియున్నచో నతఁడు బ్రహ్మనిర్వాణ

మును బడయుచున్నాఁడు.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే సాంఖ్యయోగో నామ
ద్వితీయోఽధ్యాయః.

---

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీ మద్భగవద్గీతారూపమగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జునసంవాదము యొక్క సాంఖ్యయోగమను పేరుగల రెండవయధ్యాయము ముగిసినది.

---

3

## కర్మయోగము.

ఈయధ్యాయము గీతాస్వరూపము నెఱుంగుటకు ముఖ్యకీలకమని చెప్పవచ్చును. దీనిలోఁ గర్మ యెట్లు చేయవలయును మఱియు నేకర్మ చేయనగును మఱియు నిజమగు కర్మయని దేని ననవలయును యిది స్పష్టపరచఁ బడినది. మఱియు వాస్తవికమగు జ్ఞానము పారమార్థిక కర్మలయందుఁ బరిణతము కావలసియున్నదని చెప్పఁ బడినది.

అర్జున ఉవాచ:—

జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధిర్జనార్దన,
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ! ౧

అర్జునుఁడు చెప్పెను : ఓ జనార్దనా! నీవు కర్మకంటె బుద్ధి నధిక శ్రేష్ఠమని తలంచుచున్నచో నో కేశవా నీవు నన్ను ఘోరకర్మవిషయమయి యేల ప్రేరేపించుచున్నాఁడవు ?

వ్యాఖ్యానము : బుద్ధియనఁగా సమత్వబుద్ధి.

వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే,
త దేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్. ౨

నీ మిశ్రవచనములచే నాబుద్ధిని నీవు సంశయగ్రస్తమొనరించుచున్నట్లున్నావు. కాఁబట్టి నీవు, దేనిచే నాకల్యాణము కలుగునో అట్టి యొకమాటనే నిశ్చయపూర్వకముగాఁ జెప్పుము.

వ్యాఖ్యానము : అర్జునుఁడు చిక్కులోఁ బడిపోవుచున్నాఁడు ; ఎందువలననన నొక వైపునుండి భగవానుఁడు వానిని ధైర్యమును గోల్పోయినందులకు నిందించుచున్నాఁడు మఱియు రెండవ వైపున రెండవయధ్యాయమందలి 49-50 వ శ్లోకములయందుఁ గర్మత్యాగా

భాసము వచ్చుచున్నది. సూక్ష్మముగా విచారించినచో నిట్లు కాదని భగవానుఁడు ముందుఁ దెలుపును.

శ్రీభగవానువాచ:—

> లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ,
> జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్. 3

శ్రీభగవానుఁడు చెప్పెను : ఓ పాపరహితా ! ఈలోకమున నేను తొలుత రెండు అవస్థలఁ దెలిపి యున్నాఁడను : ఒకటి జ్ఞానయోగముద్వారమున సాంఖ్యులకు మఱియు రెండవది కర్మయోగముద్వారమున యోగులకు.

> న కర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
> నచ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి. ౪

కర్మ నారంభింపకుండుటచే మనుష్యుఁడు నైష్కర్మ్యానుభవమును బొందఁడు. మఱియుఁ గర్మయొక్క కేవల బాహ్యత్యాగముచే మోక్షమును బొందుచుం డుటలేదు.

వ్యాఖ్యానము: నైష్కర్మ్యము అనఁగా మనస్సుచే, వాక్కుచే మఱియు శరీరముచేఁ గర్మచేయకుండుట. ఇట్టి నైష్కర్మ్యానుభవమును గర్మ చేయకుండుటచే నెవఁడు పడయఁజాలఁడు. అట్టిచో దీనియనుభవ మెట్లు కలుగునో యిపుడు చూడవలసియున్నది.

నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః. ౫

వాస్తవమున నెవఁ డొక్క క్షణముగూడ కర్మ చేయకుండ నుండఁజాలఁడు. ప్రకృతినుండి యుత్పన్నములయిన గుణములు పరతంత్రుఁ డయియున్న ప్రతి మనుష్యునిచేఁ గర్మఁ జేయించుచున్నవి.

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్,
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స ఉచ్యతే. ౬

ఏ మనుష్యుఁడు కర్మచేయు నింద్రియముల నిరోధించుచున్నాఁడో కాని ఆయా యింద్రియములయొక్క విషయముల చింతనము మనస్సుచేఁ జేయుచున్నాఁడో

వాఁడు మూఢాత్ముఁడగు మిథ్యాచారి యని చెప్పఁ
బడుచున్నాఁడు.

వ్యాఖ్యానము : ఎట్లన నొకఁడు వాణిని నిరో
ధించు చుండును. కాని మనస్సులో నెవనినో తిట్టుచుం
డును, అట్టివాఁడు నిష్కర్మి కాఁడు, మిథ్యాచారి. ఎంత
వఱకు మనస్సు నిరోధింపఁబడఁజాలదో అంతవఱకు
శరీరమును నిరోధించుట నిరర్థక మనుట దీని తాత్పర్య
ము కాదు. శరీరమును నిరోధింపకయె మనస్సు స్వాధీన
ము కానేకాదు. కాని శరీరమును లోఁబఱచుకొనుట
తోఁబాటు మనస్సునుసయితము వశపఱచుకొనుటకయి
తప్పక ప్రయత్నింపవలయును. ఎవరు భయము లేక
యిట్టివేయగు బాహ్యకారణములచే శరీరమును నిరో
ధించుచుందురో కాని మనస్సును నిరోధింపరో, ఇంతి
యే కాదు, మీఁదుమిక్కిలి మనస్సుచే విషయముల
భోగించుచుందురో మఱియుఁ దరుణము లభించినచో
శరీరముచేఁగూడ భోగించుచుందురో అట్టి మిథ్యాచారుల

నింద యిచటఁగలదు. దీని ముందుశ్లోకమున దీనికిఁ బ్రతి
కూలమగు భావమును బ్రదర్శించుచున్నాఁడు.

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున,
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తః స విశిష్యతే. ౭

కాని యో యర్జునా! ఏ మనుష్యుఁ డింద్రియ
ముల మనస్సుచే నియమించి నిస్సంగుఁడయి కర్మచేయు
నింద్రియములద్వారమునఁ గర్మయోగము నారంభించు
చున్నాఁడో అతఁడు శ్రేష్ఠపురుషుఁడు.

వ్యాఖ్యానము : ఇందు బాహ్యాంతరముల సం
యోగము కూర్చఁబడినది. మనస్సును స్వాధీనమునం
దుంచుకొనుచుండియుఁ గూడ మనుష్యుఁడు శరీరముచే
ననఁగాఁ గర్మేంద్రియముల ద్వారమునఁ గొంచెమో
గొప్పయో చేసియే తీరును. కాని యెవనిమనస్సు వశ
పడినదో వాని చెవులు దూషితవచనముల వినవు
కాని యీశ్వరభజనము నాలించును. సత్పురుషుల
గుణగానము నాలించును. ఎవనిమనస్సు అతని వశము

నందున్నదో వాఁడు మనచే విషయముగ భావింపఁబడు
దానియందు రసమును బొందఁడు. ఇట్టి మనుష్యుఁ
డాత్మకు శోభనిచ్చునట్టి కర్మయే చేయును. ఇట్టికర్మముఁ
జేయుట కర్మమార్గము. సప్రయత్నముచే శరీరబంధ
నమునుండి యాత్మ విడివడుటకొఱకు యోగ మభ్యా
సము చేయఁబడునో అది కర్మయోగము. ఇందు విష
యాసక్తికి స్థానము లేనేలేదు.

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః.　　　౮

కాఁబట్టి నీవు నియతకర్మ చేయుము. కర్మచేయ
కుండుట కంటెఁ గర్మచేయుట కడుమెన్న. నీశరీరవ్యా
పారముగూడ కర్మలేనిదే సాగఁజాలదు.

వ్యాఖ్యానము : నియతశబ్దము మూలశ్లోకమునఁ
గలదు. దాని సంబంధము గత శ్లోకముతోఁ గలదు.
దానియందు మనస్సుచే నింద్రియముల నియమించుచు
నిస్సంగుఁడయి కర్మచేయువాని స్తుతి కలదు, ఇచట

నియతకర్మయనఁగా నింద్రియముల నియమమందుంచి చేయఁబడుకర్మ ప్రేరణచేయఁబడినది.

యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర. ౯

ఏకర్మలు యజ్ఞమునకయి చేయఁబడుచున్నవో వాని కితరములగు కర్మలచే నీలోకమున బంధనము కలుగుచున్నవి. కాఁబట్టి యో కౌంతేయా! నీవు రాగరహితుఁడవయి యజ్ఞార్థము కర్మచేయుము.

వ్యాఖ్యానము: యజ్ఞమనఁగాఁ బరోపకారార్థము ఈశ్వరుని నిమిత్తము చేసియున్న కర్మలు.

సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్. ౧౦

యజ్ఞసహితముగాఁ బ్రజలను సృజించి ప్రజాపతియగు బ్రహ్మ "ఈ యజ్ఞముచే మీవృద్ధియగుఁగాక! ఇది మీకు వాంఛితఫలము నొసంగుఁగాక!" అని చెప్పెను.

దేవా న్భావయతానేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంత శ్శ్రేయః పర మవాప్స్యథ. ౧౧

"యజ్ఞముచే మీరు దేవతలఁ బోషింపుఁడు మఱియు దేవతలు మీపోషణ చేయుదురుగాక. మఱియు నొకరి నొకరు పోషించుకొని మీరు పరమకల్యాణమును బొందుఁడు.

ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః,
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః. ౧౨

'యజ్ఞముచే సంతుష్టులయిన దేవతలు మీకు వాంఛితభోగముల నొసంగుదురు. వానిని తిరిగి యియ్యక వారొసంగినదాని నెవఁడు భోగించునో వాఁడు తప్పక చోరుఁ డగుచున్నాఁడు.'

వ్యాఖ్యానము : ఇచట దేవత కర్థ మేమన నీశ్వరుని సకలభూతసృష్టి. భూతముల సేవ దేవసేవ మఱియు నది యజ్ఞము.

యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః,
భుంజతే తే త్వఘం పాపా యే పచ న్త్యాత్మకారణాత్. ౧౩

ఎవరు యజ్ఞశేషమును దినువారయి యున్నారో వారందఱు పాపములనుండి విముక్తు లగుచున్నారు. ఎవరు తమనిమిత్తమే పాకముచేసికొనుచున్నారో వారు పాపమును దినుచున్నారు.

అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః,
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః. ౧౪

అన్నముచే సకలభూతము లుదయించుచున్నవి. అన్నము వర్షముచేఁ గలుగుచున్నది. వర్షము యజ్ఞముచేఁ గలుగుచున్నది మఱియు యజ్ఞము కర్మచే నగుచున్నది.

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్. ౧౫

కర్మ ప్రకృతినుండి యుత్పన్న మగుచున్నదని నీవు తెలియుము, ప్రకృతి అక్షరబ్రహ్మమునుండి కలుగుచున్నది, కాఁబట్టి సర్వవ్యాపకమగు బ్రహ్మ సర్వదా యజ్ఞమునందు వెలయుచున్నది.

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయ తీహ యః,
అఘాయు రిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి. ౧౬

ఈరీతిగఁ బ్రవర్తితమయిన చక్రము నెవఁ డనుసరింపఁడో ఆమనుష్యుఁడు తనజీవితమును బాపమయ మొనరించుకొనుచున్నాఁడు, ఇంద్రియసుఖములఁ జిక్కి యుండుచున్నాఁడు, మఱియు నోపార్థా! వాఁడు వ్యర్థముగా జీవించుచున్నాఁడు.

య స్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవచ సంతుష్ట స్తస్య కార్యం నవిద్యతే. ౧౭

కాని యేమనుష్యుఁ డాత్మయందు రమించువాఁడయి యున్నాఁడో; ఎవఁడు దానివలననే తృప్తుఁడయి యుండుచున్నాఁడో మఱియు దానియందే సంతోషమును జెందుచున్నాఁడో వానికిఁ జేయవలసిన దేమియు నుండదు.

నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన,
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః. ౧౮

చేయుట చేయకుండుట యందు వానికి లేశమేని స్వార్థము లేదు. భూతములయందు వానికెట్టి సొంతమగు స్వార్థము లేదు.

తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః. ౧౯

కాఁబట్టి నీవు సంగరహితుఁడవయి నిరంతరము కర్తవ్యకర్మ చేయుము. నిస్సంగుఁడయియే కర్మచేయు పురుషుఁడు మోక్షమును బడయుచున్నాఁడు.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి. ౨౦

జనకాదులు కర్మచేతనే పరమసిద్ధిని బొందిరి. లోకసంగ్రహమును గాంచి సయితము నీవు కర్మచేయుటుచితము.

యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనాః,
స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే. ౨౧

ఏయే యాచరణము నుత్తమపురుషులు చేయు

చున్నారో దాని నితరజను లనుసరించుచున్నారు. వారు దేనిని బ్రమాణముగఁ జేయుచున్నారో దానిని జను లనుసరించుచున్నారు.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి.            ౨౨

ఓ పార్థా! నాకు ముల్లోకములఁ గొంచెము గూడ చేయవలసినది లేదు; పొందఁదగినవస్తు వేదియుఁ బొందఁబడకుండ లేదు, అయినను గూడ నేను కర్మ యందు లగ్నుఁడనయి యుండుచున్నాఁడను.

వ్యాఖ్యానము : సూర్యుఁడు, చంద్రుఁడు, పృథ్వ యిత్యాదుల నిరంతరమును మఱియు నకుంఠితమును నగు గతి యీశ్వరుని కర్మల సూచించుచున్నది. ఈ కర్మలు మానసికములుగఁ గాదు కాని శారీరకములుగ గణింపఁ బడవచ్చును. ఈశ్వరుఁడు నిరాకారుఁడయి యుండియుఁ గూడ శారీరకకర్మ లెట్లుచేయుచున్నాఁడను సంశయమునకు స్థానము లేదు. ఎందు కన నతఁ

డశరీరుఁడయియుండియుఁగూడ శరీరివలె నాచరణము
చేయుచుండుట కానవచ్చుచున్నది. కాఁబట్టి వాఁడు కర్మ
చేయుచుండియుఁగూడ నకర్మియు మఱియు నలిప్తుఁడును
నయియున్నాఁడు. ఈశ్వరుని ప్రకృతి యెట్లు యంత్ర
సమానముగఁ బనిచేయుచున్నదో, అట్లు మనుష్యుఁడు
నయితము బుద్ధిపూర్వకముగాఁ గాని యంత్రమువలెనే
నియమముతోఁ బనిచేయవలయు నని మనుష్యుఁడు
గ్రహింపవలసియున్నది. యంత్రగతి ననాదరముచేసి
నిరంకుశవర్తనుఁ డగుటయందు మనుష్యుని విశేషత
లేదు, కాని జ్ఞానపూర్వకముగ నాగతి ననుసరించుట
యందుఁ గలదు. అలిప్తుఁడుగ నుండి, నిస్సంగుఁడయి యం
త్రసమానముగఁ గార్య మొనరించుటచే వాని కలుగు
దల యుండదు. వాఁడు చచ్చువఱకుఁ గ్రొత్త (తాజా)
వాఁడుగనే యుండును. దేహనియమము ననుసరించి
దేహము తనకాలము వచ్చుసరికి నశించుచున్నది, కాని

దానియందలి యాత్మ యెట్టులున్న దట్టులనే యుండు చున్నది.

యది హ్యహం నవర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.    ౨౩

నే నెప్పుడేని ఒళ్లు విఱుచుకొనుటకుఁగూడ నాగ కుండఁ గర్మయందు నిమగ్నుఁడనయి యుండకుందునేని యో పార్థా! జనులు సమస్తవిధముల నాయాచరణము ననుసరించి ప్రవర్తింపఁ గడంగుదురు.

ఉత్సీదేయు రిమే లోకా నకుర్యాం కర్మచే దహం,
సంకరస్యచ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః.    ౨౪

నేను కర్మచేయకుందునేని యీలోకము లుత్సన్నములగును; నే నవ్యవస్థకుఁ గర్త నగుదును. మఱియు నీ లోకముల నాశనము జేయువాఁడ నగుదును.

సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యా ద్విద్వాం స్తథా సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్.    ౨౫

ఓ భారతా! ఎట్లజ్ఞాను లాసక్తులయి పని

చేయుచున్నారో, అట్లు జ్ఞాని యాసక్తిరహితుఁడయి లోకకల్యాణేచ్ఛచేఁ గార్య మొనరింపవలయును.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్,
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్. ౨౬

కర్మయందు దాసక్తులయిన యజ్ఞానులగు మనుష్యులబుద్ధిని జ్ఞాని చలింపఁజేయరాదు. కాని సమత్వపూర్వకముగ బాగుగాఁ గర్మఁజేసి వారిని సమస్తకర్మలఁ బ్రవృత్తులఁ గావింపనగును.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే. ౨౭

సమస్తకర్మలు ప్రకృతియొక్క గుణములచేఁ జేయఁబడుచున్నవి. అహంకారముచే మూఢుఁడయిన మనుష్యుఁడు 'నేను కర్తను' అని భావించుచున్నాఁడు.

తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః,
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా నసజ్జతే. ౨౮

ఓ మహాబాహూ! గుణములు మఱియుఁ గర్మల

విభాగముయొక్క రహస్యము నెఱుంగు పురుషుఁడు 'గుణములు గుణములందుఁ బ్రవర్తించుచున్నవి' అని తలంచి దానియం దాసక్తుఁడు గాఁడు.

వ్యాఖ్యానము : ఎట్లుచ్ఛ్వాసనిశ్వాసాదికముల క్రియలు తమంతట తాము జరుగుచుండునో, ఎట్లు మనుష్యుఁడు వానియం దాసక్తుఁడయి యుండఁడో మఱియు నెపు డాయంగముల కేదేని వ్యాధికలుగునో, అప్పుడే మనుష్యుఁడు వానినిగూర్చి చింతింపవలసి వచ్చును. లేదా వాని కా యంగముల యస్తిత్వముయొక్క యాభాసము కలుగుచున్నది. అట్లే స్వాభావికకర్మలు తమంతట తా మగుచున్నచో వానియం దాసక్తి కలుగదు. ఉదారస్వభావుఁడు స్వయముగఁ దన యౌదార్యము నెఱుంగనే యెఱుంగఁడు ; కాని వాఁడు దాన మొసంగకుండ నుండఁజాలఁడు. ఇట్టి యనాసక్తి, అభ్యాసమువలనను మఱియు నీశ్వరకృపవలననే ప్రాప్తించుచున్నది.

ప్రకృతే ర్గుణసమ్మూఢా స్సజ్జంతే గుణకర్మసు,
తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవి న్నవిచాలయేత్. ౨౯

ప్రకృతియొక్క గుణములచే మోహితులయిన మనుష్యులు గుణములయొక్క కర్మలయం దాసక్తులయి యుండుచున్నారు. జ్ఞానులీ యజ్ఞానులును మందబుద్ధులును నగు వారి నస్థిరులఁ గావింపరాదు.

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా,
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. ౩౦

అధ్యాత్మవృత్తిని గలిగియుండి సమస్తకర్మల నా కర్పించి ఆసక్తిని మఱియు మమత్వమును విడిచి రాగరహితుఁడవయి నీవు యుద్ధముఁ జేయుము.

వ్యాఖ్యానము : ఎవఁడు దేహమునందుండు నాత్మను గుఱుతించుచున్నాఁడో మఱియు దానిని బరమాత్మయొక్క యంశముగఁ దెలియుచున్నాఁడో వాఁడు సమస్తమును యజమానిపేరుతోఁ బనిచేయుచు సమస్తమును వానికే యర్పణముచేయు సేవకునిరీతిగఁ బర

మాత్మునికే యర్పణము చేయును.

> యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః,
> శ్రద్ధావంతో ఽనసూయంతో ముచ్యంతే తే ఽపి కర్మభిః 3౧

శ్రద్ధగలిగి, ద్వేషమును బాసి యే మనుష్యులు నా యీ మతము ననుసరించి వర్తించుచున్నారో వారు కూడ కర్మబంధనమునుండి ముక్తు లగుచున్నారు.

> యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్,
> సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః. 3౨

కాని యెవరు నా యీ యభిప్రాయమున దోషము లెన్నుచు దాని ననుసరింపరో, వారు జ్ఞానహీనులు. వారి నాశన మయినట్లే తెలియుము.

> సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవా నపి,
> ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి. 33

జ్ఞానులుసయితము తమ స్వభావము ననుసరించి ప్రవర్తించుచున్నారు. సకలప్రాణులు తమ స్వభావము ననుసరించుచున్నవి. అచట బలాత్కారమేమిచేయును?

వ్యాఖ్యానము: ఈ శ్లోకము రెండవయధ్యాయ యొక్క 61 లేక 68 వ శ్లోకములకు విరుద్ధమయినది గాదు. ఇంద్రియనిగ్రహము చేయుటలోఁ దలప్రాణము తోఁకకు వచ్చును, కాని యట్లయ్యు సిద్ధిగలుగనిచో నిగ్రహ మనఁగా బలాత్కారము నిరర్థకము. ఇందు నిగ్రహము నిందింపఁ బడలేదు, స్వభావముయొక్క సామ్రాజ్యము ప్రదర్శింపఁబడినది. ఇది నా స్వభావము, అని చెప్పి యెవఁడేని దుష్టత్వముఁ జేయఁగడంగినచో వాఁ డీ శ్లోకార్థమును గ్రహించుటలేదు. స్వభావము యొక్క రహస్యము మనకుఁ దెలియదు. అలవాట్లన్నియు స్వభావము గానేరవు. మఱియు నాత్మస్వభావ మూర్ధ్వగమనము. కాఁబట్టి యాత్మ యెపుడు క్రిందికి దిగునో, అపుడు దాని నెదుర్కొనుట కర్తవ్యము. ఇందు చేతనే క్రిందిశ్లోకము స్పష్టము చేయుచున్నది.

ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ,
తయో ర్నవశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ. ౩౪

తమతమవిషయములవిషయమునం దింద్రియము లకు రాగద్వేషములు కలుగుచునే యుండును. మను ష్యుఁడు వానికి వశుఁడు గారాదు, ఎందులకన నవి మను ష్యుని మార్గమున శత్రువులు.

వ్యాఖ్యానము: చెవియొక్క విషయము వినుట. మనస్సు నచ్చిన దానిని వినుటకుఁగలిగిన యిచ్ఛయేరా గము; మనస్సునకు నచ్చనిదానిని వినుటయందలి య నిచ్ఛయె ద్వేషము. 'ఇది స్వభావము' అని నుడివి రాగద్వే షములకు వశము గారాదు, వాని నెదుర్కొనవలయును. ఆత్మయొక్కస్వభావము సుఖదుఃఖముల నంటకుండ నుండుటయె. ఆస్వభావమువఱకు మనుష్యుఁడు చేరవల సియున్నది.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.    35

పరధర్మము సులభముగా నున్నప్పటికినిగూడ దానికంటె స్వధర్మము విగుణమయియున్నను మిక్కిలి

మంచిది. స్వధర్మమున మరణించుట లెస్స. పరధర్మము భయావహము.

వ్యాఖ్యానము: సంఘమునం దొకనిధర్మము పాచి నూడ్చుటయి యుండును, మఱియొకని ధర్మము జమా ఖర్చులు వ్రాయుటయి యుండును. జమాఖర్చులు వ్రా యువాఁడు శ్రేష్ఠుఁడుగ భావింపఁబడినఁ బడుఁగాక, కాని పాచియూడ్చువాఁడు తనధర్మమును ద్యజించినచో వాఁడు భ్రష్టుఁ డగును మఱియు సంఘమునకు నష్టము కలుగును. ఈశ్వరునియొద్ద నిరువురిసేవకు విలువ వారి నిష్ఠ ననుసరించి యంచనా వేయఁబడును. ఉద్యమము యొక్క విలువ యచట నొక్కటిగనే యుండఁగలదు. ఇరువు రీశ్వరార్పణబుద్ధితోఁ దమకర్తవ్యములఁ బాలిం చినచో సమానరూపమున మోక్షమున కధికారు లగు చున్నారు.

అర్జున ఉవాచ:—

అథ కేన ప్రయుక్తో ఽయం పాపం చరతి పూరుషః,
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః. 3౬

అర్జునుఁడు చెప్పెను : ఓ వార్ష్ణేయా! బలాత్కారముచేసినట్లు తన కిష్టము లేకున్ననుగూడ మనుష్యుఁ డెవని ప్రేరణచేఁ బాప మాచరించుచున్నాఁడు ?

శ్రీ భగవానువాచ:—

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. 3౭

శ్రీ భగవానుఁడు చెప్పెను : రజోగుణమువలనఁ బుట్టిన యిది (ప్రేరకము) కామము, క్రోధము, దీని పొట్టయే నిండదు. ఇది మహాపాపి, దీని నీలోకమున శత్రురూపముగ నెంచుము.

వ్యాఖ్యానము : మన వాస్తవికమగు శత్రువు మనయందుండునదే, దానిని కామమనుఁడు లేక క్రోధమనుఁడు. యిబ్బంది లేదు.

ధూమే నావ్రియతే వహ్ని ర్యథా ౽౽దర్శో మలేనచ,
యథోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్. ౩౮

ఏరీతిఁ బొగచే నగ్ని, మురికిచే నద్దము, మావిచే గర్భము కప్పఁబడియుండునో, అదియేరీతిఁ గామాది రూపమగు శత్రువుచే నీజ్ఞాన మావరింపఁబడియున్నది.

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేనచ. ౩౯

ఓ కౌంతేయా! తృప్తినొనరింపఁబడఁజాలని యీ కామరూపమగు నగ్ని నిత్యశత్రువు. దానిచే జ్ఞానియొక్క జ్ఞానము కప్పఁబడియుండుచున్నది.

ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. ౪౦

ఇంద్రియములు, మనస్సు మఱియు బుద్ధి — ఈ శత్రువుయొక్క నివాసస్థానములు. వీనిచే జ్ఞానమును గప్పి యీ శత్రువు దేహధారిని మూర్ఛితుని గావించుచున్నది.

వ్యాఖ్యానము : ఇంద్రియములయందుఁ గాన
ము వ్యాప్తమయియుండు కారణమున మనస్సు మలిన
మగుచున్నది, దానిచే వివేకశక్తి క్షీణించుచున్నది,
దానిచే జ్ఞానము నశించుచున్నది. **2** వ అధ్యాయమున
**62-64** వ శ్లోకములు చూడుఁడు.

తస్మాత్త్వ మిన్ద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ,
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్.　　౪౧

ఓ భరతర్షభా ! కావున నీవు తొలుత నింద్రి
యముల నియమమం దుంచి యీ జ్ఞానమును మఱియు
ననుభవమును నాశనమొనరించు నీ పాపి నవశ్యము
ద్యజించుము.

ఇన్ద్రియాణి పరా ణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః.　　౪౨

ఇంద్రియములు సూక్ష్మములు, వానికంటె
సూక్ష్మము మనస్సు, దానికంటె నధికసూక్ష్మము బుద్ధి.
బుద్ధికంటెను గూడ నత్యంతసూక్ష్మము ఆత్మ.

వ్యాఖ్యానము : అనఁగా నింద్రియములు వశము నం దున్నచో సూక్ష్మమగు కామమును జయించుట సహజ మగును.

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్. ౪౩

ఈరీతిగ బుద్ధికిఁ బరముగానున్న యాత్మను గుర్తించి మఱియు నాత్మచే మనస్సును వశ మొనరించు కొని యో మహాబాహూ! కామరూపమగు దుర్జయ శత్రువును సంహరించుము.

వ్యాఖ్యానము : మనుష్యుఁడు శరీరస్థమగు నాత్మను దెలియుచో మనస్సు వాని వశమునం దుండును, ఇంద్రియముల వశమునం దుండదు. మఱియు మనస్సు జయింపఁబడుచోఁ గామ మేమి చేయఁగలదు ?

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః.

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతారూపమగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గతయోగశాస్త్రమందలి శ్రీ కృష్ణార్జునసంవాదముయొక్క కర్మయోగ మను పేరుగల మూఁడవ యధ్యాయము ముగిసినది.

---

౪

## జ్ఞానకర్మసన్న్యాసయోగము.

ఈయధ్యాయములో మూఁడవ యధ్యాయము యొక్క విశేషమగు వివేచనము కలదు, మఱియు భిన్న భిన్నప్రకారములగు ననేకయజ్ఞముల వర్ణనము కలదు.

శ్రీభగవానువాచ:—

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్,
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవే ఽబ్రవీత్. ౧

శ్రీభగవానుఁడు చెప్పెను : ఈయవినాశియగు యోగమును నేను వివస్వంతు(సూర్యుఁడు)నకుఁ జెప్పితిని. అతఁడు మనువునకు మఱియు మనువు యిక్ష్వాకువునకుఁ జెప్పెను.

ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః,
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప.　　౨

ఈరీతిఁ బారంపర్యలబ్ధముగునట్టియు, రాజర్షులచేఁ దెలియఁబడినట్టియు నా యోగము దీర్ఘకాలము గడచుటచే నశించిపోయెను.

స ఏవాయం మయా తే ఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తో ఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్.　　3

ఆ పురాతనయోగమునే నేను నేఁడు నీకుఁ జెప్పితిని, ఎందులకన నీవు నాభక్తుఁడవు మఱియు నీయోగ ముత్తమరహస్యమగు విషయము.

అర్జున ఉవాచః—

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః,
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి.　　౪

అర్జునుఁడు చెప్పెను: నీ విపుడు జన్మించియున్నావు, వివస్వంతుఁడు పూర్వము జన్మించియున్నాఁడు. అట్టిచో నీ వది (యోగము) తొల్లిఁ జెప్పియుంటి వన్న నే నెట్లు గ్రహింపఁగలను?

శ్రీభగవానువాచ:—

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున,
తా న్యహం వేద సర్వాణి నత్వం వేత్థ పరంతప. ౫

శ్రీభగవానుఁడు చెప్పెను: ఓయర్జునా! నాకును నీకును నెన్నియో జన్మలు గడచినవి. వానినన్నింటి నే నెఱుంగుదును, నీ వెఱుంగవు.

అజో౽పి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరో౽పి సన్,
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా. ౬

నేను జన్మింపనివాఁడను, అవినాశిని మఱియు సకలభూతముల కీశ్వరుఁడనయి యుండియుఁగూడ నా స్వభావము నధిష్ఠించి నా మాయవలన జన్మించుచున్నాఁడను.

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్. ౭

ఓ భారతా! ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించుచుండునో, అధర్మము ప్రబల మగుచుండునో, అప్పుడప్పుడు నేను జన్మము నెత్తుచున్నాను.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.	౮

సాధువుల రక్షణముకొఱకును, దుష్టుల నాశనము నిమిత్తమును మఱియు ధర్మమును బునరుద్ధరించుకొఱకును యుగయుగమందు నేను జన్మించుచున్నాను.

వ్యాఖ్యానము : ఇచట శ్రీద్ధాళువునకు సాంత్వనము గలదు. మఱియు సత్యముయొక్కయు — ధర్మముయొక్కయు — సుస్థిరత్వముయొక్క ప్రతిజ్ఞ కలదు. ఈజగమున సముద్రపు ఆటుపోటు కలుగుచునే యుండును. కాని యంతమునకు ధర్మమునకే జయము కలుగుచుండును. సాధువులకు నాశనములేదు. ఎందువలన నన సత్యమునకు నాశనము లేదు. దుష్టులకు నాశనమే కలదు. ఎందు కన నసత్యమున కస్తిత్వములేదు. ఇది తెలిసి మనుష్యుఁడు తన కర్తృత్వముయొక్క యభిమానముచే హింస చేయరాదు, దురాచారము చేయఁ దగదు. ఈశ్వరుని గాఢమగు మాయా తవపని చేయు

చునే యుండును. ఇదియే యవతారము లేక యీశ్వర జన్మము. వాస్తవమున కీశ్వరుఁడు జన్మమెత్తవలసిన పనియే లేదు.

జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సో ఽర్జున. ౯

ఈ రీతిగ నెవఁడు నా దివ్యజన్మయొక్కయు మఱియుఁ గర్మయొక్కయు రహస్యమును దెలియు చున్నాఁడో వాఁడో యర్జునా! శరీరత్యాగ మొనరించి పునర్జన్మను బొందఁడు, కాని నన్నుఁ బడయుచున్నాఁడు.

వ్యాఖ్యానము: ఎందుల కన మనుష్యున కెపు డీశ్వరుఁడు సత్యమునకే జయము కలిగించుచున్నాఁ డను దృఢవిశ్వాసము గలుగుచున్నదో, అపుడు వాఁడు సత్యమును విడువఁడు, ధైర్యమును గలిగియుండును, దుఃఖమును సహించుచు మఱియు మమత్వరహితుఁ డగుటచే జననమరణచక్రమునుండి విముక్తుఁ డయి

యీశ్వరునే ధ్యానించుచు వానియందే లయ మగుచున్నాఁడు.

వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః.          ౧౦

రాగము, భయము మఱియుఁ గ్రోధము లేనివారు, నన్నే ధ్యానించుచు నా యాశ్రయమునే చైకొనువారు, జ్ఞానరూపమగు తపస్సుచేఁ బవిత్రులయిన యనేకులు నా స్వరూపమును బొంది యున్నారు.

యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహం,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.          ౧౧

ఎవ రేరీతి నన్నాశ్రయించుచున్నారో నేను వారి కా రీతిగనే ఫలము నొసంగుచున్నాను. ఏరీతిగ నయినను నో పార్థా! మనుష్యులు నామార్గము ననుసరించుచున్నారు - నా శాసనమునం దుండుచున్నారు.

వ్యాఖ్యానము: అనఁగా నెవఁడు నీశ్వరశాస

నము నుల్లంఘింపఁజాలఁడు. ఏది విత్తునో అదియే కోసి కొనును, ఏది చేయునో యదియే యనుభవించును. (కృతంభోక్తవ్యం) ఈశ్వరశాసనమందు - కర్మనియమ మందు దపవాదము లేదు. ఎల్లరికి సమానముగా నవఁగాఁ దమయోగ్యత ననుసరించి న్యాయము లభించుచున్నది.

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా. ౧౨

కర్మసిద్ధిని గోరువా రీలోకమున దేవతలఁ బూజించుచున్నారు. ఇందుచే వారికిఁ గర్మజనితఫలము తక్షణము మనుష్యలోకమునందే లభించుచున్నది.

వ్యాఖ్యానము: దేవత లనఁగా స్వర్గమునం దుండు నింద్రవరుణాదివ్యక్తులు గారు. దేవత యనఁగా నీశ్వరుని యంశరూపమగు శక్తి. ఈ యర్థమున మనుష్యుఁడు సయితము దేవతయె. ఆవిరి, విద్యుచ్ఛక్తి మున్నగు మహాశక్తులు దేవతలె. వాని నారాధించుట యొక్క ఫలము తక్షణము మఱియు నీ లోకమందే

లభించుచుండుట మనము చూచుచున్నాము. ఆఫలము క్షణికము. అది యాత్మకు సంతోషము నీయదు. అట్లై చో మోక్షము నెక్కడనుండి యొసంగఁగలదు ?

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. ౧౩

గుణకర్మవిభాగముననుసరించి నేను నాలుగువర్ణ ముల సృష్టించితిని, వానికిఁ గర్తనయియున్ననుగూడ నన్ను నీ వవినాశి యగు నకర్తగా గ్రహింపుము.

న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా,
ఇతి మాం యో ఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే. ౧౪

నన్నుఁ గర్మలు స్పృశింపవు. నాకు వీనిఫల విషయమున లాలసలేదు. ఈరీతిగ నెవరు నన్ను బాగు గాఁ దెలియుచున్నారో వారు కర్మబంధనమునఁ బడరు.

వ్యాఖ్యానము : ఎందులకన మనుష్యునియెదుటఁ గర్మఁ జేయుచుండియు నకర్మిగ నుండుటకు సర్వోత్తమ దృష్టాంతము గలదు. మఱియు నెల్లరికిఁ గర్త యీశ్వ

రుఁడే, మనము నిమిత్తమాత్రులమే, అట్టిచో నీకుఁ గర్తృత్వాభిమాన మెట్లు కలుగఁగలదు ?

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వై రపి ముముక్షుభిః,
కురు కర్మైవ తస్మా త్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్. ౧౫

ఇట్లు తెలిసి పూర్వకాలమున ముముక్షులగు వారు కర్మలు చేసియున్నారు. ఇందుచే నీవు పూర్వు లెట్లనాదినుండియుఁ జేయుచు వచ్చిరో అట్లు చేయుము.

కిం కర్మ కి మకర్మేతి కవయో ఽ ప్యత్ర మోహితాః,
త త్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. ౧౬

కర్మ యన నేమి, అకర్మ యన నేమి, ఈ విషయమున బుద్ధిమంతు లగువారు సయితము మోహమునఁ బడియున్నారు. ఆ కర్మవిషయమున నేను నీకు బాగుగాఁ దెలిపెదను. దాని నెఱింగి నీ వశుభమునుండి విడివడుదువు.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. ౧౭

కర్మ, నిషిద్ధకర్మ మఱియు నకర్మయొక్క భేదము నెఱుఁగవలయును. కర్మగతి గూఢము.

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః,
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్. ౧౮

కర్మయం దెవఁ డకర్మను గాంచుచున్నాఁడో మఱియు నకర్మయం దెవఁడు కర్మను జూచుచున్నాఁడో వాఁడు మనుష్యులలో బుద్ధిమంతుఁడుగ గణింపఁబడుచున్నాఁడు. అతఁడు యోగి మఱియు నతఁడు సంపూర్ణ కర్మ చేయువాఁడు.

వ్యాఖ్యానము : కర్మ చేయుచుండియుఁ గూడ నెవఁడు కర్తృత్వముయొక్క యభిమానమును గలిగి యుండఁడో, వానికర్మ యకర్మయె. మఱియు నెవఁడు బాహ్యమునుండి కర్మత్యాగము చేయుచుండియుఁగూడ మనస్సులో హార్మ్యములఁ గట్టుచునే యుండునో వాని యకర్మ కర్మయె. ఎవనికిఁ బక్షపాతము కలిగినదో వాఁడె పుడిచ్చాపూర్వకముగ - అభిమానపూర్వకముగ నిరుప

యోగమగు సంగమును గదల్చునో, అపు డది కదలును. ఈ వ్యాధిగ్రస్తమగు సంగము కదల్చుక్రియకుఁ గర్త యయినది. ఆత్మయొక్క గుణ మకర్తది. ఏది మోహగ్రస్త మయి తన్నుఁ గర్తగాఁ దలంచుచున్నదో, ఆయాత్మకుఁ బక్షవాతము గలిగిన ట్లగును. మఱియు నది యభిమాని యయి కర్మ జేయుచుండును. ఈరీతిగ నెవఁడు కర్మగతిని దెలియుచున్నాఁడో, ఆ బుద్ధిమంతుఁడగు యోగియే కర్తవ్యపరాయణుఁడుగ గణింపఁబడుచున్నాఁడు. "నేనుచేయుచున్నాను" అని భావించువాఁడు కర్మ వికర్మల భేదమును మఱచిపోవుచున్నాఁడు మఱియు సాధనయొక్క మంచిచెడ్డలగూర్చి విచారింపఁడు. ఆత్మయొక్క స్వాభావికగతి యూర్ధ్వము, కాఁబట్టి యెపుడు మనుష్యుఁడు నీతిమార్గమునుండితొలఁగుచుండునో అపుడు వానియందహంకార మవశ్యము కలదని చెప్పవచ్చును. అభిమానరహితునికర్మలు స్వాభావికముగనే సాత్త్వికములుగ నుండుచున్నవి.

యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః. ౧౯

ఎవని సమస్తారంభములు కామనలు మఱియు సంకల్పములు లేనివయియుండునో, వానికర్మలు జ్ఞానరూపమగు నగ్నిచే భస్మమయి పోయినవి; ఇట్టి వానిని జ్ఞానులు పండితుఁడని చెప్పుచున్నారు.

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతి సః. ౨౦

ఎవఁడు కర్మఫలత్యాగ మొనరించియున్నాఁడో, ఎవఁడు సర్వదా సంతుష్టుఁడయియుండునో, యెవని కే యాశ్రయలాలసయు లేదో వాఁడు కర్మయందు బాగుగాఁ బ్రవృత్తుఁడయియున్నను గూడ నేమియుఁ జేయుటలే దని చెప్పవచ్చును.

వ్యాఖ్యానము: అనఁగా వాఁడు కర్మబంధనము భోగింపవలసియుండదు.

నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః,
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్. ౨౧

ఎవఁ డాశారహితుఁడో, ఎవనిమనస్సు తనవశ మునం దున్నదో, ఎవఁడు సమస్తసంగ్రహమును విసర్జించి వైచెనో మఱియు నెవనిశరీరముమాత్రమే కర్మ చేయు చున్నదో వాఁడు చేయుచుండియు దూషితుఁడు గాఁడు.

వ్యాఖ్యానము: అభిమానపూర్వకముగఁ జేయఁ బడిన సమస్తకర్మ యెట్టి సాత్త్వికమయినదయినను బంధ నమును గలిగించును. అది యెపు డీశ్వరార్పణబుద్ధితో నభిమానశూన్యముగఁ జేయఁ బడుచున్నదో అపుడు బంధనరహిత మగుచున్నది. ఎవ్వాని "నేను" శూన్య తను బ్రాపించినదో, అతని శరీరముమాత్రమే కర్మ చేయుచున్నది. నిద్రించు మనుష్యునిశరీరము మాత్రమే కర్మ చేయుచున్న దని చెప్పనచ్చును. ఏవ్వైది బలాత్కా రమునకు వశుఁడయి యనిచ్ఛాపూర్వకముగ నాగలి దున్నుచున్నాఁడో వాని శరీరము మాత్రమే కర్మ చేయుచున్నది. ఎవఁడు తన యిచ్ఛచే నీశ్వరునిదైది యయినాఁడో, వాని విషయమునఁగూడ శరీరము

మాత్రమే కార్యము చేయుచున్నది. స్వయం అనునది శూన్యమయినది ; ప్రేరకుఁ డీశ్వరుఁడు.

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః,
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే.　　౨౨

ఎవఁడు సహజముగఁ బ్రాప్తమయినదానిచే సంతుష్టుఁడయి యుండునో, ఎవఁడు సుఖదుఃఖాది ద్వంద్వములనుండి ముక్తుఁడయ్యెనో, ఎవఁడు ద్వేషరహితుఁడయ్యెనో, మఱియు నెవఁడు సఫలత విఫలతలయందుఁ దటస్థుఁడో వాఁడు కర్మ చేయుచుండియుఁగూడ బంధనమునఁ బడఁడు.

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః,
యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే.　　౨3

ఎవఁ డాసక్తిరహితుఁడో, ఎవనిచిత్తము జ్ఞానమయమో, ఎవఁడు ముక్తుఁడో మఱియు నెవఁడు యజ్ఞార్థమే కర్మఁజేయువాఁడో వాని సమస్తకర్మలు లయమగుచున్నవి.

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్,
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా. ౨౪

(యజ్ఞములో) అర్పణము బ్రహ్మము, హవనము యొక్క-వస్తువు- హవిస్సు బ్రహ్మము, బ్రహ్మరూపమగు నగ్నియందు హవనము చేయువాఁడు నయితము బ్రహ్మమె; ఈరీతిగఁ గర్మతోడ బ్రహ్మసంయోగమును సాధించినవాఁడు బ్రహ్మనే పొందుచున్నాఁడు.

దైవమే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే,
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి. ౨౫

ఎందఱో యోగులు దేవతల పూజనరూపమగు యజ్ఞము చేయుచున్నారు. మఱియు నెందఱో బ్రహ్మ రూపమగు నగ్నిలో యజ్ఞముచే యజ్ఞమునే హోమము చేయుచున్నారు.

శ్రోత్రాదీ నీంద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి,
శబ్దాదీ న్విషయా నన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి. ౨౬

ఎందఱో శ్రవణాదీంద్రియములయొక్క సంయ

మయూపమగు యజ్ఞము చేయుచున్నారు. మఱికొందఱు శబ్దాదివిషయముల నింద్రియాగ్నియందు హోమము సేయుచున్నారు.

వ్యాఖ్యానము : వినుట యను క్రియ యిత్యాదుల సంయమించుట యొకటి; మఱియు నింద్రియముల నుపయోగించుచుండియు వాని విషయములఁ బ్రభుప్రీత్యర్థము వినియోగించుట రెండవది- ఎట్లన భజనాదికముల వినుట. వస్తుతః రెండు నొకటియె.

సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే,
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే.  ౨౭

మఱియు నెందఱో యింద్రియకర్మల నన్నింటిని మఱియుఁ బ్రాణకర్మలను జ్ఞానదీపకముచేఁ బ్రజ్వలితమొనరింపఁబడిన ఆత్మసంయమరూపమగు యోగాగ్నియందు హోమము చేయుచున్నారు.

వ్యాఖ్యానము : అనఁగాఁ బరమాత్మునియందుఁ దన్మయు లగుచున్నారు.

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే,
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః. ౨౮

ఈ చందమునఁ గొందఱు యజ్ఞార్థము ద్రవ్య మొసంగువారు ; కొందఱు తప మొనరించువారు నయి యున్నారు. కొందఱో యష్టాంగయోగము నభ్యసించు వారు నయి యున్నారు. ఎందఱో స్వాధ్యాయము మఱియు జ్ఞానయజ్ఞము చేయుచున్నారు. ఈ కఠినవ్రతధారు లందఱు ప్రయత్నశీలు రగు యాజ్ఞికులు.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణే ఽపానం తథాపరే,
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః. ౨౯

ఎందఱో ప్రాణాయామమందుఁ దత్పరులయి యుండువారు అపానమును బ్రాణవాయువునందు హోమము చేయుచున్నారు, ప్రాణము నపానమందు హోమము చేయుచున్నారు. లేదా ప్రాణమును మఱియు నపానమును నిరోధించుచున్నారు.

వ్యాఖ్యానము : మూఁడు విధములగు ప్రాణా

యామము లివి : రేచకము, పూరకము, కుంభకము. సంస్కృతమునఁ బ్రాణవాయువుయొక్క యర్థము గుజరాతీ (తెనుఁగు) అర్థమునకుఁ బ్రతికూలము. ఈ ప్రాణవాయువు లోపలినుండి వెలుపలకు బయల్వెడలునది. మనము దేనిని వెలుపలనుండి లోనికిఁ బీల్చుచున్నామో దానిని ప్రాణవాయువు - ఆక్సిజను అని చెప్పుచున్నారు.

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి,
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః.　　౩౦

ఇతరులాహారమును సంయమించి ప్రాణములఁ బ్రాణమందు హోమము చేయుచున్నారు. ఎవరు యజ్ఞములచేఁ దమ పాపముల క్షీణింపఁ జేసికొనియున్నారో, వీరందఱు యజ్ఞముఁ దెలియువారు.

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్,
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ.　　౩౧

ఓ కురుసత్తమా! యజ్ఞమునుండి శేషించిన యమృతమును భుజించువారు సనాతనబ్రహ్మను బడయు

చున్నారు. యజ్ఞము చేయనివాని కీలోకము లేదు, అట్టిచోఁ బరలోక మెటనుండి కలుగఁగలదు.

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే,
కర్మజాన్విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. ౩౨

ఈ చందమున వేదమునం దనేకవిధములగు యజ్ఞములవర్ణనము కలదు. వీని నన్నిఁటిని గర్మనుండికలిగినవానిగా నెఱుంగుము. ఈరీతిగ నన్నింటిని దెలిసి నీవు మోక్షమును బడయుదువు.

వ్యాఖ్యానము: ఇచటఁ గర్మకు వ్యాపకార్థము కలదు, అనఁగా శారీరకము, మానసికము మఱియు నాత్మికము. ఇట్టికర్మ లేకయే యజ్ఞము గాఁజాలదు. యజ్ఞము లేకుండ మోక్షము గలుగదు. ఈ రీతిగఁ దెలియుట మఱియుఁ దదనుసారముగ నాచరించుటకే యజ్ఞములఁ దెలియుట యని పేరు. మనుష్యుఁడు తనశరీరమును, బుద్ధిని మఱియు నాత్మను ప్రభుప్రీత్యర్థము-లోకసేవార్థము వినియోగింపనిచోఁ జోరుఁడుగ నిశ్చ

యింపఁబడును మఱియు మోక్షమునకుఁ బాత్రుఁడు కాఁజాలఁడు. ఇదియే పైదాని తాత్పర్యము. ఎవఁడు కేవలము బుద్ధిశక్తినే యుపయోగించునో మఱియు శరీరమును ఆత్మను దాచి యుంచుకొనునో వాఁడు పూర్ణయోగ్యుఁడు గాఁడు; ఈ శక్తులను బడయుటయే అది పరోపకారార్థ ముపయోగింపఁ జాలదు. కాఁబట్టి ఆత్మశుద్ధి లేకుండ లోకసేవ యసంభవము. శరీరమును, బుద్ధిని మఱియు నాత్మను - నీతిని మూఁడింటిని సమాన రూపముగ వికసింపఁజేయుట సేవకుని కర్తవ్యము.

> శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞా జ్జ్ఞానయజ్ఞః పరంతప,
> సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే.　　33

ఓ పరంతపా! ద్రవ్యయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము మిక్కిలిమంచిది, ఎందులకన నో పార్థా! సమస్తకర్మలు జ్ఞానమునందే పరాకాష్ఠకుఁ బ్రాపించుచున్నవి.

వ్యాఖ్యానము : పరోపకారవృత్తిచే నొసంగఁబడిన ద్రవ్యము సయితము జ్ఞానపూర్వకముగ నీయఁబ

యుండవన్నచో ననేకపర్యాయములు హాని నొదవిం
చును, ఇది యెవని కనుభవము లేదు? మంచివృత్తిచే
జరుగు సమస్తకర్మలు జ్ఞానముతో గూడియున్నపుడే
శోభించుచున్నవి. కాబట్టి సమస్తకర్మల పూర్ణాహుతి
జ్ఞానమునందే కలదు.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః. ౩౪

దీనిని నీవు తత్త్వము తెలియు జ్ఞానులసేవ సలిపి మ
ఱియు నమ్రతాపూర్వకముగ వివేకసహితముగఁ బదేపదే
ప్రశ్నించి తెలిసికొనుము. వారు నీ జిజ్ఞాసను దృప్తి
పఱచెదరు.

వ్యాఖ్యానము: జ్ఞానమును బడయుటకు మూఁడు
షరతులు-ప్రణిపాతము, పరిప్రశ్నము, సేవ యనున వీ
యుగమున బాగుగా ధ్యానమునం దుంచుకొనఁ దగి
నవి. ప్రణిపాత మనఁగా నమ్రత, వివేకము; పరిప్రశ్న మ
నఁగా మాటిమాటికి కడుగుట; సేవారహితమగు నమ్ర

త ముఖస్తుతియాదు లెక్కింపఁబడవచ్చును. మఱియు జ్ఞానము పరిశోధనము లేకుండ సంభవముగాదు. కాఁబట్టి తెలియువఱకు శిష్యుఁడు గురువును నమ్రతాపూర్వకముగఁ బ్రశ్న లడుగుచుండ నగును. ఇది జిజ్ఞాసయొక్క చిహ్నము. ఇందు శ్రద్ధ యవసరము. ఎవనియందు శ్రద్ధ కలుగదో వానియెడ హృదయపూర్వకమగు నమ్రత కలుగదు; (అట్టిచో) వానిసేవ యెట్లు పొసఁగఁ గలదు?

> యజ్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ,
> యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి. ౩౫

ఈ జ్ఞానమును బడసినపిదప నో పాండవా! మఱల నీకిట్టి మోహము కలుగదు. ఈ జ్ఞానముచే నీవు సకలభూతముల నాత్మయందును మఱియు నాయందును గాంచెదవు.

వ్యాఖ్యానము : 'యథా పిండే తథా బ్రహ్మాండే' యొక్క యర్థ మిదియే. ఎవని కాత్మదర్శన మయినదో

ఎవఁడు సమత్వరూపమగు యోగముచేఁ గర్మల ననఁగా గర్మఫలమును ద్యజించి యున్నాఁడో మఱియు జ్ఞానముచే సంశయమును నిర్మూలించి యున్నాఁడో, అట్టి యాత్మదర్శికి, ఓ ధనంజయా! కర్మలు బంధన రూపములు గావు.

తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః,
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత. ౪౨

కాఁబట్టి యోభారతా! హృదయమం దజ్ఞానముచే నుత్పన్నమైన సంశయము నాత్మజ్ఞానరూపమగు ఖడ్గముచే ఖండించి యోగమును సమత్వమును ధరించి నిలఁబడుము.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానకర్మసన్న్యాసయోగో నామ
చతుర్థో ఽధ్యాయః.

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతారూపమగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జునుల సంవాదముయొక్క జ్ఞానకర్మసన్న్యాస యోగ మను పేరుగల నాల్గవయధ్యాయము ముగిసెను.

---

## ౫

## కర్మసన్న్యాసయోగము.

ఈ యధ్యాయమునఁ గర్మయోగము లేకుండ గర్మసన్న్యాసము కానేరఁజాలదనియు మఱియు వస్తుతః రెండు నొక్కటియే యనియుఁ జెప్పఁబడినది.

అర్జున ఉవాచ :—

సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి,
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్. ౧

అర్జునుఁడు చెప్పెను : ఓకృష్ణా! కర్మత్యాగము యొక్కయు మఱియుఁ గర్మయోగముయొక్కయు స్తుతి సెపు చేయుచున్నావు. ఈ రెంటిలో శ్రేయస్కర మేది

రెయో, అది నాకు యథార్థముగా నిశ్చయపూర్వకముగాఁ జెప్పుము.

శ్రీభగవానువాచ :—

> సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ,
> తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే. ౨

శ్రీ భగవానుఁడు చెప్పెను: కర్మత్యాగము మఱియు యోగము రెండును మోక్షదాయకములె. వానిలోఁగూడఁ గర్మసన్న్యాసముకంటెఁ గర్మయోగము అధికమయినది.

> జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి,
> నిర్ద్వంద్వోహి మహాబాహో సుఖం బంధా త్ప్రముచ్యతే. ౩

ఏమనుష్యుఁడు ద్వేషము మఱియు నిచ్ఛను గలిగియుండఁడో వానిని నిత్యసన్న్యాసిగ నెఱుంగవలయును. ఎవఁడు సుఖదుఃఖాదిద్వంద్వములనుండి ముక్తుఁడో, వాఁడు సహజముగ బంధనములనుండి విడివడుచున్నాఁడు.

వ్యాఖ్యానము : తాత్పర్యమే మనఁగా సన్న్య

సమునొక్క ముఖ్యమగు లక్షణము కర్మత్యాగము గాదు కాని ద్వంద్వాతీతుఁడగుటయే. ఒక మనుష్యుఁడు కర్మ చేయుచుండియుఁ గూడ సన్న్యాసి కావచ్చును, రెండవవాఁడు కర్మ చేయకుండియుఁ గూడ మిథ్యాచారి కావచ్చును. 3 వ అధ్యాయమున 6 వ శ్లోకము చూడుఁడు.

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి నపండితాః,
ఏకమప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్. ౪

సాంఖ్యము మఱియు యోగము - జ్ఞానము మఱియుఁ గర్మ - ఈ రెంటను భిన్నములు అని యజ్ఞానులు చెప్పుచున్నారు, పండితులు చెప్పరు. ఒకదానియందు బాగుగా స్థిరపడువాఁడు సయితము రెంటిఫలమును బడయుచున్నాఁడు.

వ్యాఖ్యానము : జ్ఞానయోగి లోకసంగ్రహరూపమగు కర్మయోగముయొక్క విశేషఫలమును సంకల్పమాత్రమునఁ బడయుచున్నాఁడు. కర్మయోగి తన

యనాసక్తిచేత బాహ్యకర్మ చేయుచుండియుఁ గూడ జ్ఞానయోగియొక్క శాంతిని సహజముగా భోగించుచున్నాఁడు.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే,
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి.　　౫

ఏస్థానమును సాంఖ్యమార్గావలంబి పొందుచున్నాఁడో, అదియే యోగికూడ పొందుచున్నాఁడు. ఎవఁడు సాంఖ్యమును మఱియు యోగము నొక్కటేరూపముగఁ జూచుచున్నాఁడో వాఁడే నిజముగు చూచువాఁడు.

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః,
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరే ణాధిగచ్ఛతి.　　౬

ఓ మహాబాహూ! కర్మయోగము లేకుండఁ గర్మత్యాగము కష్టసాధ్యము, కాని సమత్వముఁగల ముని శీఘ్రముగ మోక్షము నందుచున్నాఁడు.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః,
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి నలిప్యతే.　　౭

ఎవఁడు యోగము నభ్యసించినాఁడో, ఎవఁడు హృదయమును విశుద్ధమొనరించుకొనినాఁడో, ఎవఁడు మనస్సు మఱియు నింద్రియములను జయించినాఁడో మఱియు నెవఁడు సకలభూతములఁ దనవలెనే భావించుచుండునో, అట్టి మనుష్యుఁడు కర్మచేయుచుండియు దాని నుండి యలిప్తుఁడుగా నుండును.

నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యఞ్ శృణ్వన్ స్పృశఞ్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపఞ్ శ్వసన్.
ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్. ౯

చూచుచు, వినుచు, స్పృశించుచు, వాసనచూచుచు, తినుచు, నడచుచు, నిద్రించుచు, గాలిపీల్చుచు, మాట్లాడుచు, విడుచుచు, తీసికొనుచు, కన్నుఁదెఱచుచు-మూయుచుఁ దత్త్వజ్ఞుఁడగు యోగి కేవల మింద్రియములే తమపని జేసికొనుచున్న వను భావనగలిగియుండి నే నేమియుఁ జేయుటయే లేదు; అని తెలియనగును.

శరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను లేక కేవల మింద్రియములచేతను గూడ యోగిజనులు సంగ రహితులయి ఆత్మశుద్ధి నిమిత్తము కర్మ చేయుచున్నారు.

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్.
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. ౧౨

సమత్వము గలవాఁడు కర్మఫలత్యాగ మొనరించి పరమశాంతిని బడయుచున్నాఁడు. అస్థిరచిత్తుఁడు కానాయుక్తుఁడగువాఁడు ఫలమునకు లోఁబడి బంధనము నొందును.

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్. ౧౩

సంయమియగు పురుషుఁడు మనస్సుచే సమస్త కర్మలఁ ద్యజించి నవద్వారములు గల నగరరూపమగు శరీరమునందు తానుగూడ నేమియుఁ జేయక, చేయింపక సుఖముగ నుండును.

వ్యాఖ్యానము: రెండు ముక్కలు, రెండు

చెవులు, రెండు కన్నులు, మలత్యాగముయొక్క రెండు
స్థానములు మఱియు నోరు శరీరముయొక్క ముఖ్యనవ
ద్వారములు. మిగిలిన చర్మముయొక్క యసంఖ్యాకము
లగు ఛిద్రములన్నియు ద్వారములే. ఈ ద్వారముల
యొక్క పాలకుఁడు వీనిలోపలకు వచ్చే పోయే యధికా
రులనే రానిచ్చుచుఁ బోనిచ్చుచు నుండి తన ధర్మమును
పాలించుచున్నచో నీరాకపోకలు జరుగుచున్నను గూడ
వాఁడు దానియందు భాగస్థుఁడు కాఁడనియు, కాని
కేవలసాక్షిమాత్రుఁడనియు, ఇందుచే నతఁడు చేయుట
యు లేదు, చేయించుటయు లేదనియు వాని విషయ
మునఁ జెప్పవచ్చును.

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే.　　　౧౪

జగత్ప్రభువు కర్తృత్వమును నిర్మించుటలేదు,
కర్మను నిర్మించుటలేదు; కర్మమునకు మఱియు ఫలము
నకు సంబంధమును గూర్చుటలేదు. ప్రకృతియే సమస్త
మును జేయుచున్నది.

వ్యాఖ్యానము : ఈశ్వరుఁడు కర్తగాఁడు. కర్మనియమ మచలము, అనివార్యము. మఱియు నెవఁ డెట్లు చేయునో వాఁ డట్లనే భరింపవలసియుండును. ఇందే యీశ్వరుని యపారమగు దయ మఱియు నతని న్యాయమును విద్యమానము లయియున్నవి. విశుద్ధన్యాయమున విశుద్ధదయ కలదు. న్యాయమును విరోధించు దయ దయ కానేరదు, కాని యది క్రూరత్వమగును. కాని మనుష్యుఁడు త్రికాలదర్శి కాఁడు. ఇందుచే వానికి దయ - క్షమయే న్యాయము. వాఁడు స్వయముగ నిరంతరము న్యాయపాత్రుఁడయి క్షమాయాచకుఁడుగ నున్నాఁడు. వాఁడు పరుల న్యాయమును క్షమవలననే తీర్పఁగలఁడు. క్షమయొక్క గుణమును వికసింపఁజేసిన పిదపనే తుదకు అకర్త - యోగి - సమత్వవంతుఁడు - కర్మయందుఁ గుశలుఁడు కాఁగలుగుచున్నాఁడు.

నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః,
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః. ౧౫

ఈశ్వరుఁడెవ్వాని పాపమును లేక పుణ్యమును దనపైన వేసికొనఁడు. అజ్ఞానముచే జ్ఞానమావరింపఁబడుటచే మనుష్యులు మోహమునఁ జిక్కుచున్నారు.

వ్యాఖ్యానము : అజ్ఞానముచే, 'నేను చేయుచున్నాను' అను వృత్తిచే మనుష్యుఁడు కర్మబంధనము నిర్మించుకొనుచున్నాఁడు. అయినప్పటికిని వాఁడు వంచి చేష్టఫలము నీశ్వరునిపై నారోపించుచున్నాఁడు, ఇది మోహజాలము.

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః,
తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్.        ౧౬

కాని యెవ్వారి యజ్ఞాన మాత్మజ్ఞానముచే నశించినదో, వారి యా సూర్యసమానమగు, ప్రకాశము యజ్ఞానము పరమతత్త్వదర్శనము చేయించుచున్నది.

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛం త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః.        ౧౭

జ్ఞానముచే నెవ్వారి పాపములు కడగఁబడినవో

వారు, ఈశ్వరధ్యానమును గలిగియుండువారు, తన్మయు లయినవారు, వానియందు సుస్థిరులయి యుండువారు, వానిని సర్వస్వముగ భావించువారు మోక్షమును బడయుచున్నారు.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః. ౧౮

జ్ఞానులు విద్వాంసుని, వినయసంపన్నుఁడగు బ్రాహ్మణుని, గోవును, ఏనుఁగును, కుక్కను, చండాలుని సమానముగాఁ జూచుచుందురు.

వ్యాఖ్యానము: వారి యావశ్యకత ననుసరించి యెల్లరికి సేవ చేయుచుందురు. బ్రాహ్మణుని యెడను, చండాలునిపట్లను సమభావమును గలిగియుండుట కర్థ మేమనఁగా బ్రాహ్మణుని పాము కఱచినపుడు వానిగాయము నెట్లు జ్ఞాని ప్రేమభావముచేఁ బీల్చి దానివిషమును దొలఁగింప యత్నించునో, అట్టి యాచరణము నే చండాలుని బాము కఱచినపుడు చూపించును.

ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః. ౧౯

ఎవ్వారిమనస్సు సమత్వమునందు స్థిరమయినదో, వా రీ దేహమునం దుండగనే సంసారమును జయించిరి. బ్రహ్మము నిష్కళంకము, సమభావము గలది. కాఁబట్టి వారు బ్రహ్మమందే సుస్థిరు లయినారు.

వ్యాఖ్యానము: మనుష్యుఁ డెట్లు దేనిని జింతించు చుండునో, అట్లనే యగుయిపోవును. కాఁబట్టి సమత్వమును జింతించి, దోషరహితుఁడయి, సమత్వముయొక్క మూర్తి రూపమగు నిర్దోషబ్రహ్మమును బడయుచున్నాఁడు.

నప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్,
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః. ౨౦

ఎవనిబుద్ధి స్థిరమయినదో, ఎవనిమోహము నశించినదో, ఎవఁడు బ్రహ్మ నెఱుంగునో మఱియు నెవఁడు బ్రహ్మపరాయణుఁడుగ నుండునో వాఁడు ప్రియమును బొంది సుఖమును దలంపఁడు మఱియు నప్రియమును బడసి దుఃఖింపఁడు.

బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్,
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. ౨౧

బాహ్యవిషయములయందు దాసక్తిని గలిగియుండని పురుషుఁడు తన యంతఃకరణమందే యానందమును భోగించుచున్నాఁడో, ఆ యక్షయానందమును బ్రహ్మపరాయణుఁడగు పురుషుఁ డనుభవించుచున్నాఁడు.

వ్యాఖ్యానము : ఎవఁ డంతర్ముఖుఁ డయినాఁడో, వాఁడే యీశ్వరుని సాక్షాత్కరింపఁ జేసికొనఁగలుగుచున్నాఁడు. మఱియు నతఁడే పరమానందమును బడయుచున్నాఁడు. విషయములనుండి నివృత్తుఁడుగనుండి కర్మ చేయుట మఱియు బ్రహ్మసమాధియందు రమించుట యీ రెండును భిన్నమగు వస్తువులు గావు. కాని యొక్క వస్తువును గాంచు రెండుదృష్టులు - ఒక్క నాణ్యముయొక్క రెండు ముఖములు.

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే,
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః.

విషయజనితభోగము లవశ్యము దుఃఖకారణ ములు. ఓ కౌంతేయా! అవి యాది మఱియు నంతము గలవి. బుద్ధిమంతుఁడగు మనుష్యుఁడు వానియందు మన స్సును బ్రవృత్త మొనరింపఁడు.

శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః. ౨౩

దేహాంతమునకుఁ బూర్వము నే మనుష్యుఁ డీదేహ మున నే కామముయొక్కయు మఱియుఁ గ్రోధముయొక్కయు వేగమును సహించుశక్తిని బడయుచున్నాఁడో, ఆమను ష్యుఁడు సమత్వమును బొందినాఁడు, వాఁడు సుఖి.

వ్యాఖ్యానము : మృతశరీరమున కెట్లిచ్ఛాద్వేష ములు కలుగవో, సుఖదుఃఖములు పొడమవో, అట్లు వఁడు జీవితుఁడయి యుండియుఁగూడ మృతసమాన ముగ - జడభరతునిరీతిగ దేహాతీతుఁడుగ నుండఁగలఁడో వాఁ డీజగమున విజయుఁ డయినాఁడు మఱియు నతఁడు యథార్థమగు సుఖమును దెలియుచున్నాఁడు.

యో ఽంతస్సుఖో ఽంతరారామ స్తథాంతర్జ్యోతిరేవ యః,
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతో ఽధిగచ్ఛతి. ౨౪

ఎవని కాంతరికానందము గలదో, ఎవ్వాని హృదయమున శాంతి గలదో, ఎవని కవశ్యముగ నంతర్జ్ఞానము గలిగినదో, ఆ బ్రహ్మరూపుఁడయిన యోగి బ్రహ్మనిర్వాణమును బొందుచున్నాఁడు.

లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః,
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః. ౨౫

ఎవ్వారిపాపములు నశించినవో, ఎవరిశంకలు శమించినవో, ఎవరు మనస్సుపై నధికారమును బడసిరో మఱియు నెవరు సకలభూతహితమున రతులయియుండురో యట్టి ఋషులు బ్రహ్మనిర్వాణమును బడయుచున్నారు.

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్,
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. ౨౬

ఎవరు తమ్ము గురుతించుచున్నారో, ఎవరు కామ

క్రోధముల జయించిరో మఱియు నెవరు మనస్సును వశ మొనరించుకొనియున్నారో యట్టి యతులకు సర్వత్ర బ్రహ్మనిర్వాణమే కలదు.

> స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః,
> ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ.　　౨౭
> యతేన్ద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః,
> విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః.　　౨౮

బాహ్యవిషయభోగముల బహిష్కరించి, దృష్టిని భ్రుకుటిమధ్యమున స్థిర మొనరించి నాసికద్వారమున వచ్చుచుం బోవుచుండు ప్రాణ, అపానవాయువులయొక్క గతిని సమాన మొనరించి, ఇంద్రియములను, మనస్సును మఱియు బుద్ధిని వశ మొనరించుకొని, మఱియు నిచ్ఛ, భయము, క్రోధములనుండి రహితుండయి యే ముని మోక్షమునం బరాయణుండయి యుండుచున్నాం డో వాండు సర్వదా ముక్తుండే.

వ్యాఖ్యానము: ప్రాణవాయు వనగా లోపలినుండి వెలుపలికి వెడలునది మఱియు నపానవాయువు వెలు

పలినుండి లోని కరుగునది. ఈ శ్లోకములలో ప్రాణాయామాది యౌగికక్రియలసమర్థన కలదు. ప్రాణాయామాదికములు బాహ్యక్రియలు మఱియు వాని ప్రభావము, శరీరమును స్వస్థముగా నుంచుటకును మఱియుఁ బరమాత్ముని నివాసమునకు యోగ్యమగు మందిరముగఁ జేయువఱకును బరిమితమయి యున్నది. భోగియొక్క సాధారణవ్యాయామాదికములచే నేప్రయోజనముకలుగుచున్నదో, ఆప్రయోజనమే యోగియొక్క ప్రాణాయామాదికములచేఁ గలుగుచున్నది. భోగియొక్క వ్యాయామాదులు వానియింద్రియముల నుత్తేజింపఁ జేయుటలో సహకారు లగుచున్నవి. ప్రాణాయామాదులు యోగిశరీరమును రోగము లేనిదిగను, కఠినముగను జేసినపిమ్మట సయితము, ఇంద్రియముల శాంతముగ నుంచువిషయమున సాహాయ్యభూతము లగుచున్నవి. ఈ రోజులలోఁ బ్రాణాయామాదులవిధి చాల తక్కువమందికే తెలియును. మఱియు వారిలోఁ

గూడ మిక్కిలి స్వల్పసంఖ్యాకులే దానిని సద్వి నియోగము చేయుచున్నారు. ఎవఁ డింద్రియములు మనస్సు మఱియు బుద్ధిపైన నధికముగఁ గాకున్నను బ్రాథమికవిజయమును గాంచియున్నాఁడో, ఎవనికి మోక్షము యొక్క గాఢాభిలాష కలదో, ఎవఁడు రాగ ద్వేషాదుల జయించి భయమును బాసియున్నాఁడో వానికిఁ బ్రాణాయామాదు లుపయోగకరములును, సహకారులును నగుచున్నవి. అంతశ్శౌచము లేని ప్రాణా యామాదులు బంధనమున కొక సాధనమయి మను ష్యుని మోహకూపమందలి మిక్కిలి యడుగుభాగము నకుఁ గొనిపోవచ్చును - కొనిపోవుచున్నవి, అనేకుల కిట్టి యనుభవము కలదు. ఇందుచే యోగీంద్రుఁడగు పతం జలి యమనియమములకుఁ బ్రథమస్థానము నొసంగి, దానిసాధకునికే మోక్షమార్గమునఁ బ్రాణాయా మాదుల సహకారులుగ [illegible]ంచి యున్నాఁడు.

యమములయిదు : అహింస, సత్యము, అస్తే

యము, బ్రహ్మచర్యము మఱియు నపరిగ్రహము. నియమములయిదు : శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము మఱియు నీశ్వరప్రణిధానము.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి.

యజ్ఞముయొక్కయు మఱియుఁ దపస్సుయొక్కయు భోక్తను, సకలలోకమహేశ్వరుఁడను, సకలభూతహితకారుఁడను నయిన నన్నుఁ దెలిసి (మీఁదిముని) శాంతిని బడయుచున్నాఁడు.

వ్యాఖ్యానము : ఈయధ్యాయమందలి పదునాల్గవ, పదునైదవ మఱియు నిట్టివేయగు నితరశ్లోకముల కీశ్లోకము విరోధక మయిన దని యెవరును దలంపరాదు. ఈశ్వరుఁడు సర్వశక్తిమంతుఁడయ్యుఁగర్త,అకర్త-భోక్త, అభోక్త యేదియన్న నగ యే యగుచున్నాఁడు మఱియు నగుచుండుటయు లేదు. అతఁడు అవర్ణనీయుఁడు. మనుష్యుని భాష కతీతుఁడు. ఇందుచే వానియందుఁ బరస్పరవిరుద్ధము

లగు గుణములను మఱియు శక్తులనుగూడ నారోపించి, మనుష్యుఁడు వానిదర్శనమం దాశను గలిగియుండు చున్నాఁడు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాసయోగోనామ పంచమోఽధ్యాయః.

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతారూపమగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గతయోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జునసంవాదముయొక్క కర్మసన్న్యాస యోగ మను పేరుగల యైదవయధ్యాయము ముగిసినది.

## ౬

## ధ్యానయోగము.

ఈ యధ్యాయమున యోగసాధనమునకు - సమత్వమును బడయుటకు - కొన్ని యోగ సాధనములు తెలుపఁ బడినవి.

శ్రీభగవానువాచ:—

> అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః,
> స సన్న్యాసీచ యోగీచ న నిరగ్నిర్నచాక్రియః. ౧

శ్రీ భగవానుఁడు చెప్పెను : కర్మఫలాశ్రియమును గైకొనకుండ నే మనుష్యుఁడు విహితకర్మ చేయుచున్నాఁడో వాఁడు సన్న్యాసి, వాఁడు యోగి ; ఎవఁ

దగ్నిని మఱియుఁ గులక్రియలను త్యజించి కూర్చొనుచున్నాఁడో వాఁడు కాదు.

**వ్యాఖ్యానము:** అగ్ని యనఁగా సకలసాధనములు. ఎప్పు డగ్నిచే హోమములు జరుగుచుండెనో, అప్పు డగ్ని యవసరమయి యుండెను. ఈ యుగమున రాటము సేవాసాధన మనుకొనుఁడు కావున దానిని త్యజించుటచే సన్న్యాసి కాఁజాలఁడు.

యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ,
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన. ౨

ఓ పాండవా! దేనిని సన్న్యాసమని చెప్పుచున్నారో దానిని నీవు యోగ మని తెలియుము. ఎవఁడు మనస్సుయొక్క సంకల్పములఁ ద్యజింపలేఁడో వాఁ డెన్నఁడు యోగి కాఁజాలఁడు.

ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే,
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే. 3

యోగసాధకునకుఁ గర్మసాధనము, ఎవఁడు దానిని సాధనచేసెనో వానికి శాంతి సాధనము.

వ్యాఖ్యానము : ఎవని కాత్మశుద్ధి కలిగినదో, ఎవఁడు సమత్వమును సిద్ధింపఁజేసికొనినాఁడో వాని కాత్మదర్శనము సహజము. యోగారూఢునకు లోకసంగ్రహమునకు సయితము కర్మచేయు నావశ్యకత లేదనుట దీనియర్థము గాదు. లోకసంగ్రహము లేకుండ వాఁడు జీవింపనే జాలఁడు. అనఁగా సేవాకర్మ చేయుటకూడ వానికి సహజమయి పోవుచున్నది. వాఁడు ఆడంబరము కొఱ కేమియుఁ జేయఁడు. 3 అధ్యా-4వశ్లో; 5 అధ్యా-2వశ్లోకముతోఁ గలిపిచూడుఁడు.

> యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే,
> సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. ౪

ఎపుడు మనుష్యుఁ డింద్రియముల విషయముల యందు లేక కర్మయం దాసక్తుఁడుగాఁడో మఱియు సమస్తసంకల్పములఁ ద్యజించివేయునో అపుడు వాఁడు యోగారూఢుఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

> ఉద్ధరే దాత్మనా ఽఽత్మానం నా ఽఽత్మాన మవసాదయేత్,
> ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః. ౫

ఆత్మచే మనుష్యుఁ డాత్మ నుద్ధరించుకొననగును; దాని నధోగతికిఁ ద్రోయరాదు. ఆత్మయే యాత్మకు బాంధువు; మఱియు నాత్మయే యాత్మకు శత్రువు.

బంధు రాత్మాఽఽత్మన స్తస్య యే నాత్మైవాత్మనా జితః
అనాత్మన స్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్. ౬

ఎవఁడు తనబలముచే మనస్సును జయించెనో వానికే యాత్మ బాంధువు; ఎవఁ డాత్మను జయింపలేఁడో వాఁడు తనయెడనే శత్రువువలెఁ బ్రవర్తించుచున్నాఁడు.

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః. ౭

ఎవఁడు తనమనస్సును జయించెనో మఱియు నెవఁడు సంపూర్ణరూపమున శాంతుఁ డయినాఁడో వాని యాత్మ శీతము, ఉష్ణము, సుఖము, దుఃఖము మఱియు మానావమానము లందు నొక్కవిధముగ నుండును.

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః. ౮

ఎవఁడు జ్ఞానము మఱియు ననుభవముచేఁ దృప్తుఁడయ్యెనో, ఎవఁ డచలుఁడో, ఎవఁ డింద్రియముల జయించెనో మఱియు నెవనికి మట్టిపెళ్ల, రాయి మఱియు బంగారము సమానమో యట్టి యీశ్వరపరాయణుఁ డగు మనుష్యుఁడు యోగి యనఁబడుచున్నాఁడు.

సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు,
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే. ౯

హితైషి, మిత్రుఁడు, శత్రువు, నిష్పక్షపాతి, ఉభయుల మేలుకోరువాఁడు, ద్వేషి, బంధువు మఱియు సాధువు, పాపి వీరందఱియందు నెవఁడు సమానభావమును గలిగి యుండునో వాఁడు శ్రేష్ఠుఁడు.

యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః. ౧౦

చిత్తమును స్థిరమొనరించి, వాసనను మఱియు సంగ్రహమును ద్యజించి, ఒంటరిగా నేకాంతమం దుండి యోగి నిరంతర మాత్మను బరమాత్మతోడ నైక్య మొనరింప నగును.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః,
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్. ౧౧
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే. ౧౨

పవిత్రస్థానమున దర్భాసనము, మృగచర్మము మఱియు వస్త్రము నొకదానిపై నొకటి పఱచి మిక్కిలి యెత్తును మఱియు మిక్కిలి పల్లమును గానట్టి యాసనమును దనకొఱకయి వేసికొని, దానిపై నేకాగ్రమనస్సుతోఁ గూర్చుండి చిత్తమును మఱియు నింద్రియములను వశ మొనరించుకొని ఆత్మశుద్ధి నిమిత్తము యోగసాధనము చేయనగును.

సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్. ౧౩
ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః. ౧౪

కాయమును, మెడను, మస్తకమును సమరేఖయం దచలముగా నుంచి, స్థిరముగానుండి, ఇటు నటుఁ

జూడనివాఁడయి తన నాసికాగ్రమున దృష్టిని నిలిపి, పూర్ణమగు శాంతితో, భయరహితుఁడయి, బ్రహ్మచర్యమున సుదృఢుఁడయి, మనస్సును జయించి నాయందుఁ బరాయణుఁడయిన యోగి నాధ్యానము చేయుచుఁ గూర్చుండ నగును.

వ్యాఖ్యానము : నాసికాగ్ర మనఁగా భ్రుకుటికి నడుమనున్న స్థానము. ౫ వ అధ్యాయమున 27 శ్లో. చూడుఁడు. బ్రహ్మచర్యవ్రతమున కర్థము కేవలము వీర్యసంగ్రహమే కాదు, దానితోఁ బాటు బ్రహ్మను బొందుటకావశ్యకములగు నహింసాది సమస్తవ్రతములును.

యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః,
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి. ౧౫

ఈరీతిగ నెవని మనస్సు నియమమందున్నదో యట్టి యోగి యాత్మానుసంధానమును బరమాత్మునితోడఁ గావించుచున్నాఁడు. మఱియు నా ప్రాప్తియందుండు మోక్షరూపమగు పరమశాంతిని బడయుచున్నాఁడు.

నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్తమనశ్నతః,
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున. ౧౬

ఓ యర్జునా! ఈ సమత్వరూపమగు యోగము కుత్తుకబంటి తినువానికి లభించుటలేదు, కేవల ముపవాసము లొనరించువానికి లభింపదు; అట్లనే యది యమితముగ నిద్రించువానికి లేక యమితముగ మేల్కొని యుండువానికిని బ్రాప్తించుటలేదు.

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. ౧౭

ఏ మనుష్యుఁ డాహారవిహారములందు, ఇతర కర్మలందు, నిద్రించుట మేల్కాంచుటయందు మితముగ నుండునో వాని యోగము దుఃఖభంజన మగుచున్నది.

యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే,
నిస్స్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. ౧౮

బాగుగా నియమబద్ధమయిన మనస్సు యెప్పు డాత్మయందు స్థిర మగుచున్నదో మఱియు మనుష్యుఁడు

సమస్తకామనలయందు నిస్పృహుఁడయి పోవుచున్నాఁడో అప్పు డతఁడు యోగి యని చెప్పఁబడుచున్నాఁడు.

> యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా,
> యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః. ౧౯

ఆత్మను బరమాత్మునితోఁ గూర్చు ప్రయత్నము చేయు స్థిరచిత్తుఁడగు యోగియొక్క స్థితి వాయురహితస్థానమం దచలముగ నుండు దీపమువంటి దని చెప్పఁబడినది.

> యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
> యత్ర చైవాత్మనా ఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి. ౨౦
> సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్,
> వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః. ౨౧
> యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
> యస్మిం స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. ౨౨
> తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్,
> స నిశ్చయేన యోక్తవ్యో యోగో నిర్విణ్ణచేతసా. ౨౩

యోగసేవనముచే స్వాధీనమయిన మనస్సు యెచట శాంతిని బడయుచున్నదో, ఆత్మవలననే యాత్మను గురుతించి ఆత్మయం దెచట మనుష్యుఁడు సంతోషమును బడయుచున్నాఁడో; మఱియు నింద్రియములకుఁ బరము, బుద్ధిచే గ్రహణయోగ్యమయిన యనంతసుఖానుభవ మెచటఁ గలుగుచున్నదో, ఎచట నుండి మనుష్యుఁడు మూలవస్తువునుండి చలాయమానుఁ డుగాఁడో మఱియు దేనిని బొందినపిదప దానికంటె మఱెట్టిలాభమును వాఁ డధికమని భావింపఁడో మఱియు దేని యందు స్థిరుఁడయి మహాదుఃఖమువలననుగూడఁ జలింపఁడో, ఆదుఃఖప్రసంగరహితస్థితియొక్క నామము యోగస్థితి యని గ్రహింపవలయును. ఈయోగము విసువుఁ జెందకుండ దృఢతాపూర్వకముగ సాధింపయోగ్యమయి యున్నది.

సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః,
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః. ౨౪

శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా నకించిదపి చింతయేత్. ౨౫

సంకల్పమునుండి పుట్టునసమస్త కామనల సంపూర్ణ రూపమునఁ ద్యజించి, మనస్సుచేతనే యింద్రియసమూహము నెల్లవైపులనుండి బాగుగా నియమమునం దుంచి, అచలబుద్ధితో యోగి నెమ్మది నెమ్మదిగా విరమించుచు మఱియు మనస్సు నాత్మయందుఁ దగిల్చి మఱేద్దియు విచారింపఁ దగదు.

యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్,
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్. ౨౬

ఎట నెటకుఁ జంచలమును మఱియు నస్థిరమును నగు మనస్సు పర్వెత్తునో, అటనటనుండి (యోగి) దానిని నియమములోనికిఁ దెచ్చి తనవశ మొనరించుకొననగును.

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్,
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్. ౨౭

ఎవనిమనస్సు బాగుగా శాంతించినదో, ఎవని వికారములు శమించినవో, ఇట్టి బ్రహ్మీభూతుఁడయిన నిష్పాపియగు యోగి అవశ్యము త్తమసుఖమును బడయుచున్నాఁడు.

యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే.　　౨౮

ఆత్మతోడ నిరంతర మనుసంధానముఁ జేయుచుఁ బాపరహితుఁడయిన యీయోగి సులభముగా బ్రహ్మప్రాప్తిరూపమగు ననంతసుఖము ననుభవించుచున్నాఁడు.

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.　　౨౯

సర్వత్ర సమభావమును గలిగియుండు యోగి తన్ను సకలభూతములందును మఱియు సమస్తభూతములఁ దనయందును జూచుచున్నాఁడు.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి,
తస్యాహం నప్రణశ్యామి సచ మే నప్రణశ్యతి.　　౩౦

ఎవఁడు నన్ను సర్వత్రి చూచుచున్నాఁడో మఱి యు నన్నింటిని నాయందుఁ గాంచుచున్నాఁడో, వాఁడు నాదృష్టినుండి యదృశ్యముగాఁడు మఱియు నేను వాని చూపునుండి యదర్శ్యముగాను.

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానో ఽపి స యోగీ మయి వర్తతే. ౩౧

నాయందు లీనుఁడయిన యేయోగి సకలభూతములం దుండు నన్ను భజించుచున్నాఁడో, వాఁ డెట్లు వర్తించుచున్నను గూడ నాయందే ప్రవర్తించుచున్నాఁడు.

వ్యాఖ్యానము : 'తాను' (స్వయం) యెంతవఱకుండునో అంతవఱకుఁ బరమాత్మపరముగా నుండును. (తాను) నశించిన పిదప - శూన్యమయిన పిమ్మటనే యొక్క పరమాత్ముని సర్వత్రి చూచుచున్నాఁడు. మఱియు 13 వ అధ్యా. 23 వ శ్లో. యొక్క వ్యాఖ్యానము చూడుఁడు.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః. ౩౨

ఓ యర్జునా! ఏ మనుష్యుఁడు తనవలె నెల్లరఁ జూచుచున్నాఁడో మఱియు సుఖమునయినను లేక దుఃఖమునయినను రెంటిని సమానముగఁ దలంచుచున్నాఁడో ఆయోగి శ్రేష్ఠుఁడుగ గణింపఁ బడుచున్నాఁడు.

అర్జున ఉవాచ:—

యోఽయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన,
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్. ౩౩

అర్జునుఁడు చెప్పెను: ఓ మధుసూదనా! నీవు చెప్పిన యీ (సమత్వరూపమగు) యోగముయొక్క స్థిరత్వమును నేను చంచలత్వముచేఁ జూడలేకున్నాఁడను.

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. ౩౪

ఎందుచే నన నో కృష్ణా! మనస్సు చంచలమే,

మనుష్యుని మథించి వేయుచున్నది మఱియు బలాఢ్య మయినది. ఎట్లు వాయువు నణఁచుట మిక్కిలి కష్టమో అట్లే మనస్సును వశపరచుకొనుట సయితము నేను కఠిన మని తలంచుచున్నాను.

శ్రీభగవా నువాచ:—

> అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్,
> అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే. ౩౫

శ్రీభగవానుఁడు చెప్పెను: ఓ మహాబాహూ! మనస్సు చంచలమగుటచే వశమొనరించు కొనుట కఠినము, ఇది సత్యము. కాని యో కౌంతేయా! అభ్యాసము మఱియు వైరాగ్యముచే దానిని వశమొనరించు కొనవచ్చును.

> అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
> వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. ౩౬

ఎవనిమనస్సు తనవశమున లేదో వానికి యోగ సాధన మిక్కిలి కఠినము; కాని యెవనిమనస్సు తన

వశమునం దున్నదో మఱియు నెవఁడు ప్రయత్న
శీలుఁడో వాఁ డుపాయద్వారమున సాధింపఁగలఁ డని
నా యభిప్రాయము.

అర్జున ఉవాచ:—

> అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః,
> అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి.　　౩౭

అర్జునుఁడు చెప్పెను : ఓ కృష్ణా! ఎవఁడు శ్రద్ధ
గలవాఁడయ్యు యత్నమున మందముగా నుండుటచే
యోగభ్రష్టుఁ డగుచున్నాఁడో వాఁడు సఫలతను బడ
యక యేగతిని బడయుచున్నాఁడు?

> కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి,
> అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి.　　౩౮

ఓ మహాబాహూ! యోగమునుండి భ్రష్టుఁడై
నను, బ్రహ్మమార్గమున దారితప్పి తిరుగునతఁడు ఛిన్న
భిన్నములయిన మేఘములవలె నుభయభ్రష్టుఁడయి నశిం
చిపోవఁడుగదా !

ఏత న్మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హ స్యశేషతః,
త్వదన్య స్సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. ౩౯

ఓ కృష్ణా! ఈ నాసంశయమును నీవు తొలఁగింప యోగ్యుఁడవు. నీవుతప్ప మఱి యెవఁడు నీసంశయమును దొలఁగించువాఁడు లభింపఁడు.

శ్రీభగవా నువాచ:—

పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే,
నహి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి. ౪౦

శ్రీభగవానుఁడు చెప్పెను: ఓ పార్థా! ఇట్టిపురుషుల నాశన మీలోకమందుఁగాని పరలోకమందుఁగాని కాదు. ఓనాయనా! కల్యాణమార్గమునఁ బోవువాని కెన్నఁడు దుర్గతి కలుగనే కలుగదు.

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. ౪౧

ఏ స్థానమును పుణ్యాత్ము లగువారు పడయు చున్నారో దానిని బొంది, అచట నధికసమయము

వఱకు నుండినపిదప యోగభ్రష్టుఁ డగు మనుష్యుఁడు పవిత్రులును మఱియు సాధనసంపన్నులును నగువారి గృహమున జన్మించుచున్నాఁడు.

అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. ౪౨

లేదా జ్ఞానవంతుఁ డగు యోగికులమందే జన్మ మెత్తుచున్నాఁడు. జగమునం దిట్టిజన్మ యవశ్యము బహు దుర్లభము.

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన. ౪౩

ఓ కురునందనా! అచట వానికిఁ బూర్వజన్మ యొక్క బుద్ధిసంస్కారములు లభించుచున్నవి. మఱియు నచటినుండి వాఁడు మోక్షముకొఱకు ముందునకు సాగుచున్నాఁడు.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశో ఽపి సః,
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతి వర్తతే. ౪౪

ఆపూర్వాభ్యాసమువలననే వాఁడవశ్యము యోగముపైపునకాకర్షింపఁబడుచున్నాఁడు. యోగజిజ్ఞాసువసయితను సకామవైదికకర్మచేయువానిస్థితి నతిక్రమించి పోవుచున్నాఁడు.

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్. ౪౫

మఱియుఁ బ్రేమపూర్వకముగఁ బ్రియత్నము చేయుచు యోగి పాపమునుండి విడివడి అనేకజన్మలచే విశుద్ధుఁ డగుచుఁ బరమగతిని బడయుచున్నాఁడు.

తపస్విభ్యో ఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భ వార్జున. ౪౬

తపస్వికంటె యోగి యధికుఁడు; జ్ఞానికంటెను గూడ నతఁ డధికుఁడుగఁ దలంపఁబడుచున్నాఁడు, అట్లనే కర్మకాండచేయువానికంటెనుగూడ వాఁ డధికుఁడు, కాఁబట్టి యో యర్జునా! నీవు యోగి వగుము.

వ్యాఖ్యానము : ఇచటం దపస్వియొక్క తపస్సు ఫలేచ్ఛాయుక్తము. జ్ఞాని యనఁగా ననుభవజ్ఞాని కాదు.

యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః. ౪౭

ఎవఁడు నాయందు మనస్సుచు నుంచి నన్ను శ్రద్ధాపూర్వకముగ భజించుచున్నాఁడో వానిని నేను సమస్త యోగులందు సయితము సర్వశ్రేష్ఠుఁడగు యోగిగా భావించుచున్నాను.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మసంయమ
యోగో నామ షష్ఠోఽధ్యాయః.

---

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతారూపములగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గతయోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జునసంవాదముయొక్క ధ్యానయోగ మను పేరుగల యాఱవయధ్యాయము ముగిసినది.

---

౭

## జ్ఞానవిజ్ఞానయోగము.

ఈయధ్యాయమునం దీశ్వరతత్త్వము మఱియు నీశ్వరభక్తియు నన నేమియో తెలియఁజెప్పుట ప్రారంభింపఁ బడినది.

శ్రీభగవానువాచ:—

మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. ౧

శ్రీభగవానుఁడు చెప్పెను: ఓ పార్థా! నాయందు మనస్సు సంలగ్నమొనర్చి మఱియు నన్నాశ్రయించి యోగమును సాధనఁజేయుచు నీవు నిశ్చయపూర్వకముగను మఱియు సంపూర్ణరూపముగను న

న్నెట్లు గురుతింపఁ గలుగుదువో అది వినుము.

జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః,
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే. ౨

అనుభవయుక్తమగు నీ జ్ఞానమును నేను నీకుఁ బూర్ణరూపమునఁ జెప్పెదను. దీని నెఱింగిన పిదప నీ లోకమున నధికముగాఁ దెలియఁదగిన దేదియు నుండదు.

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః. ౩

వేలకొలఁది మనుష్యులలో నెవఁడో యొకఁడే సిద్ధినిమిత్తము ప్రయత్నము చేయుచున్నాఁడు. ప్రయత్నముచేయు సిద్ధులలో నుండియుఁగూడ నొకానొకండే నన్ను యథార్థరూపమున గురుతించుచున్నాఁడు.

భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ,
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా. ౪

పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి మఱియు నహంభావము- ఈరీతిగ నా ప్రకృతి యెనిమిది విధములు.

## ౭

## జ్ఞానవిజ్ఞానయోగము.

ఈయధ్యాయమునం దీశ్వరతత్త్వము మఱియు నీశ్వరభక్తియు నన నేమియో తెలియఁజెప్పుట ప్రారంభింపఁ బడినది.

శ్రీభగవానువాచ:—

> మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః,
> అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు. ౧

శ్రీభగవానుఁడు చెప్పెను: ఓ పార్థా! నా యందు మనస్సు సంలగ్నమొనర్చి మఱియు నన్నాశ్రయించి యోగమును సాధనఁజేయుచు నీవు నిశ్చయపూర్వకముగను మఱియు సంపూర్ణరూపముగను న

న్నెట్లు గురుతింపఁ గలుగుదువో అది వినుము.

జ్ఞానం తే ఽహం స విజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః,
యజ్జ్ఞాత్వా నేహ భూయో ఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే. ౨

అనుభవయుక్తమగు నీ జ్ఞానమును నేను నీకుఁ బూర్ణరూపమునఁ జెప్పెదను. దీని నెఱింగిన పిదప నీ లోకమున నధికముగాఁ దెలియఁదగిన దేదియు నుండదు.

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః. 3

వేలకొలఁది మనుష్యులలో నెవఁడో యొకఁడే సిద్ధినిమిత్తము ప్రయత్నము చేయుచున్నాఁడు. ప్రయత్నముచేయు సిద్ధులలో నుండియుఁగూడ నొకానొకండే నన్ను యథార్థరూపమున గురుతించుచున్నాఁడు.

భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ,
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా. ౪

పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి మఱియు నహంభావము- ఈరీతిగ నా ప్రకృతి యెనిమిది విధములు.

వ్యాఖ్యానము : ఈ యెనిమిది తత్త్వములు గల స్వరూపమే క్షేత్రము లేక క్షరపురుషుఁడు. 13 వ అధ్యా. 5 శ్లో; మఱియు 15 వ అధ్యా. 16 వ శ్లో. చూడుఁడు.

అప రేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్,
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్. ౫

ఇది యపరాప్రకృతి. దీనికంటెను గూడ నున్నతమైన పరాప్రకృతి జీవరూపమున నున్నది. ఓ మహాబాహూ! ఈజగత్తు దాని యాధారముమీఁద నడచుచున్నది.

ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ,
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా. ౬

సకలభూతముల యుత్పత్తియొక్క కారణముగా నీ వీ రెంటి నెఱుంగుము. సమస్త జగదుత్పత్తికిని మఱియు లయమునకును గారణము నేను.

మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ,
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. ౭

ఓ ధనంజయా ! నాకంటె నుచ్చ మితరమేదియు లేదు. ఎట్లు సూత్రమున మణులు గుచ్చఁబడియుండునో అట్లీదియంతయు నాయందుఁ గూర్చఁబడియున్నది.

రసో౽హ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః,
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు.　　౮

ఓ కౌంతేయా ! జలమునందు రసమును నేను ; సూర్యచంద్రులందుఁ దేజమును నేను ; సకలవేదముల నోంకారమును నేను ; ఆకాశమున శబ్దమును నేను ; మఱియుఁ బురుషుల పరాక్రమమును నేను.

పుణ్యో గంధః పృథివ్యాంచ తేజ శ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు.　　౯

పృథ్వియందు సుగంధమును నేను, అగ్నియందు తేజమును నేను, సకలప్రాణులజీవనమును నేను, తపస్వియొక్క తపస్సును నేను.

బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్,
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్.　　౧౦

ఓ పార్థా! సమస్తజీవులయొక్క సనాతనబీజము గా నన్నుఁ దెలియుము. బుద్ధిమంతుని బుద్ధిని నేను, తేజస్వియొక్క తేజస్సును నేను.

బలం బలవతా మస్మి కామరాగవివర్జితమ్,
ధర్మావిరుద్ధో భూతేషు కామో ఽస్మి భరతర్షభ. ౧౧

బలవంతుని కామరాగరహితమగు బలమును నేను. మఱియు నో భరతర్షభా! ప్రాణులందు ధర్మ ముతో విరోధములేని కామమును నేను.

యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసా శ్చ యే,
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి. ౧౨

సాత్త్విక, రాజస, తామసభావములను నా వలనఁ బుట్టినవానిగా నెఱుంగుము. కాని నేను వాని యందు లేను, అవి నాయం దున్నవి.

వ్యాఖ్యానము : ఈ భావములపైనఁ బరమాత్మ డాధారపడియుండలేదు. కాని యీ భావములు వానిపై నాధారపడియున్నవి. వాని యాధారముపైన నుండు

చున్నవి మఱియు వాని వశమందున్నవి.

త్రిభిర్గుణమయైర్భావై రేభి స్సర్వ మిదం జగత్,
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్. ౧౩

ఈ త్రిగుణాత్మకము లగు భావములచే సమస్త ప్రపంచము మోహిత మగుచున్నది. మఱియు నిందుచే వానికంటె నుచ్చమును, భిన్నమును నగు నన్ను - అవి నాశిని - అది గురుతించుట లేదు.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే. ౧౪

ఈనా మూఁడుగుణములుగల దైవీమాయను దరించుట కష్టము, కాని యెవరు నన్నే శరణుఁ జొత్తురో వారీ మాయను దరించుచున్నారు.

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః,
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః. ౧౫

దురాచారులు, మూఢులు, అధమమనుష్యులు నాశరణుఁ జెందరు. వా రాసురభావము గలవారయి

యుందురు. మఱియు మాయ వారిజ్ఞానమును హరించి యుండుచున్నది.

చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినో ఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬

ఓ యర్జునా! దుఃఖితులు, జిజ్ఞాసులు, ఏదేని పడయఁగోరువారు మఱియు జ్ఞానులు అను నాలుగు తెగల సదాచారులగు మనుష్యులు నన్ను భజించుచున్నారు.

తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియో హి జ్ఞానినో ఽత్యర్థ మహం స చ మమ ప్రియః. ౧౭

వారిలో నేనిత్యసమభావి యొకని నే భజించువాఁడయి యున్నాఁడో ఆజ్ఞాని శ్రేష్ఠుఁడు. నేను జ్ఞానికత్యంత ప్రియుఁడను. మఱియు జ్ఞాని నాకుఁ బ్రియుఁడు.

ఉదారా స్సర్వ ఏ వైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థిత స్సహి యుక్తాత్మా మా మేవానుత్తమాం గతిమ్. ౧౮

ఈ భక్తు లందఱు మంచివారే, కాని జ్ఞాని నాయా

త్మయే యని నామతము. కావున మేమన, నన్నుఁ బొందు టతప్ప మఱియొక యధికోత్తమగతి లేనేలేదని గ్రహించుచు నా యోగి నా యాశ్రయమునే కైకొనుచున్నాఁడు.

బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః. ౧౯

అనేకజన్మలకుఁ గడపట జ్ఞాని నన్నుఁ బొందుచున్నాఁడు. సమస్తము వాసుదేవమయమని తెలియు మహాత్ముఁడు కడు దుర్లభుఁడు.

కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యంతే ఽన్యదేవతాః,
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా. ౨౦

అనేకములగు కామనలచే నెవ్వారిజ్ఞానము హరింపఁబడినదో వారు తమ ప్రకృతి ననుసరించి భిన్నభిన్న విధుల నాశ్రయించి యితరదేవతల శరణుఁజొచ్చుచున్నారు.

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధ యార్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తా మేవ విదధా మ్యహమ్. ౨౧

ఏ యేమనుష్యుఁడే యే స్వరూపమును శ్రద్ధా పూర్వకముగ నారాధింపఁ గోరుచున్నాఁడో, ఆయా స్వరూపమందు వాని శ్రద్ధను నేను దృఢపఱచుచున్నాను.

స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే,
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్. ౨౨

శ్రద్ధాపూర్వకముగ నాయాస్వరూపము నతఁ డారాధించుచున్నాఁడు మఱియుఁ దద్ద్వారమున నాచే నిర్మింపఁబడినట్టియు మఱియు నిజవాంఛితకామనలఁ బూర్తిచేసికొనుచున్నాఁడు.

అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసామ్,
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మా మపి. ౨౩

ఆ యల్పబుద్ధుల కేఫలము లభించుచున్నదో అది నశించున దగుచున్నది. దేవతలను భజించువారు దేవతలను బడయుచున్నారు, నన్ను భజించువారు నన్నుఁ బొందుచున్నారు.

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః,
పరం భావ మజానంతో మమావ్యయ మనుత్తమమ్. ౨౪

నాయొక్క పరమమును, అవినాశియు మఱియు ననుపమమునునగు స్వరూపము నెఱుంగని బుద్ధిహీనులగు మనుష్యు లింద్రియాతీతుఁడనగు నన్నింద్రియగమ్యునిగాఁ దలంచుచున్నారు.

నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః,
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్. ౨౫

నా యోగమాయచేఁ గప్పఁబడియున్న నే నెల్లరికి బ్రకటముగాను. ఈమూఢప్రపంచము పుట్టువులేనట్టియు మఱియు నవ్యయుఁడనయిన నన్ను బాగుగా గుర్తింపలేదు.

వ్యాఖ్యానము : ఈదృశ్యజగత్తును సృష్టించు సామర్థ్య ముండియుఁగూడ నలిప్తుఁడయి యుండుటచేఁ బరమాత్ముఁ డదృశ్యుఁడయి యుండుట కేభావము కలదో అది వాని యోగమాయ.

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున,
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన. ౨౬

ఓ యర్జునా! గతించినట్టియు, ఇపుడున్నట్టియు మఱియుఁ గలుగఁబోవునట్టియు సకలభూతములను గూడ నే నెఱుంగుదును. కాని నన్నెవఁ డెఱుంగఁడు.

ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత,
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప. ౨౭

ఓ భారతా! ఓ పరంతపా! ఇచ్ఛ, ద్వేషముల నుండి యుత్పన్నములగు సుఖదుఃఖాది ద్వంద్వముల మోహముచే సకలప్రాణు లీజగమున మోహాగ్రస్తము లగుచు నుండుచున్నవి.

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్,
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః. ౨౮

కాని యే సదాచారుల పాపము లంతమొందినవో మఱియు నెవరు ద్వంద్వముల మోహమునుండి ముక్తు లయిపోయిరో ఆ నిశ్చలవ్రతసంపన్నులు నన్ను భజించుచున్నారు.

జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే,
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మచాఖిలమ్. ౨౯

ఎవరు నా యాశ్రయమును గైకొని జరామరణ ములనుండి ముక్తులగుటకుఁ బ్రయత్నించుచున్నారో వారు పూర్ణబ్రహ్మను, అధ్యాత్మమును మఱియు నఖిల కర్మను దెలియుచున్నారు.

సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః,
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః. ౩౦

అధిభూతము, అధిదైవము మఱియు నధియజ్ఞ ములతోఁ గూడియున్న నన్నెవరు నెఱుఁగుదురో, జ్ఞానత్వమునకుఁ బ్రాపించినవారు నన్ను మరణకాలమందు నయితము గురుతించుచున్నారు.

వ్యాఖ్యానము: అధిభూతాదుల యర్థ మెనిమి దవ యధ్యాయమున వచ్చుచున్నది. ఈ శ్లోకమునకుఁ దాత్పర్య మేమనఁగా నీ జగమున నీశ్వరుఁడు దక్క మఱెద్దియు లేదు. మఱియు సమస్త కర్మలకుఁ గర్తయు భోక్తయు నతఁడె. ఎవఁడిట్లు తెలిసి మృత్యుసమయ మున శాంతుఁడుగ నుండి యీశ్వరునియందే తన్మ

యుండుగ నుండునో మఱియు నెట్టివాసనయు నా సమ యమున నెవనికిఁ గలుగదో వాఁ డీశ్వరుని గుఱితించి నాఁడు. మఱియు నతఁడు మోక్షమును బొందినాఁడు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానవిజ్ఞాన
యోగో నామ సప్తమోఽధ్యాయః.

---

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతా రూపమగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదముయొక్క జ్ఞానవిజ్ఞాన యోగ మను పేరుగల నేడవయధ్యాయము ముగిసినది.

---

## ౮

## అక్షరబ్రహ్మయోగము.

ఈయధ్యాయమునం దీశ్వరతత్త్వము విశేషముగ బోధింపఁబడినది.

అర్జున ఉవాచ:—

> కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ,
> అధిభూతంచ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే. ౧

అర్జునుఁడు చెప్పెను : ఓపురుషోత్తమా! ఈ బ్రహ్మస్వరూప మెట్టిది? అధ్యాత్మ మననేమి? కర్మ యననేమి? అధిభూతమని దేనినందురు? అధిదైవమని చెప్పఁబడున దెద్ది?

అధియజ్ఞః కథం కో౽త్ర దేహే౽స్మిన్మధుసూదన,
ప్రయాణకాలే చ కథం జ్ఞేయో౽సి నియతాత్మభిః. ౨

ఓ మధుసూదనా! ఈదేహమునం దధియజ్ఞ మేది మఱియు నెట్లుండును? మఱియు సంయమి నిన్ను మరణకాలమం దెట్లు గురుతింపఁగలుగుచున్నాఁడు?

శ్రీభగవానువాచ:—

అక్షరం బ్రహ్మ పరమం స్వభావో౽ధ్యాత్మ ముచ్యతే,
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః. 3

శ్రీ భగవానుఁడు సెప్పెను: ఏ సర్వోత్తముండగు నవినాశి కలఁడో వాఁడు బ్రహ్మము; సకలప్రాణులందుఁ దనసత్తచే నేదియుండునో యది యధ్యాత్మము. మఱియు సకలప్రాణుల నుత్పన్న మొనరించు సృష్టివ్యాపారము కర్మయని చెప్పఁబడుచున్నది.

అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్,
అధియజ్ఞో౽హమేవాత్ర దేహే దేహభృతాం వర. ౪

అధి భూతము నానశ్వరస్వరూపము. అధిదైవతము దానియందుండు నాజీవస్వరూపము. మఱియు

నో మనుష్యశ్రేష్ఠా! అధియజ్ఞ మిూ శరీరస్థితము, కాని యజ్ఞముచే శుద్ధమయిన జీవస్వరూపము.

వ్యాఖ్యానము: అనఁగా నవ్యక్తబ్రహ్మ మొదలుకొని నశ్వరదృశ్యపదార్థములవఱకుఁ బరమాత్మయే కలఁడు. మఱియు సమస్తము వానికృతియే. అట్టిచో మానవప్రాణి స్వయముగాఁ గర్తృత్వాభిమానమును గలిగియుండుటకు మాఱుగాఁ బరమాత్ముని దాసుఁడయి సమస్తమును వాని కేల సమర్పించరాదు.

అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్,
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. ౫

అంత్యకాలమున నన్నే స్మరించుచు నెవఁడు దేహత్యాగము చేయుచున్నాఁడో వాఁడు నా స్వరూపమును బొందుచున్నాఁడు. ఇందేమియు సందియము లేదు.

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేబరమ్,
తం త మేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః. ౬

లేదా యో కౌంతేయా! నిత్య మే యే స్వరూ

పమును మనుష్యుఁడు ధ్యానించుచుండునో, ఆ యా
స్వరూపము నంత్యకాలమందుఁగూడ స్మరించుచువాఁడు
దేహమును విడుచుచున్నాఁడు. మఱియునిందుచే వాఁ
డా స్వరూపమును బొందుచున్నాఁడు.

తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ,
మయ్యర్పితమనోబుద్ధి ర్మామే వైష్య స్యసంశయం. ౭

కాఁబట్టి సర్వదా నన్ను స్మరించుము. మఱియు
యుద్ధ మొనరించుచుండుము; ఈచందమున నాయందు
మనస్సును మఱియు బుద్ధిని నుంచుటచేఁ దప్పక నన్నుఁ
బడయుదువు.

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్. ౮

ఓ పార్థా! చిత్తము నభ్యాసముచే స్థిర మొనరించి
మఱియు నెచటికిఁ బారిపోనీయక యెవఁ డేకాగ్రుఁ
డగుచున్నాఁడో వాఁడు దివ్యపరమపురుషుని బడయు
చున్నాఁడు.

కవిం పురాణ మనుశాసితారం మణోరణీయాంస మనుస్మరేద్యః,
సర్వస్య ధాతార మచిన్త్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. ౯
ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యాయుక్తో యోగబలేన చైవ,
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్ స తం పరం పురుష
ముపైతి దివ్యమ్. ౧౦

ఏ మనుష్యుఁడు మరణకాలమం దచలమగు మనస్సుతో, భక్తిచే నాఢ్యుఁడయి మఱియు యోగబలముచే భ్రుకుటిమధ్యమున బాగుగాఁ బ్రాణమును నెలకొల్పి సర్వమును, పురాతనమును, నియంతయు, సూక్ష్మతమమును, సర్వపాలకమును, అచింత్యమును, సూర్యునివలెఁ దేజోవంతమును, అజ్ఞానరూపమగు నంధకారమునకుఁ బరముగ నున్నట్టియు స్వరూపమును నిశ్చయముగా స్మరించుచున్నాఁడో వాఁడు దివ్యుఁడగు పరమపురుషుని బడయుచున్నాఁడు.

యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే.

దేనిని వేదము నెఱుఁగువా రక్షరనామముచే

వర్ణనము చేయుచున్నారో, దేనియందు వీతరాగులగు మునులు ప్రవేశించుచున్నారో, మఱియు దేనిని బడయు నిచ్ఛచే జనులు బ్రహ్మచర్యపాలనముచేయుచున్నారో ఆపదమునుగూర్చిన సంక్షిప్తవర్ణనము నీకు దెలిపెదను.

> సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
> మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్. ౧౨
> ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్,
> యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్. ౧౩

ఇంద్రియముల సమస్తద్వారముల నిరోధించి, మనస్సును హృదయమునం దాపి, మస్తకమునం బ్రాణమును ధరించి, సమాధిస్థుండయి 'ఓమ్' అను నేకాక్షర బ్రహ్మ నుచ్చరించుచు మఱియు నన్నుఁ జింతించుచు నే మనుష్యుఁడు దేహమును ద్యజించుచున్నాఁడో వాఁడు పరమగతిని బడయుచున్నాఁడు.

> అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః,
> తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః. ౧౪

ఓ పార్థా! చిత్తమును మఱి యెచ్చో నుంచక యెవఁడు నిత్యమును మఱియు నిరంతరమును నన్నే స్మరించుచున్నాఁడో, ఆ నిత్యయుక్తుఁడగు యోగి నన్ను సహజముగాఁ బడయుచున్నాఁడు.

మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్,
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః. ౧౫

నన్నుఁ బడసినపిదపఁ బరమగతికిఁ బ్రాపించిన మహాత్ములు దుఃఖనిలయమగు నశాశ్వత పునర్జన్మను బొందరు.

ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున,
మా ముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ నవిద్యతే. ౧౬

ఓ కౌంతేయా! బ్రహ్మలోకము మొదలు కొని సమస్తలోకములును మరలమరల వచ్చునవయి యున్నవి. కాని నన్నుఁ బడసినపిమ్మట మనుష్యుఁడు మరల జన్మ మెత్తుట యుండదు.

సహస్రయుగపర్యంత మహ ర్య ద్బ్రహ్మణో విదుః,
రాత్రిం యుగసహస్రాం తాం తేఽహోరాత్రవిదో జనాః.

వేయి యుగములవఱ కున్నట్టి బ్రహ్మయొక్క యొకదినమును మఱియు వేయియుగముల వరకున్నట్టి బ్రహ్మయొక్క యొకరాత్రిని నెవరు దెలియుచున్నారో వా రహోరాత్రములఁ దెలియువారు.

వ్యాఖ్యానము: తాత్పర్యము, మన యిరువది నాలుగుగంటల రాత్రిందినములు కాలచక్రములోపల నొక క్షణముకంటెఁ గూడ సూక్ష్మములు. వానికెట్టి విలువలేదు. కాఁబట్టి యంతసమయమున లభించు భోగములు గగనపుష్పసమానములు అని యెఱింగి మనము వానియెడ నుదాసీనులమయి యుండవలయును. మఱియు నంతియే సమయము మనయొద్దనున్నది కాన దానిని భగవద్భక్తియందును, సేవయందును గడపి సార్థక మొనరించుకొనవలయును. మఱియు నేఁటికి నేఁడే ఆత్మదర్శనము కానియెడల ధైర్యము వహింపవలయును.

అవ్యక్తాద్వ్యక్తయ స్సర్వాః ప్రభవం త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే. ౧౮

(బ్రహ్మయొక్క) దిన మారంభ మయిన పిదప నన్నియు నవ్యక్తములోనుండి వ్యక్త మగుచున్నవి. మఱియు రాత్రి యయినపిమ్మట వానికిఁ బ్రళయము గలుగుచున్నది. అనఁగా నవ్యక్తమందు లయ మగుచున్నవి.

వ్యాఖ్యానము : ఇది యెఱింగియుఁగూడ మనుష్యుఁడు వానిచేతియందు మిక్కిలి స్వల్పమగు సత్తయున్నదని గ్రహింపవలయును. ఉత్పత్తి నాశనముల జంట తోఁ్త్తోఁడ నడచుచునే యుండును.

భూతగ్రామ స్స ఏవాయం భూత్వాభూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమే ఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే.　　౧౯

ఓ పార్థా! ఈ ప్రాణిసముదాయ మీ రీతిఁ బుట్టి పుట్టి రాత్రి యయినపిమ్మట వివశమయి లయము జెందుచున్నది. మఱియుఁ బగలు గలిగినపిదప నుత్పన్న మగుచున్నది.

పర స్తస్మాత్తు భావో ఽన్యో ఽవ్యక్తో ఽవ్యక్తా త్సనాతనః,
య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి.　　౨౦

ఈ యవ్యక్తమునకుఁ బరముగా మఱియొక సనాతనమగు నవ్యక్తభావము గలదు. సమస్తప్రాణులు నశించుచున్ననుగూడ నా సనాతనమగు నవ్యక్త భావము నశించుటలేదు.

అవ్యక్తో௦క్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్,
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ. ౨౧

ఏది యవ్యక్తమును, అక్షరము(అవినాశి)నని చెప్పఁబడుచున్నదో దానినే పరమగతియని చెప్పుచున్నారు. దేనిని బొందినపిదప జనులకుఁ బునర్జన్మ కలుగదో అది నా పరమధామము.

పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా,
యస్యాంతస్స్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్. ౨౨

ఓ పార్థా! ఈ యుత్తమ పురుషుఁనిదర్శన మనన్య భక్తిచేఁ బ్రాప్తించుచున్నది. వీనియందు సకలభూతములు వెలయుచున్నవి. మఱియు నిదియంతయు వానిచేతనే వ్యాప్తమయియున్నది.

యత్ర కాలే త్వనావృత్తిం ఆవృత్తిం చైవ యోగినః,
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ. ౨౩

ఏసమయమున మరణించి యోగులు మోక్షమును బడయుచున్నారో మఱియు నేసమయమున మృతిం బొందినవారికిఁ బునర్జన్మ ప్రాప్తించుచున్నదో ఆకాలమును నో భరతర్షభా! నేను నీకుఁ జెప్పెదను.

అగ్నిర్జ్యోతి రహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. ౨౪

ఉత్తరాయణముయొక్క యాఱుమాసము లందు, శుక్లపక్షమందు, దినమునందు నెప్పు డగ్నిజ్వాల లేచు చుండునో యప్పు డెవనికి మృత్యువు కలుగు చున్నదో ఆబ్రహ్మ నెఱుంగువాఁడు బ్రహ్మను బొందుచున్నాఁడు.

ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్,
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే. ౨౫

దక్షిణాయనముయొక్క యాఱుమాసములందు కృష్ణపక్షమందు, రాత్రియందు, పొగ వ్యాపించియున్న

సమయమందు మరణించువాఁడు చంద్రలోకమును బొంది పునర్జన్మను బొందుచున్నాఁడు.

వ్యాఖ్యానము : మీఁది రెండు శ్లోకములు నాకుఁ బూర్తిగఁ దెలియుటలేదు. వాని శబ్దార్థము గీతబోధ తోడ సమన్వయించుటలేదు. ఆబోధ ననుసరించి చూచినచో నెవఁడు భక్తిసంపన్నుఁడో, ఎవఁడు సేవామార్గమును సేవించునో, ఎవనికి జ్ఞానము సిద్ధించినదో వాఁడెపుడు మరణించినప్పటికి మోక్షమునే పొందుచున్నాఁడు. దానికీ శ్లోకముల శబ్దార్థము విరుద్ధముగానున్నది. దాని భావార్థము తప్పక యిది కావచ్చును :—ఎవఁడు యజ్ఞము చేయుచున్నాఁడో యనఁగాఁ బరోపకారమునందే యెవఁడు జీవితమును గడపుచున్నాఁడో, ఎవనికి జ్ఞానము లభించియున్నదో, ఎవఁడు బ్రహ్మవిదుఁడో యనఁగా జ్ఞానియో మృత్యుసమయమందు సయితము వాని కిట్టి స్థితి యున్నచో వాఁడు మోక్షమును బొందుచున్నాఁడు. దీనికిఁ బ్రతికూలముగా నెవఁడు యజ్ఞము

చేయఁడో, ఎవనికి జ్ఞానములేదో, ఎవఁడు భక్తి నెఱుంగఁడో వాఁడు చంద్రలోకము ననఁగా క్షణికలోకమును బడసి మరల భవచక్రములోనికిఁ దిరిగి వచ్చుచున్నాఁడు. చంద్రునకు సొంతమగు జ్యోతి లేదు.

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తి మన్యయా వర్తతే పునః. ౨౬

జగమున జ్ఞానము మఱియు నజ్ఞానముయొక్క యీ రెండును బరంపరాగతములగు మార్గములుగ భావింపఁ బడియున్నవి. ఒకదానిచే ననఁగా జ్ఞానమార్గముచే మనుష్యుఁడు మోక్షమును బొందుచున్నాఁడు. మఱియు రెండవదానిచే ననఁగా నజ్ఞానమార్గముచే వానికిఁ బునర్జన్మ ప్రాప్తించుచున్నది.

నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున. ౨౭

ఓ పార్థా! ఈ రెండుమార్గముల నెఱుంగు నే యోగియుఁగూడ మోహమునఁ బడఁడు. కాఁబట్టి యో

యర్జునా! నీవు సర్వకాలములందు యోగయుక్తుఁడ వుగ నుండుము.

వ్యాఖ్యానము : రెండుమార్గములఁ దెలియువాఁడు మఱియు సమభావమును గలిగియుండువాఁడు అంధకారముయొక్క - అజ్ఞానముయొక్క - మార్గమును గైకొనఁడు, దీనికే మోహమునఁ బడకుండుటయని పేరు.

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు య త్పుణ్యఫలం ప్రదిష్టమ్,
అత్యేతి త త్సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్. ౨౮

ఈ వస్తువు నెఱింగిన పిదప వేదమునందు, యజ్ఞమునందు, తపస్సునందు మఱియు దానమునందు నేపుణ్యఫలము చెప్పఁబడినదో దానినంతను నతిక్రమించి యోగి యుత్తమంబగు నాదిస్థానమును బొందుచున్నాఁడు.

వ్యాఖ్యానము : అనఁగా నెవఁడు జ్ఞానము, భక్తి మఱియు సేవాకర్మలచే సమభావమును బడసియున్నా

డు వానికి కేవల సకలపుణ్యఫలమే లభించుటలేదు. మీఁదుమిక్కిలి వానికి బరమమోక్షపదము సయితము లభించుచున్నది.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అక్షరబ్రహ్మయోగో
నామ అష్టమో ఽధ్యాయః.

---

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతా రూపమగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జున సంవాదముయొక్క యక్షరబ్రహ్మ యోగ మను పేరుగల యెనిమిదవ యధ్యాయము ముగిసినది.

---

## ౯

## రాజవిద్యా రాజగుహ్య యోగము.

ఇందు భక్తిమహిమను గీర్తించియున్నాఁడు.

శ్రీభగవానువాచ :—

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్. ౧

శ్రీ భగవానుఁడు చెప్పెను : నీవు ద్వేషరహితుఁడ వగుటచే నీకు నేను గుహ్యములలో గుహ్యమగు ననుభవయుక్తజ్ఞానము నొసంగెదను, దానిని దెలిసి నీ వకల్యాణమునుండి ముక్తుఁడవగుదువు.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్. ౨

విద్యలలో నిదిరాజు; గూఢ వస్తువులలో సర్వో
త్తమురాజు. ఈవిద్య పవిత్రమయినది, ఉత్తమమయినది,
ప్రత్యక్షానుభవమునకు రాఁదగినది, ధార్మికమయినది,
ఆచరించుటలో సుకరమయినది మఱియు నవినాశి.

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని. 3

ఓ పరంతపా! ఈ ధర్మమం దెవరికి శ్రద్ధలేదో
యట్టివారు నన్నుఁబొందక మృత్యుమయ సంసార
మార్గమందు మాటిమాటికిఁ దిరుగుచున్నారు.

మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా,
మత్ స్థాని సర్వభూతాని నచాహం తే ష్వవస్థితః. ౪

నా యవ్యక్త స్వరూపముచే నీ యఖిలజగత్తు నిం
డియున్నది. నాయందు— నాయాధారముమీఁద — సకల
ప్రాణులున్నవి; నేను వాని యాధారముపైన లేను.

నచ మత్ స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్,
భూతభృ న్నచ భూతస్థో మమాత్మా భూతభావనః. ౫

అయినప్పటికిని ప్రాణులు నాయందు లేవని కూడఁ జెప్పవచ్చును. ఈ నా యోగబలమును నీవు చూడుము. నేను జీవులపాలనము చేయువాఁడను, అయినప్పటికి నేను వానియందు లేను. కాని నేను వాని యుత్పత్తి కారణమును.

వ్యాఖ్యానము : నాయందు సకలజీవులున్నవి మఱియు లేకున్నవి. వానియందు నేనున్నాను మఱియు లేకున్నాను. ఇది యీశ్వరుని యోగబలము, వాని మాయ, వాని చమత్కారము. ఈశ్వరుని వర్ణనము భగవానునికి సయితము మనుష్యభాషయందే చేయవలసి యున్నది. ఇందుచే ననేక విధములగు భాషాప్రయోగము లొనరించి వానిని సంతోషింపఁ జేయుచున్నాఁడు. సృష్టి మీశ్వరమయము. కాఁబట్టి సర్వము వానియందున్నది. వాఁడలిప్తుఁడు. ప్రాకృత కర్తగాఁడు. కాఁబట్టి వానియందు జీవులు లేవని చెప్పవచ్చును. కాని యెవరు వానికి భక్తులో వారియందు వాఁడుండనే యున్నాఁడు.

ఎవఁడు నాస్తికుఁడయి యున్నాఁడో వానియందు వాని దృష్టిచేతనయితే వాఁడు లేఁడు. మఱియు దీనిని వాని చమత్కారమని చెప్పక మఱియేమని చెప్పనగును?

యథాఽఽకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్,
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ. ౬

ఎట్లన్నిచోట్ల వీచుచు మహావాయువు నిత్య మాకాశమందుండునో, అట్లు సకలప్రాణులు నాయందున్నవని తెలియుము.

సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్,
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్. ౭

ఓ కౌంతేయా! సకలప్రాణులు కల్పాంతమున నా ప్రకృతియందు లయమగుచున్నవి, మఱియుఁ గల్పారంభమయిన పిదప నేను వానిని మరల సృజించుచున్నాను.

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః,
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్. ౮

దీనికిఁ బ్రతికూలముగా, ఓపార్థా! మహాత్ములు దైవీప్రకృతి నాశ్రయించి సకలప్రాణుల కాది కారణ మగు నవినాశిగ నన్నుఁ దెలిసి తదేకనిష్ఠతో భజించు చున్నారు.

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః,
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. ౧౪

దృఢనిశ్చయము గలవారు, ప్రయత్నముచేయు వారు నిరంతరము నన్నుఁ గీర్తించుచున్నారు, నాకు భక్తితో నమస్కారము చేయుచున్నారు, మఱియు నిత్యము ధ్యానము చేయుచు నన్నుపాసించుచున్నారు.

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్. ౧౫

మఱి యితరులు అద్వైతరూపమునను లేదా ద్వైతరూపమునను లేదా బహురూపములందును సర్వత్ర వెలయు నన్ను జ్ఞానముచేఁ బూజించుచున్నారు.

అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాహ మహ మౌషధమ్,
మంత్రోహ మహమే వాజ్య మహ మగ్ని రహం హుతమ్. ౧౬

యజ్ఞముయొక్క సంకల్పమును నేను, యజ్ఞమును నేను, యజ్ఞముద్వారమునఁ బితరుల యాధారమును నేను, యజ్ఞముయొక్క వనస్పతిని నేను, మంత్రమును నేను, ఆహుతిని నేను, అగ్నిని నేను మఱియు హవన ద్రవ్యమును నేను.

పితాహ మస్య జగతో మాతా ధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజురేవ చ. ౧౭

ఈ జగత్తుయొక్క తండ్రిని నేను, తల్లిని నేను, ధారణకర్తను నేను, పితామహుఁడను నేను, తెలియఁదగిన వాఁడను నేను, పవిత్రమగు నోంకారమును నేను, ఋగ్వేదమును, సామవేదమును మఱియు యజుర్వేదమును గూడ నేనే.

గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్,
ప్రభవః ప్రళయ స్స్థానం నిధానం బీజ మవ్యయమ్. ౧౮

గతిని నేను, పోషకుఁడను నేను, ప్రభువును నేను, సాక్షిని నేను, నివాసమును నేను, ఆశ్రయమును నేను, హితైషిని నేను, ఉత్పత్తిని నేను, నాశనమును నేను, స్థితిని

నేను, భండారమును నేను, మఱియు నవ్యయబీజమును సయితము నేనే.

తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ,
అమృతం చైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున. ౧౯

ఎండ నే నిచ్చుచున్నాను, వర్షమును నేనే నిరోధించియుంచుచు మఱియు వర్షింప నిచ్చుచున్నాను. అమరత్వమును నేను, మృత్యువును నేను మఱియు నో యర్జునా! సత్తును మఱియు నసత్తును గూడ నేనే.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే,
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్. ౨౦

మూఁడు వేదములయొక్క కర్మలు చేయువారు, సోమరసమును ద్రావి పాపరహితులయిన వారు యజ్ఞముచే నన్నుఁ బూజించి స్వర్గము నర్థించుచున్నారు. వారు పవిత్ర దేవలోకమును బడసి స్వర్గమునందు దివ్య

భోగముల భోగించుచున్నారు.

వ్యాఖ్యానము : సమస్తవైదికక్రియలు ఫలప్రాప్తి నిమిత్తము చేయఁబడుచుండెను, మఱియు వానియందనేకక్రియలలో సోమపానము జరుగుచుండెను. దానిని గుఱించి యిచటవ్రాయఁబడినది. ఈ క్రియ లేమయియుండెనో, సోమరస మెట్టిదయియుండెనో నేఁడు సరిగా నెవఁడు నుడువఁజాలఁడు.

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే.　　౨౧

ఈ విశాలస్వర్గలోకమును భోగించి వారు పుణ్యక్షయ మయినపిదప మృత్యులోకమునకుఁ దిరిగి వచ్చుచున్నారు. ఈప్రకారముగ మూఁడువేదములయొక్క కర్మలుచేయువారు, ఫలేచ్ఛను గలిగియుండువారు జననమరణచక్రమునఁ దిరుగాడుచుందురు.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్. ౨౨

ఎవ రనన్యభావముతో నన్నుఁ జింతించుచు నన్నుభజించుచున్నారో, నిత్యము నాయందే రతులయి యుండు నవ్వారి యోగక్షేమముల భారమును నేను వహించు చున్నాను.

వ్యాఖ్యానము : ఈచందమున యోగిని గురుతించుటకు మూఁడు సుందరములగు చిహ్నములు కలవు — సమత్వము, కర్మయందుఁ గుశలత్వము, అనన్యభక్తి. ఈమూఁడు నొకదానియం దొకటి యోతప్రోతము కావలయును. భక్తి సమత్వము లేనిదే లభింపదు, సమత్వము భక్తి లేనిదే లభింపదు, మఱియుఁ గర్మకుశలత్వము లేకుండ భక్తి మఱియు సమత్వము ఆభాసమాత్రముగ నగునను భయముకలదు. యోగమనఁగా నప్రాప్తవస్తువును బడయుట మఱియు క్షేమమనఁగాఁ బడసిన వస్తువును సంబాళించు కొనుట,

యేఽ ప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః,
తేఽపి మా మేవ కౌంతేయ యజం త్యవిధిపూర్వకమ్.　౨౩

మఱియు నో కౌంతేయా! ఎవరు శ్రద్ధాపూర్వకముగ నితరదేవతల భజించుచున్నారో, వారుసయితము, విధిరహితులయినప్పటికిని గూడ నన్నే భజించుచున్నారు.

వ్యాఖ్యానము: విధి రహితమనఁగా నజ్ఞానముచేన న్నేకనిరంజననిరాకారునిగఁ దెలియక.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ,
నతు మా మభిజానంతి తత్త్వే నాత శ్చ్యవంతి తే.　౨౪

నేనే సర్వయజ్ఞములయొక్క భోక్తనగు స్వామిని. ఇట్లు నన్ను వారు నిజమగు స్వరూపమున గురుతించుటలేదు. అందుచే వారు పతితులగుచున్నారు.

యాంతి దేవవ్రతా దేవా న్పితౄ న్యాంతి పితృవ్రతాః,
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపిమామ్.

దేవతల పూజచేయువారు దేవలోకములఁ బడ

యుచున్నారు, పితరులఁ బూజించువారు పితృలోకమును బొందుచున్నారు, భూతప్రేతాదులఁ బూజించువారు ఆ యాలోకములఁ బొందుచున్నారు మఱియు నన్ను భజించువారు నన్నుఁ బడయుచున్నారు.

పత్త్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. ౨౬

పత్రము, పుష్పము, ఫలము లేదా జలమును నెవఁడు నాకు భక్తిపూర్వకముగ నర్పణముచేయుచున్నాఁడో, ఆప్రియత్నశీలుఁడగు మనుష్యునిచే భక్తిపూర్వకముగ నర్పితమొనరింపఁబడిన దానిని నేను సేవించుచున్నాను.

వ్యాఖ్యానము : అనఁగా నీశ్వరప్రీత్యర్థ మేది సేవాభావముతో నొసంగఁబడుచున్నదో, దాని నా ప్రాణియందుండు నంతర్యామి రూపమున భగవానుఁడే స్వీకరించుచున్నాఁడు.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్. ౨౭

కాఁబట్టి యో కౌంతేయా! నీ వేది చేసినను ఏది తిన్నను, ఏది హవనమందు హోమము చేసినను, ఏది దానముగ నిచ్చినను, ఏ తప మొనరించినను నది యంతయు నాకర్పించి మంచి చేయుము.

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి. ౨౮

ఇందుచే నీవు శుభాశుభఫలము నిచ్చు కర్మ బంధనమునుండి విముక్తుఁడ వగుదువు. మఱియు ఫల త్యాగరూపమగు సమత్వమును పొంది, జనన మరణ ములనుండి ముక్తుఁడవయి నన్నుఁ బొందుదువు.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చా ప్యహమ్. ౨౯

సకల ప్రాణులయందు నేను సమభావముతో నుండుచున్నాను. నా కెవఁడు నప్రియుఁడును లేదా ప్రియుఁడునుగాఁడు. ఎవరు నన్ను భక్తిపూర్వకముగ భజించుచున్నారో వారు నాయందున్నారు. మఱియు నేను సయితము వారియందున్నాను.

అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్,
సాధు రేవ స మన్తవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః. ౩౦

గొప్ప దురాచారి సయితము అనన్యభావముతో నన్ను భజించునట్లయిన వానిని సాధువయినట్లుగనే భావింపవలయును. కారణ మేమన నిపుడు వానికి మంచి సంకల్పమున్నది.

వ్యాఖ్యానము : కారణమేమనఁగా ననన్యభక్తి దురాచారమును శమింపఁజేయుచున్నది.

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాంతిం నిగచ్ఛతి,
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. ౩౧

వాఁడు తత్క్షణము ధర్మాత్ముఁ డగుచున్నాఁడు మఱియు నిరంతర శాంతిని బొందుచున్నాఁడు. ఓ కౌంతేయా! నాభక్తుఁ డెన్నఁడు నశింపఁడని నీవు నిశ్చయపూర్వకముగాఁ దెలియుము.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాంగతిమ్.

తరువాత నో పార్థా! పాపయోనులయినవారు సయితము, మఱియు స్త్రీలు, వైశ్యులు మఱియు శూద్రులలో నెవరు నన్నాశ్రయించుచున్నారో వారు పరమగతిని బడయుచున్నారు.

కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా,
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్. ౩౩

అట్టిచోఁ బుణ్యమతులగు బ్రాహ్మణులు మఱియు నాభక్తులగు రాజర్షుల విషయమయి చెప్పవలసిన దే మున్నది? కాఁబట్టి యీ యనిత్యమును మఱియు సుఖ రహితమును నగు లోకమున జన్మించి నీవు నన్ను భజించుము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మా మేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. ౩౪

నా యందు మనస్సు నుంచుము, నా భక్తుఁడవ గుము, నా నిమిత్తము యజ్ఞము చేయుము, నాకు నమ

స్మరించుము, ఇంకను నాయందుఁ బరాయణుఁడవయి ఆత్మను నాతోడఁ గలిపి నీవు నన్నే పడయుదువు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యా
రాజగుహ్యయోగో నామ నవమోఽధ్యాయః.

---

ఓం తత్ సత్.

ఈ రీతి శ్రీ మద్భగవద్గీతా రూపమగు నుపనిషత్తులనఁగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీ కృష్ణార్జున సంవాదముయొక్క రాజవిద్యారాజగుహ్యయోగమను పేరుగల తొమ్మిదవ యధ్యాయము ముగిసినది.

---

# ౧౦

## వి భూ తి యో గ ము.

ఏడవ, ఎనిమిదవ మఱియుఁ దొమ్మిదవ యధ్యాయములందు భక్తి మున్నగు వాని నిరూపణము చేసిన పిదప భగవానుఁడు భక్తుని నిమిత్తము తన యనంత విభూతుల యత్కించిద్దర్శనముఁ గావించుచున్నాఁడు.

శ్రీభగవా నువాచ:—

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః,
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. ౧

శ్రీభగవానుఁడు చెప్పెను: ఓ మహాబాహూ! తిరిగి నా పరమవచనము వినుము. ఇది నేను ప్రియజనుఁడవగు నీకు నీ హితము కొఱకుఁ జెప్పుదును.

న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః,
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. ౨

దేవతలు మఱియు మహర్షులు నా యుత్పత్తి నెఱుంగరు. కారణ మేమనఁగా నేనే దేవతలకు మఱియు మహర్షులకు సమస్తవిధముల నాదికారణముగనున్నాను.

యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్,
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. 3

మృత్యులోకమున నివసించుచు నే జ్ఞాని లోకముల మహేశ్వరుఁడ నగు నన్ను జన్మలేనివానిగను మఱియు ననాదిరూపమునఁ దెలియుచున్నాఁడో వాఁడు సకలపాపములనుండి ముక్తుఁ డగుచున్నాఁడు.

బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః,
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయ మేవచ. ౪
అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః,
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః. ౫

బుద్ధి, జ్ఞానము, అమూఢత్వము, క్షమ, సత్యము ఇంద్రియనిగ్రహము, శాంతి, సుఖము, దుఃఖము, జన్మ,

మృత్యువు, భయము మఱియు నభయము, అహింస, సమత్వము, సంతోషము, తపస్సు, దానము, యశస్సు, అపయశము ఈవిధమగు ప్రాణులయొక్క భిన్నములగు భావములు నావలనఁ బుట్టుచున్నవి.

మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా,
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః. ౬

సప్తర్షులు, వారికిం దొలుత సనకాదులు మఱియు (పదునలుగురు) మనువులు నా సంకల్పమునుండి పుట్టియున్నారు మఱియు వారిలోనుండి యీలోకములు పుట్టినవి

ఏతాం విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః,
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః. ౭

ఈ నా విభూతిని మఱియు శక్తిని నెవఁడు యథార్థముగఁ దెలియుచున్నాఁడో వాఁడచలమగు సమత్వమును బడయుచున్నాఁడు, ఇందు సంశయము లేదు.

అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే,
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః. ౮

నే నన్నింటి యుత్పత్తికిఁ గారణముననియు మఱి యు నన్నియు నావలననే ప్రవృత్తములగుచున్నవనియు నెఱింగి బుద్ధిమంతులు భావపూర్వకముగ నన్ను భజించుచున్నారు.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్,
కథయంత శ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ. ౯

నాయందుఁ జిత్తమును నిలుపువారు, నాకుఁ బ్రాణార్పణము చేయువారు నొకరి కొకరు బోధించుకొనుచు, నన్నే నిత్యము కీర్తించుచు, సంతోషము మఱియు నానందములను వెలయుచున్నారు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే. ౧౦

ఈ చందమున నాయందుఁ దన్మయులుగ నుండువారికి మఱియు నన్నుఁ బ్రేమతో భజించువారికి నేను జ్ఞానము నొసంగుచున్నాను. మఱియు నందుచే వారు నన్నుఁ బడయుచున్నారు.

తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః,
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. ౧౧

వారి ననుగ్రహించి వారి హృదయస్థితుఁడ నగు నేను జ్ఞానరూపమగు ప్రకాశమయదీపముచే వారి యజ్ఞానరూపమగు నంధకారమును రూపుమాపుచున్నాను.

అర్జున ఉవాచ:—

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్. ౧౨

ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా,
అసితో దేవలో వ్యాస స్స్వయంచైవ బ్రవీషి మే. ౧౩

అర్జునుఁడు చెప్పెను: ఓభగవానుఁడా! నీవు పరబ్రహ్మవు, పరంధాముఁడవు, పరమపవిత్రుఁడవు. సమస్తఋషులు, దేవర్షి నారదుఁడు, అసితుఁడు, దేవలుఁడు మఱియు వ్యాసుఁడు నిన్నవినాశిగను, దివ్యపురుషునిగను, ఆదిదేవునిగను, జన్మలేనివానిగను, ఈశ్వరరూపునిగను దలంచుచున్నారు మఱియు నీవు స్వయముగఁగూడ నట్లనే చెప్పుచున్నావు.

సర్వ మేత దృతం మన్యే య న్మాం వదసి కేశవ,
నహి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః. ౧౪

ఓ కేశవా! నీవు చెప్పుదానిని నేను సత్యమని నమ్ముచున్నాను. ఓభగవానుఁడా! నీస్వరూపమును దేవతలుగాని దానవులుగాని యెఱుంగరు.

స్వయ మే వాత్మ నాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ,
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే. ౧౫

ఓ పురుషోత్తమా! ఓ జీవులకుఁ దండ్రీ! ఓ జీవేశ్వరా! ఓ దేవదేవా! ఓ జగత్స్వామీ! నీవు స్వయముగా నీచే నిన్నుఁ దెలిసికొనుచున్నావు.

వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః,
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి. ౧౬

ఏ విభూతులచే నీలోకములందు నీవు వ్యాపించుచున్నావో, నీ యా దివ్యవిభూతులఁ బూర్ణముగ నాకు నీవు చెప్పవలయును.

కథం విద్యా మహం యోగిం స్త్వాం సదా పరిచింతయన్,
కేషు కేషు చ భావేషు చింత్యో ఽసి భగవ న్మయా. ౧౭

ఓ యోగీ! నిన్ను నిత్యము చింతించుచు నేను ని న్నెట్లు గుఱుతింపఁగలను? ఓ భగవానుఁడా! ఏ యే రూపమున నీ చింతనము సేయవలయును?

విస్తరే ణాత్మనో యోగం విభూతిం చ జనార్దన,
భూయః కథయ తృప్తి ర్హి శృణ్వతో నా స్తి మే ఽమృతమ్. ౧౮

ఓ జనార్దనా! నీశక్తిని మఱియు విభూతిని మరల నాకు విస్తారపూర్వకముగ వర్ణించి చెప్పుము. నీ యమృతతుల్యమగు వాణి నెంతగా విన్నను దృప్తియే కలుగుట లేదు.

శ్రీభగవా నువాచ:—

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః,
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నా స్త్యంతో వి స్తరస్య మే. ౧౯

శ్రీ భగవానుఁడు చెప్పెను: ఓ కురుశ్రేష్ఠుఁడా! మంచిది, నేను నాముఖ్యముఖ్యవిభూతుల నీకుఁ జెప్పెదను. వాని విస్తారమున కంతము లేనే లేదు.

అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః,
అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మంత ఏవచ. ౨౦

ఓ గుడాకేశుఁడా! నేను సకలప్రాణుల హృదయమం దుండు నాత్మను. నేనే భూతముల యాదియు, మధ్యయు మఱియు నంతమును.

ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్,
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ. ౨౧

ఆదిత్యులలో విష్ణువును నేను; జ్యోతులలోఁ దళతళలాడు సూర్యుఁడను నేను; వాయువులలో మరీచిని నేను; నక్షత్రములలోఁ జంద్రుఁడను నేను.

వేదానాం సామవేదో ఽస్మి దేవానా మస్మి వాసవః,
ఇన్ద్రియాణాం మన శ్చాస్మి భూతానా మస్మి చేతనా. ౨౨

వేదములలో సామవేదమును నేను, దేవతలలో నింద్రుఁడను నేను, ఇంద్రియములలో మనస్సును నేను, మఱియుఁ బ్రాణుల యొక్క చేతన నేను.

రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్,
వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్. ౨౩

రుద్రులలో శంకరుఁడను నేను. యక్షులు

మఱియు రాక్షసులలోఁ గుబేరుఁడను నేను. వసువు లలో నగ్నిని నేను. పర్వతములలో మేరువును నేను.

పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్,
సేనానీనా మహం స్కన్ద స్సరసా మస్మి సాగరః. ౨౪

ఓ పార్థా! పురోహితులలోఁ బ్రధాన బృహస్పతి నే నని తెలియుము. సేనాపతులలోఁ గుమారస్వామిని నేను, మఱియు సరోవరములలో సాగరమును నేను.

మహర్షీణాం భృగు రహం గిరా మ స్మ్యేక మక్షరమ్,
యజ్ఞానాం జపయజ్ఞో ఽస్మి స్థావరాణాం హిమాలయః. ౨౫

మహర్షులలో భృగువును నేను. వాక్కులలో నేకాక్షరమగు ఓమ్ ను నేను. యజ్ఞములలో జపయజ్ఞమును నేను. మఱియు స్థావరములలో హిమాలయమును నేను.

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాంచ నారదః,
గన్ధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః. ౨౬

సకలవృక్షములలో నశ్వత్థ (రావి) మును నేను,

దేవర్షులలో నారదుఁడను నేను, గంధర్వులలోఁ జిత్రరథుఁడను నేను, మఱియు సిద్ధులలోఁ గపిలమునిని నేను.

ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్,
ఐరావతం గజేంద్రాణాం నరాణాంచ నరాధిపమ్. ౨౭

అశ్వములలో నమృతమందుండి యుత్పన్నమైన యుచ్చైశ్శ్రవమును నేనని తెలియుము. ఏనుఁగులలో నైరావతమును మఱియు మనుష్యులలో రాజును నేను.

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్,
ప్రజన శ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః. ౨౮

ఆయుధములలో వజ్రమును నేను, గోవులలోఁ గామధేనువును నేను, ప్రజోత్పత్తికిఁ గారణుఁడగు కామదేవుఁడను నేను, సర్పములలో వాసుకిని నేను.

అనంత శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్,
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్. ౨౯

నాగములలో శేషనాగమును నేను, జలచరములలో వరుణుఁడను నేను, పితరులలో నర్యముఁడను నేను, మఱియు దండించువారిలో యముఁడను నేను.

ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్,
మృగాణాంచ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్.

దైత్యులలోఁ బ్రహ్లాదుఁడను నేను, గణించువారిలోఁ గాలమును నేను, పశువులలో సింహమును నేను, పక్షులలో గరుడుఁడను నేను.

పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్,
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ. ౩౧

పావన మొనరించువారిలోఁ బవనమును నేను, శస్త్రధారులలోఁ బరశురాముఁడను నేను, మత్స్యములలో మకరమును నేను, నదులలో గంగను నేను.

సర్గాణా మాది రంతశ్చ మధ్యం చైవాహ మర్జున,
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్. ౩౨

ఓ యర్జునా! సృష్టులయొక్క యాదియు, అంత్యమును మఱియు మధ్యమును నేను, విద్యలలో నధ్యాత్మవిద్యను నేను మఱియు వాదవివాదముచేయువారియొక్క వాదమును నేను.

అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్య చ,
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః. ౩౩

అక్షరములలో అకారమును నేను, సమాసములలో ద్వంద్వమును నేను, అవినాశియగు కాలమును నేను, మఱియు సర్వవ్యాపియగు ధారణకర్తను కూడ నేనే.

మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్,
కీర్తి శ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా. ౩౪

ఎల్లర హరించు మృత్యువును నేను, భవిష్యమున నుత్పన్నమగువారి యుత్పత్తికారణమును నేను, మఱియు నారీజాతియొక్క నామములలోఁ గీర్తియు, లక్ష్మియు, వాణియు, స్మృతియు, మేధయు (బుద్ధి,) ధృతియు (ధైర్యము) మఱియు క్షమయును నేను.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహమ్,
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః. ౩౫

సామములలో బృహత్ (గొప్ప) సామమును

నేను, ఛందస్సులలో గాయత్రీఛందస్సును నేను, మాసములలో మార్గశీర్షమును నేను, ఋతువులలో వసంతమును నేను.

ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతా మహమ్.

మోసగించువారి జూదమును నేను, పరితాపవంతుని ప్రభావమును నేను, జయమును నేను, నిశ్చయమును నేను, సాత్త్వికభావసంపన్నుని సత్త్వమును నేను.

వ్యాఖ్యానము : మోసగించువారి జూదమును నేను, ఈ వచనముచే భయపడనవసరము లేదు. ఇచట సారాసారనిర్ణయము లేదు, కాని జరుగున దంతయు నీశ్వరాజ్ఞలేకయే జరుగ నేరదను భావ మిచటఁ గలదు. (శివుని యాజ్ఞలేనిచే చీమయైనఁగుట్టదు.) మఱియు సర్వము వానియధీనమం దున్న దని తెలియు కపటిసయితము తనయభిమానమును వీడి కపటమును త్యజింపనగు.

వృష్ణీనాం వాసుదేవో ఽస్మి పాండవానాం ధనంజయః,
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః. ౩౭

వృష్ణికులములో వాసుదేవుఁడను నేను. పాండవు
లలో ధనంజయుఁడ (అర్జునుఁడు) నేను, మునులలో
వ్యాసుఁడను నేను, మఱియుఁ గవులలో శుక్రాచార్యుఁ
డను నేను.

దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్,
మౌనం చై వాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్. ౩౮

రాజ్యకర్తయొక్క దండమును నేను, జయముఁ
గోరువారి నీతిని నేను, గుహ్యవిషయముల మౌనమును
నేను, మఱియు జ్ఞానవంతుని జ్ఞానమును నేను.

యచ్చాపి సర్వభూతానాం బీజం త దహ మర్జున,
న త దస్తి వినా య త్స్యా న్మయా భూతం చరాచరమ్. ౩౯

ఓ యర్జునా! సమస్తప్రాణుల యుత్పత్తికారణ
మును నేను. నేను లేకయుండునట్టి స్థావర జంగమ
మేదియు లేదు.

నాంతో ఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. ౪౦

ఓ పరంతపా! నా దివ్యవిభూతుల కంతమే లేదు. విభూతుల విస్తారమును నేను కేవలదృష్టాంతరూపము ననే చెప్పినాను.

యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవవా,
తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజో ఽంశసంభవమ్. ౪౧

ఏ యేవస్తువు విభూతిమంతమును, లక్ష్మీయుతమును లేదా ప్రభావవంతమును నయి యున్నదో, అది నా తేజముయొక్క యంశమువలననే యయిన దని తెలియుము.

అథవా బహు నైతేన కిం జ్ఞాతేన త వార్జున,
విష్ట భ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. ౪౨

లేక యో యర్జునా! ఇది విస్తారపూర్వముగఁ దెలిసికొని నీవేమి చేయుదువు? నాయొక్క యొకయంశ మాత్రముచే నీ యఖిలజగత్తును ధరించి నేను వెలయుచున్నాను.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విభూతి
యోగో నామ దశమో ఽధ్యాయః.

---

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతారూపమగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జునసంవాదముయొక్క విభూతియోగ మను పేరు గల పదియవయధ్యాయము ముగిసినది.

---

## ౧౧

## విశ్వరూపసందర్శనయోగము.

ఈ యధ్యాయమున భగవానుఁడు తన విరాట్ స్వరూప మర్జునునకుఁ జూపించుచున్నాఁడు. భక్తులకీ యధ్యాయ మతిప్రియము. ఇందు యుక్తులు లేవు, కాని కేవల మిది కావ్యము. ఈ యధ్యాయమును బఠించుచు మనుష్యుఁడు విసుగుఁ జెందఁడు.

అర్జున ఉవాచ :—

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. ౧

అర్జునుఁడు చెప్పెను : నీవు నాపైఁ గృపఁజూపి

౦౧గా యాధ్యాత్మికపరమరహస్యమును జెప్పితివి. నీవు చెప్పిన వచనములచే నామోహము తొలఁగిపోయినది.

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్. ౨

ప్రాణుల యుత్పత్తి మఱియు నాశము విషయ మంతయు నేను నీవలన విస్తారపూర్వకముగ వింటిని. అది గాక నీ యవినాశియగు మాహాత్మ్యమునుగూడ నో కమలదళనేత్రా! వింటిని.

ఏవ మేత ద్యథాత్థ త్వ మాత్మానం పరమేశ్వర,
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ.

ఓ పరమేశ్వరా! నీ వెట్లు నిన్నుఁ గురుతింపఁ జేయుచున్నావో అట్లనే యున్నావు. ఓ పురుషోత్తమా! నీ యొక్క యీశ్వరసంబంధమగు రూపమును దర్శింప నాకుఁ గోరిక కలుగుచున్నది.

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో,
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్. ౪

ఓ ప్రభో! ఆ దర్శనము చేయుట నాకు సంభవమని నీవు తలంచుచున్నచో నో యోగేశ్వరా! ఆ యవ్యయరూపముయొక్క దర్శనము చేయింపుము.

శ్రీ భగవా నువాచ:—

> పశ్య మే పార్థ రూపాణి శతశో౽థ సహస్రశః,
> నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ.　　౫

శ్రీభగవానుఁడు చెప్పెను: ఓ పార్థా! నా వందలకొలఁది మఱియు వేలకొలఁదిరూపములఁ జూడుము. అవి నానాప్రకారములును, దివ్యములును భిన్న భిన్న వర్ణములును మఱియు నాకృతిగలవియు నయి యున్నవి.

> పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా
> బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత.　　౬

ఓ భారతా! ఆదిత్యులను, వసువులను, రుద్రులను, ఇరువు రశ్వినులను మఱియు మరుత్తులను జూడుము. పూర్వ మెన్నఁడు చూచియుండనట్టి యనేకములగు నాశ్చర్యములను నీవు చూడుము.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్,
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి. ౭

ఓ గుడాకేశుఁడా! ఇచట నా శరీరమం దేకరూపముననున్న సమస్త స్థావర జంగమ జగత్తును మఱియు నీవు దేనిని జూడఁ గోరుచున్నావో అది నేఁడు చూడుము.

నతు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్. ౮

ఈ నీచర్మచక్షువులతో నీవు నన్నుఁ జూడఁ జాలవు. నీకు నేను దివ్యచక్షువుల నొసంగుచున్నాను. నీవు నా యీశ్వరసంబంధమగు యోగమును జూడుము.

సంజయ ఉవాచః—

ఏవ ముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః,
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్. ౯

సంజయుఁడు చెప్పెను : ఓ రాజా! యోగేశ్వరుఁడగు కృష్ణుఁ డిట్లు చెప్పి పార్థునకుఁ దన పరమేశ్వర సంబంధమగు రూపమును జూపించెను.

అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్,
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్. ౧౦

అది యనేకముఖములు మఱియు నేత్రములు గల దియు, అనేకములగు నద్భుతదర్శనములు గలదియు, అనేక దివ్యభూషణములు గలదియు మఱియు ననేక ములగు నెత్తఁబడిన దివ్యశస్త్రములు గలదియు నయి యుండెను.

దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్,
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖమ్. ౧౧

అది యనేకదివ్యమాలలను మఱియు వస్త్రము లను ధరించియుండెను. దానికి దివ్యసుగంధిత లేపనములు పూయబడి యుండెను. ఇట్టిది సమస్తరీతుల నాశ్చర్య మయమును, అనంతమును, సర్వవ్యాపకమును నగు దైవ మయి యుండెను.

దివి సూర్యసహస్రస్య భవే ద్యుగప దుత్థితా,
యది భాః సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః. ౧౨

ఆకాశమున సహస్రసూర్యుల తేజ మొక్క సారిగఁ బ్రకాశించినఁ గలుగు తేజ మామహాత్ముని తేజమువలె నెప్పుడయిన నుండునేమొ!

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా,
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా. ౧౩

అచట నీ దేవాధిదేవుని శరీరమందుఁ బాండవుఁ డనేకరీతుల విభక్తమయిన సమస్తజగత్తు నేకరూపమునం దుండుటఁ గాంచెను.

తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత. ౧౪

పిదప నాశ్చర్యచకితుఁడును మఱియు రోమాంచితుఁడయిన ధనంజయుఁడు తలవంచి, చేతులుజోడించి యీ చందమున నుడివెను.

అర్జున ఉవాచ:—
పశ్యామి దేవాంస్తవ దేవదేహే సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్,
బ్రహ్మాణమీశం కమలాసనస్థం ఋషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్.

అర్జునుఁడు చెప్పెను : ఓ దేవా! నీ దేహమున

నేను దేవతలను, భిన్నభిన్నప్రకారములగు సకలప్రాణి సముదాయములను, కమలాసనముపై విరాజమానుఁడయిన యీశుఁడగు బ్రహ్మను, సమస్త ఋషులను మఱియు దివ్యసర్పములను జూచుచున్నాను.

అనేకబాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్,
నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూపం.౧౬

నిన్ను నే ననేకములగు చేతులు, ఉదరములు, ముఖములు మఱియు నేత్రములు గలవానిగను, అనంత రూపములు గలవానిగను జూచుచున్నాను. నీకంతము లేదు, మధ్యము లేదు, నీ కాది లేదు. ఓ విశ్వేశ్వరా! నీ విశ్వరూపమును నేను దర్శనము చేయుచున్నాను.

కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్,
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యంసమంతా ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్.

ముకుటధారివియు, గదాధారివియు, చక్రధారివియు, తేజఃపుంజమును, సర్వత్ర తళతళలాడు జ్యోతి గలవాఁడవును, తోడనే కష్టముచేఁ గనిపించువాఁడ

రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యగణములు, విశ్వేదేవతలు, అశ్వినీకుమారులు, మరుత్తులు, వేడివే త్రాగు పితరులు, గంధర్వులు, యక్షులు, అసురులు మఱియు సిద్ధసంఘము, వీరందఱును విస్మితులయి నిన్నుఁ జూచుచున్నారు.

రూపం మహ త్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదమ్,
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్. ౨౩

ఓ మహాబాహూ! అనేకములగు ముఖములు మఱియు నేత్రములు గలదియు, అనేకములగు చేతులు, జంఘలు మఱియుఁ గాళ్లుగలదియు, అనేకములగు నుదరములుగలదియు మఱియు ననేకములగు దంష్ట్రలచేత భయంకరముగఁ గాన నగు విశాలరూపమును గాంచి జనులు వ్యాకులు లయినారు. అట్లనే నేను సయితము వ్యాకులుఁడ నయియున్నాను.

నభఃస్పృశం దీప్తమనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్,
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో. ౨౪

ఆకాశమును దాకుచు, తళతళలాడుచు, అనేకవర్ణములగు రంగులు గలట్టియు, తెఱచుకొనియున్న ముఖములు గలట్టియు మఱియు విశాల తేజోవంతములగు నేత్రములు గలట్టియు నిన్నుఁ జూచి యో విష్ణువా! నాహృదయము వ్యాకులతఁజెందినది. మఱియు నేను ధైర్యమునుగాని శాంతినిగాని కలిగియుండఁ జాలకున్నాను.

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానలసన్నిభాని,
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస. ౨౫

ప్రళయకాలముయొక్క యగ్నివలె నున్నట్టియు మఱియు భయంకరములగు కోఱలుగలిగినట్టియు నీముఖమును గాంచుటచే నాకు దిక్కులు కనిపించుటలేదు, శాంతి లభించుటలేదు; ఓ దేవేశా! ఓ జగన్నివాసా! ప్రసన్నుఁడ వగుము.

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వే సహైవావనిపాలసంఘైః,
భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాసౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః.
వక్త్రాణి తే త్వరమాణా విశంతి దంష్ట్రాకరాలాని భయానకాని,
కేచిద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితైరుత్తమాంగైః. ౨౭

సమస్తరాజుల సంఘసమేతముగ ధృతరాష్ట్రుని యీ పుత్రులు, భీష్ముడు, ద్రోణాచార్యుడు, ఈ సూతపుత్రుడగు కర్ణుడు మఱియు మా ముఖ్యయోధులు భయంకరదంష్ట్రలుగల నీభయానకముఖమున వేగముతో ప్రవేశించుచున్నారు. ఎందఱివో తలలు చూర్ణములయి నీ దంతములనడుమ దగుల్కొని కానవగుచున్నవి.

యథా నదీనాం బహవోఽంబువేగాః సముద్రమేవాభిముఖా ద్రవంతి,
తథా తవామీ నరలోకవీరా విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి. ౨౮

ఏ చందమున నదులగొప్పప్రవాహము సముద్రమువైపునకు పర్వెత్తుచున్నదో, అట్లు నీ ప్రజ్వలించుచున్న ముఖమునం దీ లోకనాయకులు ప్రవేశించుచున్నారు.

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశంతి లోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః. ౨౯

ఎట్లు పతంగములు తమనాశనమునకై ముందున కరుగు వేగముతో మండుచున్న దీపమునం దురుకుచున్నవో, అట్లు నీ ముఖమందు సయితమెల్లరు ముందునకుం బోవు వేగముతోఁ బ్రవేశించుచున్నారు.

లేలిహ్యసే గ్రసమాన స్సమంతా ల్లోకా న్సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః,
తేజోభి రాపూర్య జగ త్సమగ్రం భాస స్తవోగ్రాః ప్రతపంతి విష్ణో.

ఎల్లరి నెల్లవైపులనుండి మ్రింగి నీవు నీ ప్రజ్వలించుచున్న ముఖముతో నాకుచున్నావు. ఓ సర్వవ్యాపి వగు విష్ణువా! నీయుగ్రప్రకాశము సమస్తజగత్తును తేజముచే నింపివేయుచున్నది. మఱియుఁ దపింపఁ జేయుచున్నది.

ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో నమోఽస్తు తే దేవవర ప్రసీద,
విజ్ఞాతు మిచ్ఛామి భవంతమాద్యం నహి ప్రజానామి తవప్రవృత్తిమ్. ౩౧

ఉగ్రరూపుఁడ వగు నీ వెవఁడవో నాకుఁ జెప్పుము. ఓ దేవప్రవరా! నీవు ప్రసన్నుఁడ వగుము. ఆదికారణుఁ

డవగు నిన్ను నేను తెలిసికొనఁగోరుచున్నాను. నీ ప్రవృత్తి నాకుఁ దెలియదు.

శ్రీభగవానువాచ:—

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః.

శ్రీ భగవానుఁడు చెప్పెను: నేను లోకముల నాశనము చేయువాఁడను, వృద్ధినొందిన కాలమును నయియున్నాను. లోకముల నాశనముచేయు నిమిత్త మిచటికి వచ్చియున్నాను. ప్రత్యేకసేనయందు వచ్చియున్న యీ యోధులందఱిలో నెవరును నీవు యుద్ధ మొనరింప నంగీకరింపకున్నను గూడ మిగులువారు గారు.

తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33

కాఁబట్టి నీవు లేచి నిలువఁబడుము, కీర్తిని బడయుము, శత్రువును జయించి ధనధాన్యములచే నిండియున్న రాజ్యమును భోగించుము. వీరిని నేను ముందు

గనే చంపియున్నాను. ఓ సవ్యసాచీ! నీవుమాత్రము
కేవల నిమిత్తరూపుఁడ వగుము.

ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ కర్ణంతథా ఽన్యానపియోధవీరాన్,
మయాహతాం స్త్వంజహిమావ్యథిష్ఠాయుధ్యస్వజేతాసిరణేసపత్నాన్.

ద్రోణుని, భీష్ముని, జయద్రథుని, కర్ణుని మఱి
యు నితర యోధులను నేను చంపివైచియే యున్నాను.
వారిని నీవు సంహరించుము; భయపడవలదు; పోరా
డుము; శత్రువును నీవు రణమందు జయింతువు.

సంజయ ఉవాచ:—

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాంజలి ర్వేపమానః కిరీటీ,
నమస్కృత్వా భూయఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య.

సంజయుఁడు చెప్పెను: కేశవుని యీ వచముల
విని చేతులు జోడించి, కంపించుచు, మాటిమాటికి నమ
స్కరించి, భయపడుచుఁ బ్రణామమొనరించి ముకుట
ధారియగు నర్జునుఁడు శ్రీకృష్ణునితో గద్గదకంఠమున
నీ చందమున నుడివెను.

అర్జున ఉవాచ

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగ త్ప్రహృష్య త్యనురజ్యతేచ,
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతిచ సిద్ధసంఘాః.

అర్జునుఁడు చెప్పెను : ఓ హృషీకేశా ! నిన్నుఁ గీర్తించుటచే జగత్తున కేహర్షము కలుగుచున్నదో మఱియు నీయందే యనురాగము కలుగుచున్నదో యది యోగ్యముగనే యున్నది. భయభీతులగు రాక్షసు లటు నిటుఁ బాఱిపోవుచున్నారు మఱియు సిద్ధుల సమస్త సముదాయము నీకు నమస్కరించుచున్నది.

కస్మాచ్చ తేన నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే,
అనంత దేవేశ జగన్నివాస త్వ మక్షరం సదస త్తత్పరం యత్. ౩౭

ఓ మహాత్మా! వారు నీ కెందులకు నమస్కరింపరాదు? నీవు బ్రహ్మకంటెను గొప్ప యాదికర్తవు. ఓ యనంతా, ఓ దేవేశా, ఓ జగన్నివాసా! నీ వక్షరుఁడవు, సత్తువు, అసత్తువు మఱియు దీనికంటె నేది పరముగా నున్నదో అదియుఁగూడ నీవే.

త్వ మాదిదేవః పురుషః పురాణ స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్,
వేత్తాసి వేద్యంచ పరంచ ధామ త్వయా తతం విశ్వ మనంతరూప.

నీ వాదిదేవుఁడవు. నీవు పురాణపురుషుఁడవు. నీ వీ విశ్వమునకుఁ బరమాశ్రయస్థానమవు. నీవు తెలియువాఁడవు మఱియుఁ దెలియఁదగినవాఁడవు. నీవు పరమధాముఁడవు. ఓ యనంతరూపా! ఈ జగత్తంతయు నీవు వ్యాప్తమగుచున్నావు.

వాయు ర్యమో ఽగ్ని ర్వరుణ శ్శశాంకః ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ,
నమోనమ స్తే ఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమోనమ స్తే. ౩౯

వాయువును, యముఁడవును, అగ్నియు, వరుణుఁడవును, చంద్రుఁడవును, ప్రజాపతియు, ప్రపితామహుఁడవును నీవే. నీకు వేలకొలఁది పర్యాయములు నమస్కరించుచున్నాను.

నమః పురస్తా దథ పృష్ఠత స్తే నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ,
అనంతవీర్యామితవిక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః.

ఓ సర్వాత్మకా! నీకు ముందునుండియు, వెనుక నుండియు, అన్నివైపులనుండియు నమస్కరించుచున్నా

నః. నీ వీర్య మనంతము, నీ శక్తి యపారము, సమస్తమును నీవే ధరించుచున్నావు. కాఁబట్టి నీవు సర్వాత్మకుఁడవు.

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ హే యాదవ హే సఖేతి,
అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదాత్ప్రణయేన వాపి.
యచ్చావహాసార్థ మసత్కృతోఽసి విహారశయ్యాసనభోజనేషు,
ఏకోఽథవా ప్యచ్యుత తత్సమక్షం తత్క్షామయే త్వా మహమప్రమేయమ్.

మిత్రుఁడ వనుకొని మఱియు నీ యీమహిమ తెలియక యోకృష్ణా! ఓయాదవా! ఓసఖుఁడా! అని సంబోధించి నాచేఁ బ్రమాదవశమున లేదా ప్రేమ యందుసయితమే యవివేకము తటస్థించినదో మఱియు వినోదార్థ మాడుచు, నిద్రించుచు, కూర్చుండుచు లేక తినుచు ననఁగా స్నేహమందు నీ కేవిధమగు నవమానము కలిగి యున్నను దానిని క్షమించుటకొఱకు నేను నిన్నుఁ బ్రార్థించుచున్నాను.

పితాసి లోకస్య చరాచరస్య త్వ మస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్,
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ.

స్థావరజంగమజగత్తునకు నీవు పితవు. నీవ దానికిఁ బూజ్యుఁడవును మఱియు శ్రేష్ఠగురుడవును. నీకు సమానుఁ డెవఁడును లేఁడు, అట్టిచో నీకంటె నధికుఁ డెక్కడనుండి వచ్చును? మూఁడులోకముల నీసామర్థ్యమునకు సాటిలేదు.

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్,
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్. ౪౪

కాఁబట్టి సాష్టాంగనమస్కార మొనరించి నిన్ను, పూజింపఁదగిన యీశ్వరుని బ్రసన్నుఁడవు కమ్మని ప్రార్థించుచున్నాను. ఓదేవా! ఏచందమునఁ దండ్రి పుత్రుని, సఖుఁడు సఖుని సహించుచున్నాఁడో, అట్లు నీవు నాకుఁ బ్రియుఁడ వగుటచే నా కల్యాణమునకయి నన్ను సహింప యోగ్యుఁడవు.

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే,
తదేవ మే దర్శయ దేవ రూపం ప్రసీద దేవేశ జగన్నివాస. ౪౫

ముందుఁ జూచియుండని నీ యిట్టిరూపమును గాంచి నాకుఁ గగురుపాటు కలిగినది. మఱియు భయ

సంజయుఁడు చెప్పెను : ఇట్లు వాసుదేవుఁ డర్జునునితోఁ జెప్పి తనరూపమును దిరిగి చూపించెను. మఱియు మరల శాంతమూర్తిని ధరించి భయభీతుఁడయిన యర్జును నా మహాత్ముఁ డూఱడించెను.

అర్జున ఉవాచ:—

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన,
ఇదానీ మస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః. ౫౧

అర్జునుఁడు చెప్పెను: ఓ జనార్దనా! ఈ నీసౌమ్యమానవస్వరూపమును జూచి యిపుడు నేను శాంతుఁడనయితిని మఱియు స్థిమితపడితిని.

శ్రీభగవా నువాచ:—

సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ,
దేవా అ ప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః. ౫౨

శ్రీ భగవానుఁడు చెప్పెను : నీవు చూచియున్న నారూపదర్శనము కడుదుర్లభము. దేవతలునయిత మా రూపమును జూచుటకయి తహతహపడుచుందురు.

సంజయ ఉవాచ:—

> నాహం వేదై ర్నతపసా నదానేన నచేజ్యయా,
> శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా. ౫౩

నీవు పొందిన నాదర్శనము వేదముచేఁ గాని, తపస్సుచేఁ గాని, దానముచేఁ గాని లేక యజ్ఞముచేఁ గాని కలుగఁజాలదు.

> భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధో ఽర్జున,
> జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప. ౫౪

కాని యోయర్జునా! ఓ పరంతపా! నావిషయమయి యిట్టి జ్ఞానము, ఇట్టి నాదర్శనము మఱియు నాయందు వాస్తవికమగు ప్రవేశము కేవల మనన్యభక్తి వలననే సంభవములు.

> మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః,
> నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాండవ. ౫౫

ఓ పాండవా! ఎవఁడు సమస్తకర్మల నాకు సమర్పించుచున్నాఁడో, నాయందుఁ బరాయణుఁడుగ నుండుచున్నాఁడో, నాభక్తుఁ డగుచున్నాఁడో, ఆసక్తిని ద్యజిం

చుచున్నాఁడో మఱియు సకలప్రాణులయందు ద్వేష రహితుఁడయి వెలయుచున్నాఁడో వాఁడు నన్నుఁ బొందు చున్నాఁడు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపదర్శన యోగో నామ ఏకాదశో ఽధ్యాయః.

---

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతారూపములగు నుపనిషత్తు లనఁగా బ్రహ్మవిద్యాంతర్గతయోగశాస్త్రమందలి శ్రీ కృష్ణార్జునసంవాదముయొక్క విశ్వరూపదర్శనయోగ మను పేరుగల పదునొకండవ యధ్యాయము ముగిసినది.

---

౧౨

## భక్తియోగము.

పురుషోత్తముని దర్శన మనన్యభక్తిచేతనే లభించుచున్న దను భగవానుని వచనమునకుఁ బిదప భక్తి స్వరూపమునే గురుతింపఁగలము. ఈ పండ్రెండవ యధ్యాయము నెల్లరు కంఠస్థము చేయవలయును. ఇది యొక మిక్కిలి చిన్నయధ్యాయము. ఇం దొసఁగఁబడిన భక్తలక్షణములు నిత్యమనన యోగ్యములు.

అర్జున ఉవాచ:—

ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే,
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. ౧

అర్జునుఁడు చెప్పెను: ఈ చందమున నేభక్తులు నిన్ను నిరంతరము ధ్యానించుచు నిన్నుపాసించుచున్నా రో మఱియు నెవరు నీయవినాశియగు నవ్యక్తస్వరూప మును ధ్యానించుచున్నారో వారిలో నేయోగి శ్రేష్ఠుఁ డుగ గణింపఁబడును?

శ్రీభగవానువాచ:—

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. ౨

శ్రీభగవానుఁడు చెప్పెను: నిత్యము ధ్యానిం చుచు నాయందు మనస్సు నారోపించి యెవఁడు శ్రద్ధా పూర్వకముగ నన్నుపాసించుచున్నాఁడో వానిని నేను శ్రేష్ఠయోగిగ గణించుచున్నాను.

యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగ మచింత్యంచ కూటస్థ మచలం ధ్రువమ్. 3
సన్నియ మ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః. ४

సకలేంద్రియముల వశపఱచుకొని, సర్వత్ర సమ

త్వమును బాలించి యెవరు దృఢమును, అచలమును, స్థిరమును, అచింత్యమును, సర్వవ్యాపకమును, అవ్యక్తమును, అవర్ణనీయమును, అవినాశియును నగుస్వరూపము నుపాసించుచున్నారో వారు సకలప్రాణుల హితమున మగ్నులైనయియున్న నన్నే పడయుదురు.

శ్లో॥ క్లేశో౽ధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్,
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. ౫

ఎవ్వారిచిత్త మవ్యక్తమున లగ్నమయినదో వారికిఁ గష్ట మధికము కలదు. అవ్యక్తగతిని దేహధారి కష్టమువలననే పొందఁ గలుగుచున్నాఁడు.

వ్యాఖ్యానము : దేహధారియగు మనుష్యుఁ డమూర్తస్వరూపమును గేవల మూహించుటకే సమర్థుఁడగుచున్నాఁడు, కాని వానియొద్ద నమూర్తస్వరూపమునకయి యొక్కటికూడ నిశ్చయాత్మకశబ్దము లేదు, అందుచే వాఁడు నిషేధాత్మకమగు 'నేతి' శబ్దముతో సంతుష్టుఁడు కావలసివచ్చెను. ఇందువలననే మూర్తి

పూజను నిషేధించువారు సయితము సూక్ష్మరీతిగ విచా
రించినచో మూర్తిపూజకులే యగుచున్నారు. పుస్తక
మును పూజించుట, దేవాలయమున కరిగి పూజసలు
పుట, ఒక్కదిశయందే ముఖము నుంచి పూజచేయుట
యివన్నియు సాకారపూజాలక్షణములు. అయినప్పటికి
సాకారమున కావలియున్న నిరాకారమగు నచింత్య
స్వరూపము కలదు. ఇక్కెల్లరు గ్రహించుటవలననే ముక్తు
లగుదురు. భక్తుండు భగవానునియందు విలీనుఁడయి
పోవుచుండఁగఁ గేవలమొక యద్వితీయ, నిరాకారుఁడగు
భగవానుఁడే యుండిపోవలయును- ఇదియే భక్తియొక్క
పరాకాష్ఠ. కాని యీస్థితికి సాకారము ద్వారముననే
సులభముగాఁ జేరవచ్చును. కాఁబట్టి నిరాకారమును
దిన్నగాఁ జేరు మార్గము కష్టసాధ్యమని చెప్పఁబడినది.

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. ౬.
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరా త్పార్థ మ య్యావేశితచేతసామ్. ౭

కాని యోపార్థా! ఎవరు నాయందుఁ బరాయణులుగ నుండి, సమస్తకర్మల నాకు సమర్పించి, తదేకనిష్ఠతో నన్ను ధ్యానించుచు నన్నుపాసించుచున్నారో మఱియు నాయం దెవరి చిత్తము లగ్న మొనరింపఁ బడియున్నదో వారిని మృత్యురూపమగు సంసారసాగరము నుండి తత్క్షణము దరింపఁజేయుచున్నాను.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం నసంశయః. ౮

నీమనస్సును నాయందు లగ్నము చేయుము, నీబుద్ధిని నాయం దుంచుము, ఇందుచే దీనికిఁ (జన్మ) బిదప నిస్సంశయముగ నన్నే పొందుదువు.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్,
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ. ౯

నీవు నాయందు నీమనస్సును స్థిర మొనరింప నసమర్థుఁడ వగుదువేని యోధనంజయా! అభ్యాసయోగముచే నన్నుఁ బొందు నిచ్ఛను గలిగియుండుము.

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ,
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి. ౧౦

ఇట్టి యభ్యాసమును గలిగియుండుటయందు నయితము నీ వసమర్థుఁడ వగుదువేని సకలకర్మల నాకర్పించి, మఱియు నీచందమున నానిమిత్తము కర్మచేయుచుఁ జేయుచుఁగూడ నీవు మోక్షమును బడయుదువు.

వ్యాఖ్యానము: అభ్యాస మనఁగాఁ జిత్తవృత్తినిరోధముయొక్క సాధన; జ్ఞాన మనఁగా శ్రవణమననాదులు; ధ్యాన మనఁగా నుపాసన. వీనిఫలస్వరూపముగఁ గర్మఫలత్యాగము కనుపించనిచో నభ్యాస మభ్యాసము కాదు, జ్ఞానము జ్ఞానముకాదు మఱియు ధ్యానము ధ్యానము కాదు.

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః,
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. ౧౧

మఱియు నానిమిత్తము కర్మచేయుటకేని నీకు శక్తి లేకున్నచో యత్నపూర్వకముగ సకలకర్మలఫలత్యాగ మొనరించుము.

శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే,
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతి రనంతరమ్. ౧౨

అభ్యాసమార్గముకంటె జ్ఞానమార్గము శ్రేయస్కరము. జ్ఞానమార్గముకంటె ధ్యానమార్గము విశేషమయినది. మఱియు ధ్యానమార్గముకంటెఁ గర్మఫలత్యాగము శ్రేష్ఠము. కారణ మేమనఁగా నీత్యాగమున కంతమున శాంతియే కలుగుచున్నది.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ. ౧౩
సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మ య్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః. ౧౪

ఎవఁడు సకలప్రాణులయెడ ద్వేషరహితుఁడుగను, ఎల్లరికి మిత్రుఁడుగను, దయామయుఁడుగను, మమత్వరహితుఁడుగను, అహంకారరహితుఁడుగను, సుఖదుఃఖములసమానుఁడుగను, క్షమవంతుఁడుగను, నిత్యసంతోషిగను, యోగయుక్తుఁడుగను, ఇంద్రియనిగ్రహవంతుఁడుగను మఱియు దృఢనిశ్చయము గలవాఁడుగను

నుండునో, మఱియు నాయం దెవఁడు తన బుద్ధిని, మనస్సును నర్పణముఁ గావించివైచియుండునో యట్టి నా భక్తుఁడు నాకుఁ బ్రియుఁడు.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః,
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః. ౧౫

ఎవనివలన జను లుద్వేగమును బొందరో, ఎవఁడు జనులవలన నుద్వేగమును బడయఁడో, ఎవఁడు హర్షము, క్రోధము, ఈర్ష్య, భయము, ఉద్వేగములనుండి ముక్తుఁడో, వాఁడు నాకుఁ బ్రియుఁడు.

అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః. ౧౬

ఎవఁ డిచ్ఛారహితుఁడో, పవిత్రుఁడో, దక్షుఁ (సావధానుఁడు)డో, తటస్థుఁడో, చింతారహితుఁడో, సకలసంకల్పముల నెవఁడు త్యజించియున్నాఁడో వాఁడు నాభక్తుఁడు, వాఁడు నాకుఁ బ్రియుఁడు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః. ౧౭

ఎవఁడు హర్షమును బొందఁడో, ఎవఁడు ద్వేషింపఁడో, ఎవఁడు చింతింపఁడో, ఎవఁ డాశలను సృజించుకొనఁడో, ఎవఁడు శుభాశుభములఁ ద్యజించువాఁడై యున్నాఁడో ఆభక్తిపరాయణుఁడు నాకుఁ బ్రియుఁడు.

సమః శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమః సంగవివర్జితః. ౧౮
తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః. ౧౯

శత్రుమిత్రులు, మానావమానములు, శీతోష్ణములు, సుఖదుఃఖములు - వీనన్నింటియం దెవఁడు సమత్వము గలవాఁడో, ఎవఁ డాసక్తిని విడిచెనో, ఎవఁడు నిందాస్తుతుల సమానభావముతోఁ బ్రవర్తించునో మఱియు మౌనమును ధరించునో, ఏది లభించినను దానిచే నెవనికి సంతోష ముండునో, ఎవనికిఁ దనది యను నే స్థానము లేదో, ఎవఁడు స్థిరచిత్తుఁడో, అట్టి మనుజ భక్తుఁడు నాకుఁ బ్రియుఁడు.

యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్దధానా మత్పరమా భక్తా స్తే౽తీవ మే ప్రియాః. ౨౦

ఈపవిత్రామృతరూపమగు జ్ఞానము నెవరు నాయందుఁ బరాయణులుగ నుండి శ్రద్ధాపూర్వకముగ సేవించుచున్నారో వారు నా కత్యంతప్రియభక్తులు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగో నామ
ద్వాదశో౽ధ్యాయః.

---

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతారూపమగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గతయోగశాస్త్రమందలి శ్రీ కృష్ణార్జునసంవాదముయొక్క భక్తియోగ మను పేరు గల పండ్రెండవ యధ్యాయము ముగిసినది.

## ౧౩

# క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము.

ఈ యధ్యాయములో శరీరము మఱియు శరీరికిఁ గలభేదము తెలుపఁబడినది.

అర్జున ఉవాచ:—

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ,
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయంచ కేశవ. ౧

అర్జునుఁడు చెప్పెను : కేశవా! ప్రకృతి యన నెద్దియో, పురుషుఁ డనఁగా నెవఁడో, క్షేత్ర మనఁగా నేదియో, క్షేత్రజ్ఞుఁ డనఁగా నెవఁడో, జ్ఞాన మనఁగా నెట్టిదో, తెలియఁదగిన దెటువంటిదో యిది యంతయు నెఱుంగఁ గోరుచున్నాఁడను.

శ్రీభగవా నువాచ:—

ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మి త్యభిధీయతే,
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. ౨

శ్రీభగవానుఁడు చెప్పెను: ఓ కౌంతేయా! ఈశరీరము క్షేత్రమని చెప్పఁబడుచున్నది, మఱియు దీని నెవఁడు తెలియుచున్నాఁడో వానిని తత్త్వజ్ఞానులు క్షేత్రజ్ఞుఁ డని చెప్పుచున్నారు.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం య త్తజ్జ్ఞానం మతం మమ. 3

మఱియు నోభారతా! సమస్తక్షేత్రములలో-శరీరములలో స్థితుఁడ నగు నన్ను క్షేత్రజ్ఞునిగాఁ దెలియుము. క్షేత్రము మఱియు క్షేత్రజ్ఞుని భేదముయొక్క జ్ఞానమే జ్ఞాన మని నామతము.

త త్క్షేత్రం య చ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్,
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. ౪

ఈక్షేత్ర మన నేది, ఎట్టిది, ఎట్టి వికారములు గలది, ఎచటనుండి వచ్చినది, మఱియు క్షేత్రజ్ఞుఁ డనఁగా

నెవఁడు, వానిశక్తి యెట్టిది, ఇది నావలన సంక్షేపముగా వినుము.

> ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్,
> బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః. ౪

వివిధఛందస్సులందు భిన్నభిన్నప్రకారములచేతను మఱియు నుదాహరణయుక్తులద్వారమునను, నిశ్చయయుక్తములగు బ్రహ్మసూచకవాక్యములందును ఋషులీవిషయము నధికముగా గానము సలిపియున్నారు.

> మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవచ,
> ఇంద్రియాణి దశైకంచ పంచచేంద్రియగోచరాః. ౫
> ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః,
> ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్. ౬

మహాభూతములు, అహంకారము, బుద్ధి, ప్రకృతి, దశేంద్రియములు, ఒక మనస్సు, పంచవిషయములు, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, సంఘాతము, చేతనశక్తి, ధృతి - ఇవి వాని వికారముల సమేతముగ క్షేత్రమని సంక్షేపముగఁ జెప్పఁబడెను.

వ్యాఖ్యానము : మహాభూతము లయిదు - పృథ్వి, జలము, తేజము, వాయువు మఱియు నాకాశము. అహంకార మనఁగా శరీరమునం దుండు నహంత, అహంకృతి. అవ్యక్త మనఁగా నదృశ్యముగానుండు మాయ, ప్రకృతి. దశేంద్రియములలో నయిదుజ్ఞానేంద్రియములు - ముక్కు, చెవి, కన్ను, నాలుక మఱియుఁ జర్మము, మఱియు నయిదు కర్మేంద్రియములు - చెయ్యి, కాలు, ముఖము, మఱియు రెండు గుహ్యేంద్రియములు. ఐదుగోచరము లనఁగా నయిదు జ్ఞానేంద్రియములయొక్క నైదు విషయములు - వాసనచూచుట, వినుట, చూచుట, రుచిచూచుట మఱియుఁ దాకుట. సంఘాత మనఁగా శరీరతత్వములను బరస్పరసంయోగమొనరించు శక్తి. ధృతి యనఁగా ధైర్యరూప మగు సూక్ష్మగుణము కాదు, కాని యీ శరీరముయొక్క పరమాణువు లొకదానితో నొకటి యతుకుకొనియుండు గుణము. ఈ గుణ మహంభావముచేతనే సంభవ మగు

చున్నది. మఱియు నీయహంత యవ్యక్తప్రకృతియందు వెలయుచున్నది. ఈ యహంతను మోహరహితుఁడగు మనుష్యుఁడు జ్ఞానపూర్వకముగఁ ద్యజించుచున్నాఁడు. మఱియు నందుచే మృత్యుసమయమునను లేక యితరాఘాతములవలనను వాఁడు దుఃఖమును బొందఁడు. జ్ఞానులేమి, అజ్ఞానులేమి యెల్లరంతమున కీవికారములు గల క్షేత్రమును ద్యజించియే ముక్తు లగుచున్నారు.

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః. ౮

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ,
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్. ౯

అసక్తి రనభిష్వంగః పుత్త్రదారగృహాదిషు,
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. ౧౦

మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది. ౧౧

అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్,
ఏతత్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా. ౧౨

అమానిత్వము, అదంభిత్వము, అహింస, క్షమ, సరళత్వము, ఆచార్యసేవ, శుచిత్వము, స్థిరత్వము, ఆత్మసంయమము, ఇంద్రియవిషయములందు వైరాగ్యము, అహంకారశూన్యత్వము, జన్మము, మరణము, జర, వ్యాధి, దుఃఖము మఱియు దోషములయొక్క నిరంతర జ్ఞానము, పుత్రుఁడు, కళత్రము మఱియు గృహాదుల యందు మోహమును మఱియు మమత్వాభావము, ప్రియము మఱియు నప్రియమందు నిత్యసమభావము, నాయందనన్యధ్యానపూర్వకమగు సేవనిష్ఠాభక్తి, ఏకాంతస్థానసేవనము, జనసమూహమునఁ జేరుటయందరుచి, ఆధ్యాత్మికజ్ఞాననిత్యత్వముయొక్క జ్ఞానము మఱియు నాత్మదర్శనము - ఇవియన్నియు జ్ఞాన మని చెప్పఁబడు చున్నవి. దీనికి విరుద్ధమయినది యజ్ఞానము.

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే,
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే. ౧౩

దేనిని దెలియువారు మోక్షమును బడయుచు

న్నారో ఆజ్ఞేయ మేదియో నీకుఁ జెప్పెదను. అది యనాదిపరబ్రహ్మము; అది సత్తు అని చెప్పఁబడఁజాలదు, అసత్తనియుఁ జెప్పఁబడఁజాలదు.

వ్యాఖ్యానము:—ఈశ్వరుని సత్తు లేదా అసత్తు అనికూడఁ జెప్పవీలు లేదు. ఏదేని యొక శబ్దముచే వాని వ్యాఖ్యానముగాని పరిచయముగాని కాఁజాలదు, ఇట్లు వాఁడు గుణాతీత మగు స్వరూపము.

సర్వతః పాణిపాదం త త్సర్వతో ఽక్షిశిరోముఖమ్,
సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి. ౧౪

ఎచ్చటఁ జూచిన నచ్చటనే దాని చేతులు, కాళ్లు, కండ్లు, తలలు, ముఖములు మఱియుఁ జెవులు నున్నవి. సర్వత్ర వ్యాపించి యది యీలోకమున విద్యమానమయి యున్నది.

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితమ్,
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ. ౧౫

సకలేంద్రియగుణముల యాభాసము దానిలో నున్నది, అయినప్పటికిని స్వరూప మింద్రియరహిత

మును మఱియు నన్నిటినుండి యలిప్తమును నయి
యున్నది; అది అయినప్పటికి సర్వమును ధరించున దయి
యున్నది, గుణరహిత మయినప్పటికి గుణములభోక్త.

బహి రంతశ్చ భూతానా మచరం చర మేవ చ,
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్. ౧౫

అది భూతములకు వెలుపలనున్నది మఱియు
లోపలనయిత మున్నది. అది గతిమంతము మఱియు స్థిర
మునయిత మయియున్నది. సూక్ష్మమగుటచే నది విజ్ఞే
యముగ నున్నది. అది దూరముగ నున్నది మఱియు
సమీపమున నున్నది.

వ్యాఖ్యానము: ఎవఁడు దానిని గురుతించుచున్నా
డో వాఁడు దానిలోపల నున్నాఁడు. గతి మఱియు స్థిర
త్వము, శాంతి మఱియు నశాంతి మన మనుభవించు
చున్నవి, మఱియు సమస్తభావములు దానియందుండియే
యుత్పన్న మగుచున్నవి, కాఁబట్టి యది గతిమంతము
(చరము) మఱియు స్థిరము (అచరము)ను నయియున్నది.

అవిభక్తంచ భూతేషు విభక్త మివ చ స్థితమ్,
భూతభర్తృచ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ. ౧౬

భూతములయం దది యవిభక్తముగ నున్నది. మఱియు విభక్తమునలె నయితము వెలయుచున్నది. అది తెలియదగినది (బ్రహ్మ) ప్రాణులకు భర్త, హర్త మఱియుఁ గర్త.

జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య ధిష్ఠితమ్. ౧౭

అది జ్యోతులకుఁగూడ జ్యోతి, అంధకారమున కది పర మని చెప్పఁబడుచున్నది. జ్ఞాన మదియే, తెలియ దగిన దదియే మఱియు జ్ఞానముచే నేది ప్రాప్తించుచున్నదో అదికూడ నదియే. అది యందఱి హృదయముల వెలయుచున్నది.

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః,
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే. ౧౮

ఈ చందమున క్షేత్రము, జ్ఞానము మఱియు జ్ఞేయమునుగూర్చి నేను సంక్షేపమునుగాఁ దెలిపితిని. నీని

నెఱింగి నా భక్తుఁడు నా భావమును బడయ యోగ్యుఁ డగుచున్నాఁడు.

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౨౦

ప్రకృతిని మఱియుఁ బురుషుని రెంటి ననాదు లని తెలియుము. వికారములు మఱియు గుణములు ప్రకృతినుండి యుత్పన్నము లగుచున్న వని తెలియుము.

కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే,
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే. ౨౧

ప్రకృతి కార్యమునకు మఱియుఁ గారణమునకు హేతువుగఁ జెప్పఁబడుచున్నది మఱియుఁ బురుషుఁడు సుఖదుఃఖములయొక్క భోగమందు హేతువుగఁ జెప్పఁ బడుచున్నాఁడు.

పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణసంగో ఽస్య సదసద్యోనిజన్మసు. ౨౨

ప్రకృతియం దుండు పురుషుఁడు ప్రకృతినుండి యుత్పన్నములగు గుణములను భోగించుచున్నాఁడు.

మఱియు నీగుణసంగమే మంచిచెడ్డయోనియందు వాని
జన్మకుఁ గారణమగుచున్నది.

వ్యాఖ్యానము : ప్రకృతిని మనము లౌకికభాష
యందు మాయ యనుపేరఁ బిలుచుచున్నాము. పురు
షుఁడు జీవుఁడు. మాయ యనఁగా మూల్యస్వభావము
నకు వశవర్తియగు జీవుఁడు సత్త్వరజస్తమములచేఁ
గలుగు కార్యముల ఫలమును భోగించుచున్నాఁడు
మఱియు నిందుచేఁ గర్మననుసరించి పునర్జన్మను బొందు
చున్నాఁడు.

ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః. ౨౩

ఈదేహమునందుండు పరమపురుషుఁడు సర్వ
సాక్షి, అనుమతి నొసంగువాఁడు, భర్త, భోక్త, మహే
శ్వరుఁడు మఱియుఁ బరమాత్ముఁడని కూడఁ జెప్పఁబడు
చున్నాఁడు.

య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే. ౨౪

ఏమనుష్యుఁ డీ చందమునఁ బురుషుని మఱియు గుణమయి యగు ప్రకృతిని దెలియుచున్నాఁడో వాఁడు సమస్తరీతులఁ గార్యమొనరించుచుండియుఁగూడ మరల జన్మను బొందఁడు.

వ్యాఖ్యానము : 2. 9. 12 మఱియు నితరాధ్యాయముల సాహాయ్యమున నీ శ్లోకము స్వేచ్ఛాచారిత్వమును సమర్థించునది కాదనియు, కాని భక్తిమహిమను దెలుపునదనియు మనము గ్రహింపవచ్చును. సమస్తకర్మలు జీవునకు బంధనకారకములు, కాని యా కర్మల నన్నింటిఁ బరమాత్మున కర్పణముచేయుచో వాఁడు బంధనముక్తుఁ డగును. మఱియు నీ చందమున నెవనియందుండి కర్తృత్వరూప మగు నహంభావము నశించిపోయినదో మఱియు నెవఁ డిరువదినాలుగుగంట లంతర్యామిని గురుతించుచుండునో వాఁడు పాపకర్మ చేయనే చేయఁజాలఁడు. పాపమూలమే యభిమానము. ఎయ్యెడ "నేను" లేదో అయ్యెడ బాపము లేదు. ఈ శ్లోకము

పాపకర్మ చేయకుండుటయొక్క యుక్తిని తెలుపు చున్నది.

ధ్యానే నాత్మని పశ్యంతి కేచి దాత్మాన మాత్మనా,
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. ౨౪

ఒకానొకఁడు ధ్యానమార్గముచే నాత్మద్వార యమున నాత్మను దనయందుఁ జూచుచున్నాఁడు. కొం దఱు జ్ఞానమార్గముచేతను మఱియు నితరులగు కొందఱు కర్మమార్గమువలనను జూచుచున్నారు.

అన్యే త్వేవ మజానంతః శ్రుత్వా ఽన్యేభ్య ఉపాసతే,
తే ఽపి చాతితరం త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః. ౨౫

మఱియుఁగొందఱీమార్గముల నెఱుంగకుండుటచే నితరులవలనఁ బరమాత్ముని విషయమును విని, విన్న దానిపై శ్రద్ధను గలిగియుండి మఱియు దానియందుఁ బరాయణులుగ నుండి యుపాసనచేయుచున్నారుమఱియు వారుకూడమృత్యువును దరించి పోవుచున్నారు.

యావ త్సంజాయతే కించి త్సత్త్వం స్థావరజంగమమ్,
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధి భరతర్షభ. ౨౬

ఉత్పన్నమగుచున్న చరాచరమగు నే వస్తువయి
న నో భరతర్షభా! క్షేత్రము మఱియు క్షేత్రజ్ఞునియొక్క-
యనఁగాఁ బ్రకృతి మఱియుఁ బురుషుని సంయోగము
వలనఁ గలుగుచున్న దని తెలియుము.

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్,
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి. ౨౭

సమ స్తనశ్వర ప్రాణులయం దవినాశియగు పర
మేశ్వరుఁడు సమభావముతో నున్నాఁ డని యెవఁడు తెలి
యుచున్నాఁడో వాఁడే వానిని దెలియువాఁడు.

సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్,
న హినస్త్యాత్మనా ఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్. ౨౮

ఈశ్వరుని సర్వత్ర సమభావముతో నున్నవాని
గా నేమనుష్యుఁడు చూచుచుండునో వాఁడు తన్నుఁ
దాను వధించుకొనుటలేదు మఱియు నిందుచే నతఁడు
పరమగతిని బడయుచున్నాఁడు.

వ్యాఖ్యానము : సమభావముతో నుండునీశ్వరుని
జూచువాఁడు తాను వానియందు విలీనుఁ డయిపోవు

మన్నాఁడు. మఱియు నితర మేమియుఁ జూడఁడు. ఇంకను
నే వికారవశుఁడుగాక మోక్షమును బొందుచున్నాఁడు,
తనకు శత్రువు గాఁడు.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి. ౩౦

సర్వత్ర ప్రకృతియే కర్మ చేయుచున్న దని
యెవఁడు గ్రహించుచున్నాఁడో మఱియు నందువలనే
యాత్మ నకర్త యని తెలియుచున్నాఁడో వాఁడే తెలియు
చున్నాఁడు.

**వ్యాఖ్యానము:** ఎట్లు నిద్రించుచున్న మనుష్యుని
యాత్మ నిద్రకుఁ గర్త కాదో, కాని ప్రకృతి నిద్ర
యొక్క కర్మ చేయుచున్నదో యట్లు నిర్వికారుఁ డగు
మనుష్యుని నేత్రములే యల్లలతను జూడఁజాలవు.
ప్రకృతి వ్యభిచారిణి కాదు. అభిమానియగు పురుషుఁ
డెపుడు దానికి స్వామి యగుచున్నాఁడో అపుడు వాని
సంగముచే విషయవికారము లుత్పన్నము లగుచున్నవి.

యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి,
తత ఏవచ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా.  ౩౧

ఎప్పుడు వాఁడు జీవుల యస్తిత్వము భిన్నముగా నున్నప్పటికి నొక్కదానియందే యున్నదానిగాఁ జూచుచున్నాఁడో మఱియు నంతయు దానినుండియే యుత్పన్నమయినదానిగాఁ దలంచుచున్నాఁడో అపుడు వాఁడు బ్రహ్మను బొందుచున్నాఁడు.

వ్యాఖ్యానము: అనుభవముచే సమస్తమును బ్రహ్మయందే చూచుటయే బ్రహ్మను బొందుటయై యున్నది. అపుడు జీవుఁడు శివునినుండి భిన్నుఁడుగా నుండఁడు.

అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాయ మవ్యయః,
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే.  ౩౨

ఓ కౌంతేయా! ఈ యవినాశియగు పరమాత్మ యనాది మఱియు నిర్గుణుఁడు నగుటచే శరీరమునం దుండుచుండియు నేమియుఁ జేయక మఱియు దేనిచే లిప్తుఁడు గాక యుండును.

యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే.　　౩౩

ఏరీతి సూక్ష్మముగుటచే సర్వవ్యాపకమగు నాకాశము లిప్తముగాదో, ఆరీతిగనే దేహమందంతట నుండు నాత్మయు లేపముఁ బొందదు.

యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత.　　౩౪

ఎట్లొకే సూర్యుఁ డీసమస్తజగత్తునకుఁ బ్రకాశము నొసంగుచున్నాఁడో, అట్లనే యోభారతా! క్షేత్రి క్షేత్రమునంతటిని బ్రకాశింపఁ జేయుచున్నాఁడు.

క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞానచక్షుషా,
భూతప్రకృతిమోక్షంచ యే విదు ర్యాంతి తే పరమ్.　　౩౫

ఎవఁడు జ్ఞానచక్షువుచే క్షేత్రమునకు మఱియు క్షేత్రజ్ఞునకు మధ్యమునఁ గల భేదమును మఱియుఁ బ్రకృతిబంధనమునుండి ప్రాణులకు ముక్తి యెట్లు కలుగుచున్నదో తెలియుచున్నాఁడో వాఁడు బ్రహ్మను బొందుచున్నాఁడు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ
విభాగయోగో నామ త్రయోదశోఽధ్యాయః.

---

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతారూపమగు నుపనిషత్తు యనఁగా బ్రహ్మవిద్యాంతర్గత యోగశాస్త్ర మందలి శ్రీకృష్ణార్జునసంవాదముయొక్క క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ యోగ మను పేరుగల పదమూఁడవ యధ్యాయము ముగిసినది.

---

# ౧౪

## గుణత్రయ విభాగ యోగము.

గుణమయి యగు ప్రకృతియొక్క స్వల్పపరిచయ మొసంగఁబడిన పిదప సహజముగా మూఁడుగుణముల వర్ణన మీ యధ్యాయమున వచ్చుచున్నది. మఱియు నది చేయుచు గుణాతీతుని లక్షణముల భగవానుఁడు లెక్కింపఁజేయుచున్నాఁడు. రెండవయధ్యాయమునం దే లక్షణములు స్థితప్రజ్ఞునిగూర్చి కనిపించుచున్నవో అవి యిందు గుణాతీతునిగూర్చి చెప్పఁబడినవి.

శ్రీభగవానువాచ:—

> పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్,
> య జ్జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః. ౧

శ్రీభగవానుఁడు చెప్పెను: జ్ఞానములలో నే యుత్తమజ్ఞానానుభవమును బొంది సకలమును లీశరీరమును విడిచిన పిదపఁ బరమగతిని బొందియున్నారో దానిని నేను నీకు మరలఁ జెప్పెదను.

ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః,
సర్గే ఽపి నోపజాయంతే ప్రళయే నవ్యథంతిచ. ౨

ఈ జ్ఞానము నాశ్రయించి యెవరు నాభావమును బొందియున్నారో వా రుత్పత్తికాలమున జన్మించుట యుండదు మఱియుఁ బ్రళయకాలమున వ్యథ ననుభవింపఁ బనియుండదు.

మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధా మ్యహమ్,
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత. 3

ఓ భారతా! మహద్బ్రహ్మ యనఁగాఁ బ్రకృతి నాయోని. అందు నేను గర్భాధానము చేయుచున్నాను. మఱియు దానినుండి సకలప్రాణులయుత్పత్తి కలుగుచున్నది.

సర్వయోనిషు కౌంతేయ మూర్తయ స్సంభవంతి యాః,
తాసాం బ్రహ్మ మహ ద్యోని రహం బీజప్రదః పితా. ౪

ఓ కౌంతేయా ! అన్నియోనులలో నేయేప్రాణుల యుత్పత్తి యగుచున్నదో వాని యుత్పత్తిస్థానము నాప్రకృతి మఱియు నందు బీజారోపణము చేయు పితను-పురుషుండను - నేను.

సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః,
నిబధ్నంతి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్. ౫

ఓ మహాబాహూ ! సత్త్వము, రజస్సు మఱియు తమస్సు ప్రకృతినుండి కలుగు గుణములు. అవి యవినాశి యగు దేహధారిని - జీవుని - దేహవిషయమున బంధించుచున్నవి.

తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ. ౬

వీనిలో సత్త్వము నిర్మలమగుటచేఁ బ్రకాశకమును మఱియు నారోగ్యకరమును నయియున్నది, మఱియు నోయనఘా ! అది దేహిని సుఖముయొక్కయు

మఱియు జ్ఞానముయొక్కయు సంబంధమున బంధించుచున్నది.

రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్,
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్. ౭

ఓ కౌంతేయా! రజోగుణము రాగరూప మగుటచే దృష్ణకు మఱియు నాసక్తికి మూలము. అది దేహధారిని గర్మపాశమున బంధించుచున్నది.

తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్,
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత. ౮

ఓ భారతా! తమోగుణ మజ్ఞానమూలకము. అది సకలదేహధారుల మోహమునఁ బడవేయుచున్నది మఱియు నది యసావధానత, ఆలస్యము మఱియు నిద్రయొక్క పాశమున దేహిని బంధించుచున్నది.

సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత,
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత. ౯

ఓ భారతా! సత్త్వ మాత్మకు శాంతిసుఖసంగమును గలిగించుచున్నది. రజస్సు కర్మను మఱియుఁ

దమస్సు జ్ఞానమును గప్పి ప్రమాదసంగమును గలిగించు చున్నవి.

రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత,
రజ స్సత్త్వం తమశ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా. ౧౦

ఓ భారతా! ఎప్పుడు రజస్సు మఱియుఁ దమస్సు నణఁగుచున్నవో అప్పుడు సత్త్వము పైకి వచ్చుచున్నది. సత్త్వము మఱియుఁ దమస్సు నణఁగినపుడు రజస్సు, మఱియు సత్త్వము మఱియు రజస్సు యణఁగినపుడు తమస్సు పైకి వచ్చుచున్నవి.

సర్వద్వారేషు దేహే ఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వ మి త్యుత. ౧౧

సకలేంద్రియములద్వారమున నీదేహమం దెపుడు ప్రకాశము మఱియు జ్ఞానము నుద్భవించుచున్నవో అపుడు సత్త్వగుణము వృద్ధియయినదని తెలియవలయును.

లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమః స్పృహా,
రజ స్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ. ౧౨

ఓ భరతర్షభా! ఎపుడు రజోగుణవృద్ధి కలుగు

చున్నదో అపుడు లోభము, ప్రవృత్తి, కర్మల యారం
భము, అశాంతి మఱియు నిచ్ఛ యుదయించుచున్నవి.

అప్రకాశో ఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ,
తమ స్యేతాని జాయంతే వివృద్ధే కురునందన. ౧౩

ఓ కురునందనా! ఎపుడు తమోగుణము వృద్ధిఁ
గాంచుచున్నదో అపు డజ్ఞానము, మాంద్యము, అన
వధానత మఱియు మోహము నుత్పన్నమగుచున్నవి.

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే. ౧౪

తనయందు సత్త్వగుణము వృద్ధినందినపుడు దేహ
ధారి మరణించుచో నుత్తమజ్ఞానుల నిర్మలలోకమును
బొందుచున్నాఁడు.

రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే,
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే. ౧౫

రజోగుణమందు మృత్యువు కలుగుచో దేహధారి
కర్మసంగియొక్క లోకమున జన్మించుచున్నాఁడు, మఱి
యుఁ దమోగుణమున మృతిఁ జెందువాఁడు మూఢయోని

యందు జన్మించుచున్నాఁడు.

వ్యాఖ్యానము : కర్మసంగి యనఁగా మనుష్య లోకము మఱియు మూఢయోని యనఁగాఁ బశువు మున్నగు లోకములు.

> కర్మణ స్సుకృత స్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్,
> రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. ౧౬

సత్కర్మఫలము సాత్త్వికమును మఱియు నిర్మలమును నగుచున్నది. రాజసకర్మఫలము దుఃఖమగుచున్నది మఱియుఁ దామసకర్మఫల మజ్ఞానమగుచున్నది.

వ్యాఖ్యానము : దేనిని మనము సుఖదుఃఖ మని తలంచుచున్నామో ఆసుఖదుఃఖప్రసంగ మిచటఁ గల దని భావింపరాదు. సుఖ మనఁగా నాత్మానందము, ఆత్మ ప్రకాశము. దీనికి విరుద్ధమయినది దుఃఖము. 17 వ శ్లోకమునం దిది స్పష్టమగుచున్నది.

> సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ,
> ప్రమాదమోహౌ తమసో భవతో ఽజ్ఞాన మేవచ. ౧౭

సత్త్వగుణమునం దుండి జ్ఞాన ముదయించుచున్నది. రజోగుణమందుండి లోభమును మఱియుఁ దమోగుణ మందుండి యసావధానత, మోహము మఱియు నజ్ఞానము నుత్పన్నము లగుచున్నవి.

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః. ౧౮

సాత్త్వికమనుష్యులు పైకెక్కుచున్నారు, రాజసులు మధ్యమునం దుండుచున్నారు మఱియు నంతిమగుణముగల తామసు లధోగతిని బొందుచున్నారు.

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి. ౧౯

జ్ఞాని యెప్పుడు గుణములుతక్క మఱియొక కర్త లేఁడని చూచుచున్నాఁడో మఱియు గుణములకుఁ బరముగా నున్నవానిని దెలియుచున్నాఁడో అప్పుడు వాఁడు నా భావమును బొందుచున్నాఁడు.

వ్యాఖ్యానము: గుణములను కర్తగా భావించు వాని కహంభావము కలుగనే కలుగదు. అందుచే వాని

కార్యములు అన్నియు స్వాభావికములుగను మఱియు శరీర
యాత్రకుఁ దగువఱకే యుండును. మఱియు శరీరయాత్ర
పరమాత్మను నిమిత్తమే జరుగుచున్నది, కాఁబట్టి దాని
సమస్తకర్మలయందు నిరంతరము త్యాగము మఱియు
వైరాగ్యము నుండవలయును. ఇట్టివాని సహజముగా
గుణములకుఁ బరముగానున్న పరమాత్మయందు నీశ్వరభావన
చేయుచు మఱియు వానిని భజించుచుండును.

గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే. ౨౦

దేహసంగముచే నుత్పన్నములగు నీ మూఁడుగుణ
ముల నతిక్రమించి దేహధారి జన్మము, మృత్యువు
మఱియు జరయొక్క దుఃఖములనుండి విముక్తుఁ డగుచు
న్నాఁడు మఱియు మోక్షమును బొందుచున్నాఁడు.

అర్జున ఉవాచ:—

కైర్లింగైస్త్రీన్ గుణానేతానతీతో భవతి ప్రభో,
కిమాచారః కథం చైతాంస్త్రీన్ గుణానతివర్తతే. ౨౧

అర్జునుఁడు చెప్పెను : ఓ ప్రభూ ! ఈగుణములఁ

దరించునాఁ డేచిహ్నములచే గురుతింపఁబడుచున్నాఁడు? వాని యాచారము లేవి? మఱియు వాఁడు మూఁడుగుణములనెట్లు తరించుచున్నాఁడు?

శ్రీ భగవానువాచ:—

ప్రకాశం చ ప్రవృత్తించ మోహమేవ చ పాండవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి. ౨౨
ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే,
గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే. ౨౩
సమదుఃఖసుఖస్స్వస్థస్సమలోష్టాశ్మకాంచనః,
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః. ౨౪
మానాపమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారంభపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే. ౨౫

శ్రీభగవానుఁడు చెప్పెను: ఓ పాండవా! ప్రకాశము, ప్రవృత్తి మఱియు మోహము ప్రాప్తించినను నెవఁడు దుఃఖము నందఁడో మఱియు నివి ప్రాప్తింపక పోయినను వీని నిచ్ఛయింపఁడో, ఉదాసీనునివలె నెవఁడు స్థిరుఁడో, ఎవనిని గుణములు చలింపఁజేయవో, గుణములే తమపనిని చేసికొనుచున్న వని తలంచి యెవఁడు స్థిరుఁ

డుగ నుండునో మఱియు విచలితుఁడు కాఁడో, ఎవఁడు సుఖదుఃఖముల సమత్వసంపన్నుఁడుగ నుండునో, స్వస్థుఁడుగ నుండునో, మట్టిపెల్లను, ఱాయిని మఱియు బంగారమును సమానముగఁ దలంచునో, ప్రియము లేక యప్రియమగు వస్తువు లభించినను నొక్కరీతిగ నుండునో, ఏ బుద్ధిమంతునకు నిందాస్తుతులు సమముగ నుండునో, ఎవనికిని మానము లేక యవమానము సమానమో, ఎవఁడు మిత్రపక్షమునను మఱియు శత్రుపక్షమందు సమానభావమును గలిగియుండునో మఱియు నెవఁడు సమస్తారంభములఁ ద్యజించినవాఁడో వాఁడు గుణాతీతుఁ డని చెప్పఁబడుచున్నాఁడు.

వ్యాఖ్యానము: 22 నుండి 25 వ శ్లోకము వఱకు నొక్కసారిగ విచారింపవలయును. ప్రకాశము, ప్రవృత్తి మఱియు మోహము గతశ్లోకములోఁ జెప్పిన ప్రకారము క్రమముగ సత్త్వము, రజస్సు మఱియుఁ దమస్సుయొక్క పరిణామములు లేక చిహ్నములు.

అనఁగా నెవఁడు గుణముల నతిక్రమించియున్నాఁడో వానిపై నీ పరిణామములయొక్క యెట్టి పరిభావమును బడఁజాల దని దీని తాత్పర్యము. ఆత్మాయి ప్రకాశము నిచ్చుచుండును. ప్రవృత్తిని గాని జడత్వమును గాని ద్వేషింపదు; కోరనక్కఱలేకయే దానికి శాంతి కలదు. దానికెవఁడేని గతి నొసంగుచున్నచో నది వానిని ద్వేషింపదు. గతి నొసంగిన పిదప స్థిరమొనరించినచో, దీనిచేఁ బ్రవృత్తి-గతి పోఁగిపోయినవి, మోహము, జడత్వము ప్రాప్తించినవి, అని తలంచి యది దుఃఖింపదు; ఆ మూఁడు స్థితులందును నది యొక్క-రీతిగనే వర్తించును. ఆత్మాయియందును మఱియు గుణాతీతునియందును భేద మిది; గుణాతీతుఁడు చేతనమయుఁడు మఱియు నతఁడు జ్ఞానపూర్వకముగ గుణముల పరిణామములను, స్పర్శను త్యజించియున్నాఁడు. మఱియు జడమగు ఆత్మాయివలె నయిపోయినాఁడు. ఆత్మాయి గుణముల కనఁగాఁ బ్రకృతి యొక్క కార్యములకు సాక్షి కాని కర్త కాదు, అదియే

రీతి జ్ఞాని దానికి సాక్షిగ నుండును. కర్త నశించిపోవు
చున్నాఁడు. ఇట్టి జ్ఞానివిషయమున 23 వ శ్లోకము
చెప్పిన ప్రకారము వాఁడు ‘గుణములు తమ పనిని జేసి
కొనుచున్నవి ?’ అని భావించుచు విచలితుఁడు గాడు
మఱియు స్థిరుఁడుగ నుండును; ఉద్దాసీనునివలె నుండును
అనఁగా సుస్థిరుఁడుగా నుండును అని యూహింపవచ్చు
ను. ఈ స్థితిని గుణములయందుఁ దన్మయులమయిన
మనము ధైర్యపూర్వకముగఁ గేవల మూహించి గ్రహిం
పఁగలము. అనుభవము చేసికొనఁజాలము. కాని యీ
యూహను దృష్టియం దిడికొని మనము ‘నేను’ అను
భావము ననుదినము క్షీణింపఁజేయుచు నున్నచో నంత
మునకు గుణాతీతుని యవస్థకు సమీపముగఁ జేరి వాని
దర్శనము చేయఁగలము. గుణాతీతుఁడు తన స్థితి నను
భవము చేసికొనుచుండును. వర్ణనము చేయఁజాలఁడు.
ఎవఁడు వర్ణింపఁగలఁడో వాఁడు గుణాతీతుఁడు కాఁడు.
కారణ మేమనఁగా వానియం దహంభావము వెలయు

చున్నది. దేనిని యావన్మంది సహజముగా ననుభవము చేసికొనుచున్నారో, అది శాంతి, ప్రకాశము, ఉపద్రవము - ప్రవృత్తి మఱియు జడత్వము - మోహము నయి యున్నది. గీతయం దనేకస్థానముల సాత్త్వికత గుణాతీతుని యత్యంతసమీపమగు స్థితి యని స్పష్టపఱచఁ బడినది. కాఁబట్టి మనుష్యమాత్రుని ప్రయత్నము సత్త్వగుణమును వికసింపఁ జేసికొనుటకే యయి యుండ నగు. వాఁడు గుణాతీతత్వ మవశ్యము ప్రాప్తించు నను విశ్వాసమును గలిగియుండ నగును.

మాం చ యో ఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. ౨౬

ఎవఁ డేకనిష్ఠాభక్తియోగముచే నా సేవచేయుచున్నాఁడో వాఁ డీగుణముల దాటి బ్రహ్మరూపుఁ డగుటకు యోగ్యుఁ డగుచున్నాఁడు.

బ్రహ్మణో హి ప్రతిష్ఠా ఽహ మమృతస్యావ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ. ౨౭

మఱియు బ్రహ్మాయొక్క స్థితిని నేనే, శాశ్వత మోక్షస్థితిని నేను అట్లనే సనాతనధర్మముయొక్కయు మఱియు నుత్తమసుఖముయొక్కయు స్థితినికూడ నేనే.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే గుణత్రయవిభాగ
యోగోనామ చతుర్దశో ఽధ్యాయః.

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతారూపమగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గతయోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జునసంవాదముయొక్క గుణత్రయవిభాగయోగమను పదునాల్గవ యధ్యాయము ముగిసినది.

౧౫

## పురుషోత్తమయోగము.

ఈ యధ్యాయమునందు భగవానుఁడు క్షరమునకు మఱియు నక్షరమునకుఁ బరమగు తన యుత్తమస్వరూపమును దెలుపుచున్నాఁడు.

శ్రీభగవా నువాచ:—

> ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్,
> ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్. ౧

శ్రీ భగవానుఁడు చెప్పెను: దేనిమూలము పైనఁగలదో, దేని శాఖ క్రిందనున్నదో మఱియు వేదములు దేనికి ఆకులుగానున్నవో యట్టి యవినాశియగు నశ్వత్థ

వృక్షమును బుద్ధిమంతులు వర్ణించియున్నారు; దీని నెవరు
తెలియుచున్నారో వారు వేదము నెఱుంగు జ్ఞానులు.

వ్యాఖ్యానము : 'శ్వః' అనఁగా రేపు. కాఁబట్టి
యశ్వత్థ మనఁగా రేపటివఱకు నిలిచియుండని క్షణిక
సంసారము. ప్రపంచము ప్రతిక్షణమున రూపాంతర
మును జెందుచుండును కావున నది యశ్వత్థము. కాని
యిట్టి స్థితియం దది సర్వదా యుండునది మఱియు
దానిమూల మూర్ధ్వ మనఁగా నీశ్వరుఁడు, అందుచే
నది యవినాశి. దానియందు వేదము లనఁగా ధర్మము
యొక్క శుద్ధజ్ఞానరూపములగు నాకులు లేకున్నచో
నది శోభించదు. ఈ చందమున సంసారముయొక్క
యథార్థ మగు జ్ఞాన మెవ్వనికిఁగలదో మఱియు నెవఁడు
ధర్మము నెఱుంగువాఁడో వాఁడు జ్ఞాని.

**అధశ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా గుణప్రవృద్ధా విషయప్రవాలాః,**
**అధశ్చ మూలా న్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే. ౨**

గుణములయొక్క స్పర్శచే వృద్ధిఁ బొందినట్టి

ము మఱియు విషయరూపములగు చిగురుటాకులు
గలట్టియు నాయశ్వత్థముయొక్క కొమ్మలు క్రిందను పై
ను వ్యాపించియున్నవి; కర్మల బంధనముఁ గావించు
ట్టి దాని వ్రేళ్లు మనుష్యలోకమునఁ గ్రిందను వ్యాపించి
యున్నవి.

వ్యాఖ్యానము: అజ్ఞానిదృష్టియొక్క సంసార
వృక్షవర్ణన మది. పైన నీశ్వరునియందుండు దానిమూల
మును వాఁడు గాంచుటలేదు, కాని విషయములరామణీ
యకతపై ముగ్ధుఁడుగ నుండి మూఁడుగుణములద్వారమున
వృక్షమును బోషించుచున్నాఁడు మఱియు మనుష్య
లోకమునఁ గర్మపాశబద్ధుఁడయి యుండుచున్నాఁడు.

రూపమ స్యేహ తథోపలభ్యతే నాంతో నచాదిర్నచ సంప్రతిష్ఠా,
శ్వత్థ మేనం సువిరూఢమూల మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా. 3
తః పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్ గతా న నివర్తంతి భూయః,
మేవ చాద్యం పురుషం ప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ.

దాని యథార్థస్వరూపము గోచరింపదు. దాని
ంతములేదు, ఆదిలేదు, మూలములేదు. మిక్కిలి

లోతుగాఁ బాతుకొనిపోయిన వేళ్లుగల యీయశ్వత్థ వృక్షమును నసంగరూపమగు బలాఢ్యమగు ఖడ్గముతో ఛేదించి మనుష్యుఁడీ ప్రార్థన చేయనగును: "ఎవఁడు సనాతనప్రవృత్తిని- మాయను- వ్యాపింపఁజేసియున్నాఁడో ఆ యాదిపురుషుని నేను శరణుఁజొచ్చుచున్నాను." మఱియు దేనిని బొందినవారికి మరల జననమరణచక్రమునఁబడుట తప్పిపోవునో, ఆపదమును శోధింపనగును.

వ్యాఖ్యానము : అసంగ మనఁగా నసహాయోగము, వైరాగ్యము. ఎంతవఱకు మనుష్యుఁడు విషయములతో నసహాయోగము చేయఁడో, వాని ప్రలోభనములనుండి దూరముగా నుండఁడో అంతవఱకు వాఁడు వానియందుఁ దగుల్కొనుచునే యుండును. విషయములతోడ నాటాడుచు వాని నంటకుండనుండుట యసంభవమగు విషయమని యీ శ్లోకముయొక్క యాశయము.

నిర్మానమోహా జితసంగదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయంతత్.

ఎవఁడు మానమోహాములఁ ద్యజించియున్నాఁడో, ఎవఁ డాసక్తిచేఁ గలుగు దోషముల దూరమొనరించియున్నాఁడో, ఎవఁ డాత్మయందు నిత్యనిమగ్నుఁడో, ఎవని విషయములు శమించియున్నవో, ఎవఁడు సుఖదుఃఖరూపములగు ద్వంద్వములనుండి ముక్తుఁడో ఆజ్ఞాని యవినాశి యగు పదమును బడయుచున్నాఁడు.

న తద్భాసయతే సూర్యో నశశాంకో నపావకః,
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ. ౬

అచట సూర్యుఁడు, చంద్రుఁడు లేక యగ్ని వెలుతురు నీయఁ బనిలేదు. ఎచటి కరుగువానికిఁ దిరిగి జన్మింపవలసినపని లేదో అది నాపరమధామము.

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః,
మనష్షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. ౭

నాదే యగు సనాతనాంశము జీవలోకమున జీవుఁడయి ప్రకృతియందుండు పంచేంద్రియములను మఱియు మనస్సును నాకర్షించుచున్నది.

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్. ౮

(జీవుఁడయిన ఈనాయంశరూపుఁడగు) ఈశ్వరుఁ డెపుడు శరీరమును ధరించుచున్నాఁడో లేక విడుచుచున్నాఁడో అపుడిది యెట్లు వాయు విరుగుపారుగు మండలమందుండి గంధమును వెంటఁగొనిపోవుచున్నదో అట్లనే (మనస్సుతోడ నింద్రియములను) తీసికొనిపోవుచున్నది.

శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవచ,
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే. ౯

మఱియు నది చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు మఱియు మనస్సు నాశ్రయించి విషయసేవన మొనరించుచున్నది.

వ్యాఖ్యానము : ఇచట విషయశబ్దమున కర్థము బీభత్సవిలాసము గాదు, కాని ప్రత్యేకమగు నింద్రియముయొక్క స్వాభావికక్రియ; ఎట్లనఁ గంటియొక్కయొక్క విషయము చూచుట, చెవికి వినుట, నాలుకకు

రుచిచూచుట. ఈక్రియ లెపుడు వికారములు గలవి-అహంభావము గలవి యగుచున్నవో అపుడు దూషిత ములుగను, బీభత్సములుగను నిశ్చయింపఁబడుచున్నవి. ఎపుడు నిర్వికారములగుచున్నవో అపుడివి నిర్దోషములు. బిడ్డ కంఠతోఁ గాంచుచు లేదా చేతితోఁ దాకుచు వికారమును బొందఁడు, అందుచేఁ గ్రిందిశ్లోకమునఁ జెప్పుచున్నాఁడు.

> ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానంవా గుణాన్వితమ్
> విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః. ౧౦

(శరీరమును) త్యజించునట్టిలేదా దానియందుండు నట్టి లేక గుణముల నాశ్రయించి భోగమును భోగించు నట్టి (ఈయంశరూపుఁడగు నీశ్వరు) ని మూర్ఖులు చూడరు కాని దివ్యచక్షు లగు జ్ఞానులు చూచుచున్నారు.

> యతంతో యోగిన శ్చైనం పశ్యం త్యాత్మ న్యవస్థితమ్,
> యతంతో ఽప్యకృతాత్మానో నైనం పశ్యం త్యచేతసః. ౧౧

యత్న మొనరించు యోగిజనులు తమయందుండు (ఈయీశ్వరు) ని చూచుచున్నారు. ఎవ రాత్మ

శుద్ధిఁ గావించుకొనలేదో యట్టిమూఢజనులు యత్నము
చేయుచుండియుఁ గూడ దీనిని గురుతించుటలేదు.

వ్యాఖ్యానము : ఇందును మఱియుఁ దొమ్మిదవ
యధ్యాయమునందును దురాచారికి భగవానుఁ డేవచ
నమునొసంగియున్నాఁడో దానియందునువిరోధము లేదు.
అకృతాత్ముఁ డనఁగా భక్తిహీనుఁడు, స్వేచ్ఛాచారి,
దురాచారి. ఎవఁడు నమ్రతాపూర్వకముగ శ్రద్ధతో
నీశ్వరుని భజించునో వాఁ డాత్మశుద్ధుఁ డగుచున్నాఁడు
మఱియు నీశ్వరుని గురుతించుచున్నాఁడు. ఎవరు యమ
నియమాదుల లక్ష్యపెట్టక కేవలబుద్ధిప్రయోగము
చే నీశ్వరుని గురుంతింపఁ గోరుచున్నారో ఆయచేత
నులు—చిత్తశూన్యులు, రామరహితులు రాముని
గురుతింపఁజాలరు.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్. ౧౨

సూర్యునియం దుండు నే తేజము సకలజగత్తును

బ్రకాశింపఁ జేయుచున్నదో మఱియు నే తేజస్సు చం
ద్రునియందు మఱియు నగ్నియందుఁ గలదో అది నా దని
తెలియుము.

గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా,
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః. ౧౩

పృథ్వియందుఁ బ్రవేశించి నాశక్తిచే నేను
ప్రాణుల ధరించుచున్నాను, మఱియు రసము నుత్పన్న
ముచేయు చంద్రుఁడనయి సమస్తవనస్పతులఁ బోషించు
చున్నాను.

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్. ౧౪

ప్రాణుల శరీరము నాశ్రయించి జఠరాగ్నినయి
ప్రాణ మఱియు నపాన వాయువుల ద్వారమున నేను
నాలుగువిధములగు నన్నమును జీర్ణముచేయుచున్నాను.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనంచ,
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో వేదాంతకృ ద్వేదవి దేవ చాహం. ౧౫

అందఱి హృదయములయందుండు నాద్వారమున

స్మృతి, జ్ఞానము మఱియు వీని యభావమును నగు
చున్నవి. సమస్తవేదములచేఁ దెలియఁదగినవాఁడను
నేనే, వేదములఁ దెలియువాఁడను నేను, వేదాంతమును
బ్రకటించువాఁడనుగూడ నేనే.

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ,
క్షరస్సర్వాణి భూతాని కూటస్థో౽క్షర ఉచ్యతే. ౧౬

ఈలోకమున క్షరుఁ డనఁగా నశించువాఁడు
మఱియు నక్షరుఁ డనఁగా నవినాశి యగు నిరువురు పురు
షులు కలరు. సకలభూతములు క్షరుఁడు మఱియు వాని
యందు స్థిరుఁ డగు నంతర్యామి నక్షరుఁ డని చెప్పుచు
న్నారు.

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః,
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః. ౧౭

వీరుగాక యుత్తమపురుషుఁ డింకొకఁడు గలఁడు.
వాఁడు పరమాత్ముఁ డనఁబడుచున్నాఁడు. ఈ యవ్య
యుఁ డగు నీశ్వరుఁడు మూఁడులోకములఁ బ్రవేశించి
వానిని బోషించుచున్నాఁడు.

యస్మాత్క్షర మతీతో౽హ మక్షరా దపి చోత్తమః,
అతో౽స్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః. ౧౮

కారణ మేమన నేను క్షరునికంటెఁ బరముగను మఱియు నక్షరుని కంటెఁ గూడ నుత్తముఁడుగను నున్నాను. కాఁబట్టి వేదములందును మఱియు లోకములందును బురుషోత్తముఁ డను నామముతోఁ బ్రఖ్యాతుఁడను.

యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్,
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత. ౧౯

ఓ భారతా! మోహరహితుఁడయి పురుషోత్తముఁడ నగు నన్నీ చందమున నెవఁడు తెలియుచున్నాఁడో వాఁడు సర్వము తెలియుచున్నాఁడు మఱియు నన్నుఁ బూర్ణభావముతో భజించుచున్నాఁడు.

ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయానఘ,
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమా న్స్యాత్కృతకృత్యశ్చ భారత. ౨౦

ఓ యనఘా! ఈ గుహ్యములలో గుహ్యమగు శాస్త్రమును నేను నీకుఁ జెప్పితిని. ఓ భారతా! దీని

నెఱింగి మనుష్యుఁడు బుద్ధిమంతుఁడు గా నగును మఱియుఁ దన జీవితమును సఫలమొనరించుకొననగును.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే పురుషోత్తమ
యోగో నామ పంచదశో ऽధ్యాయః.

---

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భవద్గీతారూపమగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గతయోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జునసంవాదముయొక్క పురుషోత్తమయోగ మను పేరుగల పదునేనవ యధ్యాయము ముగిసినది.

---

## ౧౬

## దైవాసురసంపద్విభాగయోగము.

ఈ యధ్యాయములో దైవీ మఱియు నాసురీసంపదయొక్క వర్ణనము కలదు.

శ్రీభగవానువాచ:—

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్. ౧
అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్,
దయా భూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్. ౨
తేజః క్షమా ధృతిః శౌచ మద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత. 3

శ్రీభగవానుఁడు చెప్పెను : ఓభారతా! అభ

యము, అంతఃకరణశుద్ధి, జ్ఞానమందు మఱియు యోగ
మందు నిష్ఠ, దానము, దమము, యజ్ఞము, స్వాధ్యా
యము, తపస్సు, సరళత్వము, అహింస, సత్యము,
అక్రోధము, త్యాగము, శాంతి, అపైశున్యము, భూత
దయ, అలోలుపత్వము, మృదుత్వము, మర్యాద, అచం
చలత్వము, తేజము, క్షమ, ధృతి, శౌచము, అద్రో
హము, నిరభిమానము—ఇన్నిగుణములు దైవీసంపదతోఁ
బుట్టినవానియం దుండును.

వ్యాఖ్యానము : దమమనఁగా నింద్రియనిగ్రహ
ము, అపైశున్య మనగా నెవనిపైనను చాడీలు చెప్పకుం
డుట, అలోలుపత్వ మనఁగా లాలసను గలిగియుండ
కుండుట—లంపటుఁడు కాకుండుట, తేజ మనఁగాఁ బ్రతి
విధమగు హీనవృత్తిని విరోధించు నావేశము, అద్రోహ
మనఁగా నెవనికిఁ గీడుకోరకుండుట లేక చేయకుండుట.

దంభో దర్పో ఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవచ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపద మాసురీమ్. ౪

దంభము, దర్పము, అభిమానము, క్రోధము, పారుష్యము, అజ్ఞానము, ఓ పార్థా! ఇన్ని ఆసురీసంపదతో జన్మించువారియం దుండును.

వ్యాఖ్యానము : తనయందు లేనిదానిని జూపించుట దంభము, కపటాడంబరము, పాషండత్వము; దర్పమనఁగా బడాయి, పారుష్య మనఁగాఁ గాఠిన్యము.

> దైవీ సంప ద్విమోక్షాయ నిబంధాయా ఽసురీ మతా,
> మాశుచః సంపదం దైవీ మభిజాతో ఽసి పాండవ. ౫

దైవీసంపద మోక్షము నొసంగునది మఱియు నాసురీ (సంపద) బంధనమునఁ బడద్రోయునదని యెంచఁబడినది. ఓపాండవా! నీవు విషాదపడకుము. నీవు దైవీసంపదతో జన్మించియున్నావు.

> ద్వౌ భూతసర్గౌ లోకే ఽస్మిన్ దైవ ఆసుర ఏవచ,
> దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు. ౬

ఈలోకమున రెండుజాతుల సృష్టికలదు : దైవీ మఱియు నాసురీ. ఓపార్థా! దైవీవర్ణనము విస్తారముగాఁ జేసితిని. ఆసురీ (నింక) వినుము.

ప్రవృత్తించ నివృత్తించ జనా నవిదు రాసురాః,
న శౌచం నాపి చాచారో నసత్యం తేషు విద్యతే.  ౭

ప్రవృత్తి యన నేమియో, నివృత్తి యన నేమియో యాసురులకుఁ దెలియదు. అది యేరీతి వారికి శౌచము, ఆచారము మఱియు సత్యములయొక్క జ్ఞానము లేదు.

అసత్య మప్రతిష్ఠంతే జగ దాహు రనీశ్వరమ్,
అపరస్పరసంభూతం కి మన్య త్కామ హైతుకమ్.  ౮

వారు జగత్తు అసత్యము, ఆధారశూన్యము, ఈశ్వరరహితము, కేవలస్త్రీపురుషసంబంధముచేఁ గలిగినది. దానికి విషయభోగముదక్క వేఱొండు హేతు వేమి యుండును ? అని చెప్పుచుందురు.

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో ఽల్పబుద్ధయః,
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతో ఽహితాః.  ౯

భయానకకర్మలు చేయువారు, మందమతులు, దుష్టులు యిట్టి యభిప్రాయమును గలిగియున్న జగత్తుయొక్క శత్రువులు దాని నాశనమునకయి వృద్ధి నొందుచున్నారు.

కామ మాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహాద్గృహీత్వా ఽసద్గ్రాహాన్ ప్రవర్తంతే ఽశుచివ్రతాః. ౧౦

తృప్తిఁ జెందనట్టి కామనలతో నిండియున్నవారు, దంభులు, మానులు, మదాంధులు, అశుభనిశ్చయము గలవారు మోహముచే దుష్టేచ్ఛల గ్రహించి ప్రవృత్తు లగుచున్నారు.

చింతా మపరిమేయాం చ ప్రళయాంతా ముపాశ్రితాః,
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః. ౧౧
ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహంతే కామభోగార్థ మన్యాయేనార్థసంచయాన్. ౧౨

ప్రళయపర్యంత మంతమే లేని యిట్టి యపరిమిత చింత నాశ్రయించి, కామములయొక్క పరమభోగులు, 'భోగమే సర్వస్వము' అని నిశ్చయించువారు, వందల కొలఁదిగనున్న యాశాపాశములఁ దగుల్కొన్నవారు, కాముకులు, క్రోధసంపన్నులు విషయ భోగముల కొఱ కన్యాయపూర్వకముగ ద్రవ్యసంచయము చేయుచున్నారు.

ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇద మ స్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్. ౧౩
అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరా నపి,
ఈశ్వరో ఽహ మహం భోగీ సిద్ధో ఽహం బలవాన్ సుఖీ. ౧౪
ఆఢ్యో ఽభిజనవా నస్మి కో ఽన్యో ఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇ త్యజ్ఞానవిమోహితాః. ౧౫
అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకే ఽశుచౌ. ౧౬

నేఁడు నే నిది పొందితిని. ఈ మనోరథము (నిపుడు) పూర్తిఁ జేయుదును, ఇంత ధనము నాయొద్ద నున్నది. మరల రేపు మఱింత నాది యగును. ఈ శత్రువును జంపితిని, రెండవవానిని గూడఁ జంపెదను, నేను సర్వసంపన్నుఁడను, భోగిని, సిద్ధుఁడను, బలాఢ్యుఁడను, సుఖిని, (శ్రీ)మంతుఁడను, కులీనుఁడను, నాకు సమానుఁడిం కెవఁడు గలఁడు? నేను యజ్ఞము చేయుదును, దానము చేయుదును, ఆనందము ననుభవించెదను; ఇట్లజ్ఞానముచే మూఢులయినవారు భావించుచుందురు. మఱియు

భ్రాంతులలోఁ బడి, మోహజాలమునఁ దగుల్కొని, విషయభోగముల మత్తెక్కి అశుభనరకమునఁ బడు చున్నారు.

ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజంతే నామ యజ్ఞైస్తే దంభే నావిధిపూర్వకమ్. ౧౭

తమ్ము గొప్పవారిగ భావించువారు, అభిమాను (స్తబ్ధులు)లు మఱియు మానమదోన్మత్తులు (వీరు) దంభముచేతను మఱియు విధిరహితములగు నామమాత్రము లయినట్టియే యజ్ఞములు చేయుచున్నారు.

అహంకారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః,
మమాత్మపరదేహేషు ప్రద్విషంతో ఽభ్యసూయకాః. ౧౮

అహంకారమును, బలమును, గర్వమును, కామమును మఱియుఁ గ్రోధమును నాశ్రయించువారు, నింద చేయువారు వారియందును మఱియుఁ నితరులయందును నుండు నన్ను ద్వేషించువారు.

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు. ౧౯

ఈ నీచులను, ద్వేషులను, క్రూరులను, అమంగళనరాధములను నే నీసంసారమందలి యత్యంతమగు నాసురయోనియందే మాటిమాటికిఁ బడవేయుచున్నాను.

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని,
మా మప్రాప్యైవ కౌంతేయ తతో యాం త్యధమాం గతిం.౨౦

ఓ కౌంతేయా! జన్మజన్మమందు నా సురయోనిని బొంది మఱియు నన్నుఁ బొందకుండుటచే నీమూఢు లింతకంటెఁగూడ నధికమగు నధమగతినిబొందుచున్నారు.

త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్.

కామము, క్రోధము మఱియు లోభము నాత్మను నాశన మొనరించు త్రివిధములగు నరకద్వారములు. కాఁబట్టిమనుష్యుఁ డీమూఁడింటిని బరిత్యజింపవలయును.

ఏతై ర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభి ర్నరః,
ఆచర త్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్. ౨౨

ఓకౌంతేయా! ఈ త్రివిధములగు నరకద్వార

ములనుండి దూరముగానుండు మనుష్యుఁ డాత్మకల్యాణము నాచరించుచున్నాఁడు, మఱియు నిందుచేఁ బరమగతిని బొందుచున్నాఁడు.

> యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః,
> న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్. ౨౩

ఏమనుష్యుఁడు శాస్త్రవిధిని విడిచి స్వేచ్ఛగా భోగములయందు లీనుఁ డగుచున్నాఁడో వాఁడు సిద్ధిని బొందుట లేదు. సుఖమును బొందఁడు. పరమగతిని బొందఁడు.

వ్యాఖ్యానము: శాస్త్రవిధి కర్మము ధర్మముయొక్క పేరుతో నాదరింపఁబడు గ్రంథములయందుఁ జెప్పఁబడిన యనేకములగు క్రియలుగాదు, కాని యనుభవజ్ఞానసంపన్నులగు సత్పురుషులచేఁ జూపఁబడిన సంయమమార్గము.

> తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ,
> జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి. ౨౪

కాఁబట్టి కార్యమును మఱియు నకార్యమును నిర్ణయించుటలో నీవు శాస్త్రమును బ్రమాణముగా నంగీకరింపవలయును. శాస్త్రవిధి యన నేమియో తెలిసి యిచటఁ గర్మ సేయు టుచితము.

వ్యాఖ్యానము: పైనఁ జెప్పఁబడిన యర్థమే యిచటఁగూడ శాస్త్రమునకును నయియున్నది. ఎల్లరు తమకుఁ దాము సొంతముగ నియమముల నేర్పరచుకొని స్వేచ్ఛాచారులు కారాదు, కాని ధర్మానుభవసంపన్నుని వాక్యమును బ్రమాణముగ నొప్పవలయును. ఇది యీ శ్లోకమున కాశయము.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసురసంప
ద్విభాగయోగో నామ షోడశో౽ధ్యాయః.



ఓంతత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతారూపమగు నుపనిషత్తు అనఁగా బ్రహ్మవిద్యాంతర్గతయోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జునసంవాదముయొక్క దైవాసురసంపద్విభాగయోగ మను పేరుగల పదునాఱవ యధ్యాయము ముగిసినది.

---

## ౧౭

# శ్ర ద్ధా త్ర య వి భా గ యో గ ము.

శాస్త్రమనఁగా శిష్టాచారమును బ్రమాణముగ నొప్పవలయు నని విని నర్జునునకు-ఎవఁడు శిష్టాచారము నొప్పఁజాలఁడో కాని శ్రద్ధాపూర్వకముగ నాచరించునో వాని కెట్టిగతి కలుగును? అను సంశయము కలిగెను. ఈయధ్యాయమందు దీనికిఁ బ్రత్యుత్తర మొసంగు ప్రయత్నము కలదు. కాని శిష్టాచారరూపమగు దీపస్తంభమును విడిచివేసినపిమ్మట శ్రద్ధయుం దుభయములు కలుగుట యుండు నని చెప్పి భగవానుఁడు సంతుష్టుఁడయ్యెను. మఱియు నిందుచే శ్రద్ధ మఱియుదానియా

ధారముపైన జరుగుయజ్ఞము, తపము, దానము మున్నగు వాని గుణముల ననుసరించి మూఁడు భాగములొనరించి చూపించెను మఱియు 'ఓంతత్ సత్' యొక్కమహిమను గానముచేసియున్నాఁడు.

అర్జున ఉవాచ:—

యే శాస్త్రవిధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయాన్వితాః,
తేషాం నిష్ఠాతు కా కృష్ణ సత్త్వ మాహో రజ స్తమః. ౧

అర్జునుఁడు చెప్పెను : ఓ కృష్ణా! శాస్త్రవిధి ననఁగా శిష్టాచారమును లక్ష్యపెట్టక యెవరు కేవల శ్రద్ధతోడనే పూజాదులు చేయుచున్నారో వారి గతి యెట్టి దగుచున్నది? సాత్త్వికమా, రాజసమా లేక తామసమా?

శ్రీభగవా నువాచ:—

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా,
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు. ౨

శ్రీభగవానుఁడు చెప్పెను : మనుష్యులలో స్వభావముచేతనే మూఁడువిధములగు శ్రద్ధ యనఁగా

సాత్త్వికము, రాజసము మఱియుఁ దామసముగ నున్నది. అది నీవు వినుము.

> సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
> శ్రద్ధామయో ఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః. ౩

ఓ భారతా! ఎల్లరిశ్రద్ధ తనస్వభావము ననుసరించుచున్నది. మనుష్యునియందుఁ గొంచెమో గొప్పయో శ్రద్ధ యుండుచునే యున్నది. ఎవనిశ్రద్ధ యెట్లుండునో వాఁ డట్లగుచున్నాఁడు.

> యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః,
> ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజంతే తామసా జనాః. ౪

సాత్త్వికులు దేవతల భజించుచున్నారు, రాజసులు యక్షులను మఱియు రాక్షసులను భజించుచున్నారు, మఱియు నన్యులగు తామసులు భూతప్రేతాదుల భజించుచున్నారు.

> అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః,
> దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః. ౫

కర్షయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః,
మాం చైవాంతశ్శరీరస్థం తాన్ వి ద్ధ్యాసురనిశ్చయాన్. ౬

దంభము మఱియు నహంకారముఁగలవారయి కామము మఱియు రాగబలప్రేరితులయి యెవరుశాస్త్రీయవిధిరహితమగు ఘోరతప మొనరించుచున్నారో ఆ మూఢులు శరీరమునందుండు పంచమహాభూతములకు మఱియు నంతఃకరణమున వెలయు నాకుఁ గూడ కష్టమును గలిగించుచున్నారు. ఇట్టివారి నాసురీ నిశ్చయముగలవారినిగా నెఱుంగుము.

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః,
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు. ౭

ఆహారముసయితము మూఁడువిధములుగఁ బ్రియమగుచున్నది. అదియేరీతి యజ్ఞము, తపస్సు మఱియు దానము (కూడ మూఁడువిధములచేఁ బ్రియమగుచు)న్నది. దాని యీభేదమును నీవు వినుము.

ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః,
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః.౮

ఆయుష్యమును, సాత్త్వికతను, బలమును, ఆరోగ్యమును, సుఖమును మఱియు రుచిని బెంపొందించునట్టియు, రసవంతములును, స్నిగ్ధములును, పౌష్టికములును మఱియు మనస్సునకు రుచికరములును నగు నాహారములు సాత్త్వికులకుఁ బ్రియములగుచున్నవి.

కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః.　　౯

కారముగను, పులుపుగను, ఉప్పగను, మిక్కిలి వేడిగను, గాటుగను, కఠినము (రూక్షము)గను, దాహకారకముగను నుండునట్టి యాహారములు రాజసులగు వారికిఁ బ్రియము లగుచున్నవి, మఱియు నవి దుఃఖమును శోకమును మఱియు రోగమును నుత్పన్నము చేయునవిగ నున్నవి.

యాతయామం గతరసం పూతి పర్యుషితంచ యత్,
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్.　　౧౦

జాముసేపటినుండి పడియున్నట్టియు, నీరసమును,

దుర్గంధితమును, చద్దిదియు, ఎంగిలిదియు నగు నపవిత్ర భోజనము తామసజనులకుఁ బ్రియమగుచున్నది.

అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్య మేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః. ౧౧

దేనియందు ఫలేచ్ఛ లేదో, ఏది విధిపూర్వకముగఁ గర్తవ్య మని గ్రహించి, మనస్సును దానియందు సంలగ్న మొనరించి చేయఁబడుచున్నదో ఆయజ్ఞము సాత్త్వికము.

అభిసంధాయ తు ఫలం దంభార్థ మపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్. ౧౨

ఓ భరతశ్రేష్ఠా! ఏది ఫలోద్దేశ్యముచేతను మఱియుఁ దోడనే దంభముచే నగుచున్నదో ఆయజ్ఞమును రాజసముగాఁ దెలియుము.

విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. ౧౩

ఎందు విధిలేదో, అన్నోత్పత్తి లేదో, మంత్రము లేదో, త్యాగము లేదో, శ్రద్ధ లేదో ఆయజ్ఞమును బుద్ధిమంతులు తామసయజ్ఞ మని చెప్పుచున్నారు.

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్,
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే. ౧౪

దేవతలు, బ్రాహ్మణులు, గురువులు మఱియు జ్ఞానుల యొక్క పూజ, పవిత్రత, సరళత, బ్రహ్మచర్యము, అహింస యివి శారీరకతప స్సని చెప్పఁబడు చున్నవి.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచ యత్,
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే. ౧౫

దుఃఖమునొసంగనిది, సత్యము, ప్రియము, హితకరవచనములు మఱియు ధర్మగ్రంథాభ్యాసము నివి వాచికతపస్సని చెప్పఁబడుచున్నవి.

మనఃప్రసాదః సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః,
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే. ౧౬

మనస్సుయొక్క ప్రసన్నత, సౌమ్యత, మౌనము, ఆత్మసంయమము, భావనాశుద్ధి యివి మానసికతపస్సని చెప్పఁబడుచున్నవి.

శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్త్రివిధం నరైః,
అఫలాకాంక్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే. ౧౭

సమభావయుక్తులగు పురుషు లెపుడు ఫలేచ్ఛను ద్యజించి పరమశ్రద్ధాపూర్వకముగా నీ మూఁడువిధము లగు తపస్సును జేయుచున్నారో అపుడు దానిని బుద్ధిమంతులు సాత్త్వికతప స్సని చెప్పుచున్నారు.

సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్,
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్. ౧౮

ఏది సత్కారము, మానము మఱియుఁ బూజనిమిత్తము దంభపూర్వకముగా నగుచున్నదో ఆయస్థిరమును మఱియు ననిశ్చితమును నగు తపస్సు రాజస మని చెప్పఁబడుచున్నది.

మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా త త్తామస ముదాహృతమ్. ౧౯

ఏది కష్టపడి, దురాగ్రహపూర్వకముగ లేక పరునినాశనమునకయి చేయఁబడుచున్నదో అది తామస తప స్సని చెప్పఁబడుచున్నది.

దాతవ్య మితి యద్దానం దీయతే ఽనుపకారిణే,
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్. ౨౦

ఇచ్చుట యుచిత మని గ్రహించి, ప్రత్యుపకారము లభించు నను నాశ లేకుండ దేశ, కాల, పాత్రలఁ జూచి చేయఁబడు దానము సాత్త్విక దాన మని చెప్పఁబడి నది.

యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః,
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్. ౨౧

ఏ దానము ప్రత్యుపకారము లభించునిమిత్తము లేదా ఫలము నుద్దేశించి దుఃఖముతో నీయఁబడుచు న్నదో అది రాజసదాన మని చెప్పఁబడినది.

అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్. ౨౨

దేశ, కాల, పాత్రల విచారింపకుండ, మానము లేకుండ, తిరస్కారముతో నీయఁబడిన దానము తామస మని చెప్పఁబడుచున్నది.

అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతంచ యత్,
అస దిత్యుచ్యతే పార్థ నచ త త్ప్రేత్య నో ఇహ. ౨౮

ఓ పార్థా! ఏయజ్ఞము, దానము, తపస్సు లేక యితరకార్యము శ్రద్ధలేకుండఁ జేయఁబడునో అది అసత్ అని చెప్పఁబడుచున్నది. అది యిచటఁగాని పరలోకమునఁగాని యుపయోగించునది కాదు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయ
విభాగయోగో నామ సప్తదశో ఽధ్యాయః.

---

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతారూపములగు నుపనిషత్తు లనఁగా బ్రహ్మవిద్యాంతర్గతయోగశాస్త్రమందలి శ్రీకృష్ణార్జునసంవాదముయొక్క శ్రద్ధాత్రయవిభాగయోగ మను పేరుగల పదునేడవ యధ్యాయము ముగిసినది.

---

# ౧౮

## సన్న్యాసయోగము.

ఈ యధ్యాయము నుపసంహారరూపముగ భావిం పవచ్చును. దీనియొక్కగాని గీతయొక్కగాని పేరికి మాత్రము "సకలధర్మములఁ ద్యజించి నాశరణుఁ జొచ్చుము." అనునదే యని చెప్పవచ్చును. ఇది యథార్థమగు సన్న్యాసము. కాని సకలధర్మత్యాగ మనఁగా సర్వకర్మత్యాగము గాదు. పరోపకారకర్మలయందుఁ గూడ సర్వోత్కృష్టములగు కర్మల వాని కర్పించుట మఱియు ఫలేచ్ఛను ద్యజించుట యిది సర్వధర్మత్యాగము లేదా సన్న్యాసము.

ఓ పార్థా! ఈకర్మలను సయితమాసక్తిని మఱియు ఫలేచ్ఛను ద్యజించి చేయవలయును. ఇట్లు నానిశ్చితమగు నుత్తమాభిప్రాయము.

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః. ౭

నియతకర్మత్యాగ ముచితము గాదు. మోహవశమున నయ్యది త్యజింపఁబడుచో నాత్యాగము తామసముగఁ దలంపఁబడుచున్నది.

దుఃఖ మిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్,
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్. ౮

దుఃఖకారక మని తలంచి, కాయకష్టభయముచే నెవఁడు కర్మను ద్యజించుచున్నాఁడో అది రాజసత్యాగము మఱియు నందుచే వానికిఁ ద్యాగఫలము లభింపదు.

కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతే ఽర్జున,
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః. ౯

ఓ యర్జునా! చేయవలయునని తలంచి యే నియతకర్మ సంగమును మఱియు ఫలమును ద్యజించి

చేయఁబడుచున్నదో ఆత్యాగమే సాత్త్విక మని భావింపఁబడినది.

న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. ౧౦

సంశయరహితుఁడయినవాఁడును, శుద్ధభావన గలవాఁడును, త్యాగియును మఱియు బుద్ధిమంతుఁడును నకుశలమగు కర్మను ద్వేషింపఁడు, కుశలమగు దానియందు లీనుఁడు గాఁడు.

నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః,
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే. ౧౧

కర్మను నిశ్శేషముగఁ ద్యజించుట దేహధారికి సంభవము గాదు. కాని యెవఁడు కర్మఫలమును ద్యజించునో వాఁడు త్యాగి యనఁబడుచున్నాఁడు.

అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్,
భవత్యత్యాగినాం ప్రేత్య నతు సన్న్యాసినాం క్వచిత్. ౧౨

త్యాగము చేయనివాని కర్మయొక్క ఫలము కాలాంతరమున మూఁడువిధములుగ నగుచున్నది: అను

భము, శుభము మఱియు శుభాశుభము. త్యాగి(సన్న్యాసి) యయిన వాని కెన్నఁడును గలుగదు.

పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్. ౧౩

ఓ మహాబాహూ! సకలకర్మల సిద్ధివిషయమయి సాంఖ్యశాస్త్రమునందయిదు కారణములు చెప్పఁబడి నవి. వానిని నావలన వినుము.

అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్. ౧౪

అయిదు నివి: క్షేత్రము, కర్త, భిన్నభిన్నములగు సాధనములు, భిన్నభిన్నక్రియలు మఱియు నైదవది దైవము.

శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః. ౧౫

శరీరము, వాక్కు మఱియు మనస్సుచే మనుష్యుఁడే కర్మను నీతిసమ్మతముగఁ గాని నీతివిరుద్ధముగఁ

కర్మప్రేరణమున మూఁడుతత్త్వములు వెలయుచున్నవి: జ్ఞానము, జ్ఞేయము మఱియుఁ బరిజ్ఞాత. కర్మాంగములు మూఁడువిధము లయియున్నవి: ఇంద్రియములు, క్రియ మఱియుఁ గర్త.

వ్యాఖ్యానము: ఇందు విచారముయొక్కయు నాచారముయొక్కయు సవిస్తరణము గలదు. తెలుపు మనుష్యుఁడు కర్తవ్యకర్మ (జ్ఞేయము)ను, దానివిధి (జ్ఞానము)ని దెలియుచున్నాఁడు - పరిజ్ఞాత యగుచున్నాఁడు. ఈకర్మప్రేరణయొక్క ప్రకారమునను నితఁడు వాఁడి యింద్రియముల (కరణములు) ద్వారమునఁ గ్రియనుఁ గర్త యగుచున్నాఁడు. ఇది కర్మసంగ్రహము.

జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః

ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ౧౯

జ్ఞానము, కర్మ మఱియుఁ గర్త గుణభేదము ననుసరించి మూఁడు విధములు. అవి గుణగణనయం దెట్లు వర్ణింపఁబడినవో అట్లు వినుము.

సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే,
అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్. ౨౦

దేనిద్వారమున మనుష్యుఁడు సమస్తభూతములయం దొకే యవినాశిభావమును మఱియు భిన్నత్వమునం దేకత్వమును జూచుచున్నాఁడో దానిని సాత్త్వికజ్ఞానముగా నెఱుంగుము.

పృథక్త్వేన తు యజ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్,
వేత్తి సర్వేషు భూతేషు తజ్జ్ఞానం విద్ధి రాజసమ్. ౨౧

భిన్నభిన్నముగా (చూచుటకు) నుండుటచే సమస్తభూతములయందు దేని ద్వారమున మనుష్యుఁడు భిన్నభిన్నములగు విభక్తిభావములఁ గాంచుచున్నాఁడో ఆజ్ఞానమును రాజస మని తెలియుము.

యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్,
అతత్త్వార్థవదల్పంచ తత్తామసముదాహృతమ్. ౨౨

దేనిచే నొక్క కార్యమం దే కారణము లేకుండఁగనే యన్నింటియొక్క భాసము కలుగుచున్నదో, ఏది

పహాస్యరహితమును, మఱియుఁ దుచ్ఛమో అది తామసజ్ఞాన మని చెప్పఁబడుచున్నది.

నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్,
అఫలప్రేప్సునా కర్మ యత్త త్సాత్త్విక ముచ్యతే. ౨౩

ఫలేచ్ఛారహితుఁడగు పురుషునిచే నాసక్తియు మఱియు రాగద్వేషములును లేకుండఁ జేయఁబడిన నియతకర్మ సాత్త్విక మని చెప్పఁబడుచున్నది.

వ్యాఖ్యానము : ౩ అధ్యా. ౮ వ శ్లో. పిమ్మట వ్యాఖ్య చూడుఁడు.

యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః,
క్రియతే బహులాయాసం త ద్రాజస ముదాహృతమ్. ౨౪

భోగేచ్ఛను గలిగియుండువాఁడు కార్యమును 'నేను చేయుచున్నాను' అనుభావముతో మిక్కిలి యాయాసపూర్వకముగాఁ జేయుచున్నాఁడో అది రాజస మని చెప్పఁబడుచున్నది.

అనుబంధం క్షయం హింసా మనవేక్ష్య చ పౌరుషమ్,
మోహా దారభ్యతే కర్మ త త్తామస ముదాహృతమ్. ౨౫

ఏకర్మను పరిణామముయొక్కయు, హానియొక్కయు, హింసయొక్కయు మఱియుఁ దనశక్తియొక్కయు నాలోచన లేకయే మనుష్యుఁ డారంభించుచున్నాఁడో అది తామసకర్మ యని చెప్పఁబడుచున్నది.

ముక్తసంగో ఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః,
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే. ౨౬

ఎవఁ డాసక్తియు మఱియు నహంకారమును లేనివాఁడో, ఎవనియందు దృఢత మఱియు నుత్సాహమును గలవో, ఎవఁడు సఫలతావిఫలతలయందు హర్షశోకముల నొందఁడో వాఁడు సాత్త్వికకర్త యనఁబడుచున్నాఁడు.

రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః,
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః. ౨౭

రాగియు, కర్మఫలేచ్ఛగలవాఁడును, లోభియు, హింసించువాఁడును, మలినుఁడును, హర్షము మఱియు శోకముగలవాఁడును రాజసకర్త యని చెప్పఁబడుచున్నాఁడు.

అయుక్తః ప్రాకృతః స్తబ్ధ శ్శఠో నైష్కృతికో ఽలసః,
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే. ౨౮

అవ్యవస్థితుఁడును, అసంస్కారియును, వదరుఁబోతు (జడుఁడు లేక స్తబ్ధుఁడు) ను, శఠుఁడును, నీచుఁడును, అలసుఁడును, అప్రసన్నచిత్తుఁడును మఱియు దీర్ఘసూత్రియు నగువాఁడు తామసకర్త యనఁబడుచున్నాఁడు.

బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు,
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ. ౨౯

ఓ ధనంజయా! బుద్ధికిని ధృతికిని గుణముల ననుసరించి మూఁడువిధములగు భేదములను నిశ్శేషముగను, వేర్వేరుగను జెప్పుచున్నాను, వానిని వినుము.

ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే,
బంధం మోక్షంచ యా వేత్తి బుద్ధి స్సా పార్థ సాత్త్వికీ. ౩౦

ప్రవృత్తి, నివృత్తి, కార్యము, అకార్యము, భయము, అభయము, బంధము, మోక్షము నే బుద్ధి

(ఉచితరీతి) తెలియుచున్నదో అది సాత్త్వికబుద్ధి యని చెప్పఁబడుచున్నది.

యయా ధర్మ మధర్మంచ కార్యం చాకార్యమేవ చ,
అయథావ త్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ. ౩౧

ఏబుద్ధి ధర్మముయొక్కయు, అధర్మముయొక్కయు మఱియుఁ గార్యముయొక్కయు, అకార్యముయొక్కయు వివేకమును జెడురీతి నిశ్చయించుచున్నదో ఆ బుద్ధియో పార్థా! రాజసము.

అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసా వృతా,
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ. ౩౨

ఓ పార్థా! ఏబుద్ధి యంధకారముచే నావృతమయియున్నదో, అధర్మమును ధర్మముగఁ దలంచుచున్నదో, అన్నివిషయముల విపరీతముగనే చూచుచున్నదో అది తామసము.

ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః,
యోగే నావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ. ౩౩

ఏయేకనిష్ఠాధృతిచే మనుష్యుఁడు మనస్సు, ప్రాణము మఱియు నింద్రియములయొక్క క్రియను సామ్యబుద్ధితో ధరించుచున్నాఁడో ఆధృతి యో పార్థా! సాత్త్వికము.

యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ రాజసీ.     ౩౪

ఓ పార్థా! ఏధృతిచే మనుష్యుఁడు ఫలాకాంక్షి యయి ధర్మమును, కామమును మఱియు నర్థమును నాసక్తిపూర్వకముగ ధరించుచున్నాఁడో ఆధృతి రాజసము.

యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ,
న విముంచతి దుర్మేధా ధృతి సా పార్థ తామసీ.     ౩౫

ఏధృతిచే దుర్బుద్ధియగు మనుష్యుఁడు నిద్రను, భయమును, శోకమును, నిరాశను మఱియు మదమును విడఁజాలఁడో అది యోపార్థా! తామసధృతి.

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ,
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతంచ నిగచ్ఛతి.     ౩౬

యత్త దగ్రే విష మివ పరిణామే ఽమృతోపమమ్,
త త్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్. ౩౭

ఓ భరతర్షభా ! ఇంక మూఁడువిధములగు సుఖముయొక్క వర్ణనము నావలన వినుము. దేనియభ్యాసముచే మనుష్యుఁడు ప్రసన్నుఁడుగ నుండునో, దేనిచే దుఃఖమంతమగుచున్నదో, ఏది యారంభమున విషసమానముగఁ దోఁచునో పరిణామమం దమృతతుల్యముగ నుండునో, ఏదియాత్మజ్ఞానముయొక్క ప్రసన్నతలోనుండి యుత్పన్నమగుచున్నదో అది సాత్త్వికసుఖ మని చెప్పఁబడుచున్నది.

విషయేంద్రియసంయోగా ద్య త్త దగ్రే ఽమృతోపమం,
పరిణామే విష మివ త త్సుఖం రాజసం స్మృతం. ౩౮

విషయములయొక్కయు మఱియు నింద్రియములయొక్క సంయోగముచే నేది యారంభమునం దమృతసమానముగఁ దోఁచునో కాని పరిణామమందు విషప్రాయముగ నగుచున్నదో ఆసుఖము రాజస మని చెప్పఁబడినది.

యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః,
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతం.　　౩౯

ఏది యారంభమందును మఱియుఁ బరిణామమందును నాత్మను మోహగ్రస్త మొనరించునదయి యున్నదో మఱియు నిద్ర, ఆలస్యము మఱియుఁ బ్రమాదమునుండి యుత్పన్నమయినదో, అది తామససుఖ మని చెప్పఁబడుచున్నది.

న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః,
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్త్రిభిర్గుణైః.　　౪౦

ప్రకృతినుండి యుత్పన్నములయిన యీమూఁడు గుణములనుండిముక్తమయిన దేదియుఁ బృథ్వియందును, స్వర్గమందును మఱియు దేవతలమధ్యమునను లేదు.

బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః.　　౪౧

ఓ పరంతపా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకర్మలు సయితము వారిస్వభావజన్యములగు గుణములచే విభజింపఁబడినవి.

శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజం. ౪౨

శమము, దమము, తపస్సు, శౌచము, క్షమ, సరళత్వము, జ్ఞానము, అనుభవము, ఆస్తిక్యము యివి బ్రాహ్మణుని స్వభావజన్యకర్మలు.

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చా ప్యపలాయనం,
దాన మీశ్వర భావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్. ౪౩

శౌర్యము, తేజము, ధృతి, దక్షత, యుద్ధమున వెనుకంజవేయకుండుట, దానము, రాజ్యకర్తృత్వము యివి క్షత్రియుని స్వభావజన్యకర్మలు.

కృషిగోరక్ష్యవాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం,
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం. ౪౪

సేద్యము, గోరక్షణము, వ్యాపారము యివి వైశ్యుని స్వభావజన్యకర్మలు. మఱియు శూద్రుని స్వభావజన్యకర్మ సేవ.

స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విందతి త చ్ఛృణు. ౪౫

స్వయముగాఁ దనకర్మయందు రతుఁడుగ నుండి పురుషుఁడు మోక్షమును బడయుచున్నాఁడు. తనకర్మయందు రతుఁడుగనుండి మనుష్యుఁ డెట్లు మోక్షమును బొందుచున్నాఁడో అది వినుము.

యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతం,
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః.　　౪౬

ఎవనిచేఁ బ్రాణులప్రవృత్తి జరుగుచున్నదో మఱియు నెవనిద్వారమున సమస్తము వ్యాప్తమయి యున్నదో వాని నేపురుషుఁడు స్వకర్మచే భజించుచున్నాఁడో వాఁడు మోక్షమును బొందుచున్నాఁడు.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్,
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషం.　　౪౭

పరధర్మము సుకరమయినప్పటికిని గూడ దానికంటె విగుణమయిన స్వధర్మ మధిక శ్రేష్ఠము. స్వభావానురూపముగఁ గర్మసేయు మనుష్యుని పాపముంటదు.

వ్యాఖ్యానము : స్వధర్మ మనఁగాఁ దనకర్తవ్యము.

గీతాశిక్షయొక్క మధ్యబిందువు కర్మఫల త్యాగము, మఱియు స్వకర్మకంటె నధికోత్తమకర్తవ్యము వెదకుటచేఁ ఫలత్యాగమునకు స్థానముండదు, కావున స్వధర్మము ను శ్రేష్ఠ మని చెప్పియున్నాఁడు. సకలధర్మ ఫలము దానిని బాలించుటయందే వచ్చివేయుచున్నది.

సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్,
సర్వారంభాహి దోషేణ ధూమే నాగ్ని రివావృతాః. ౪౮

ఓకౌంతేయా! స్వభావముచేఁ బ్రాప్తమగు కర్మ దోషయుత మయియున్నప్పటికిని గూడ విడువరాదు. ఏచందమున నగ్నితోఁ బాటు పొగయొక్క సంయోగము కలదో ఆరీతిగనే కర్మలతోడ దోషములు వెలయుచునే యుండును.

అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః,
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి. ౪౯

ఎవఁడు సర్వత్రనుండి యాసక్తిని లాగివైచియున్నాఁడో, ఎవఁడు కామనలఁ ద్యజించివైచెనో, ఎవఁడు

మనస్సును జయించెనో వాఁడు సన్న్యాసముద్వారమున నిష్కామరూపమగు పరమసిద్ధిని బడయుచున్నాఁడు.

> సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథా ౽౽ప్నోతి నిబోధ మే,
> సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా. ౫౦

ఓ కౌంతేయా ! సిద్ధిప్రాప్తించిన పిదప మనుష్యుఁడు బ్రహ్మానేచందమునఁ బొందుచున్నాఁడో అది నావలనఁ గ్లుప్తముగా వినుము. జ్ఞానపరాకాష్ఠ యదియే.

> బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ,
> శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ. ౫౧
> వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః,
> ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః. ౫౨
> అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్,
> విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే. ౫౩

ఎవనిబుద్ధి శుద్ధమయినదో యట్టియోగి ధృతిపూర్వకముగఁ దన్ను వశ మొనరించుకొని, శబ్దాదివిషయములఁ ద్యజించి, రాగద్వేషముల జయించి, ఏకాంతసేవన మొనరించి, అల్పాహారముఁ జేసి, వాక్కును, కా

యమును మఱియు మనస్సును స్వాధీనమునం దుంచుకొని, ధ్యానయోగమందు నిత్యముపరాయణుఁడుగనుండి, వైరాగ్యము నాశ్రయించి, అహంకారమును, బలమును, దర్పమును, కామమును, క్రోధమును మఱియుఁ బరిగ్రహమును బరిత్యజించి, మమత్వరహితుఁడును మఱియు శాంతుఁడును నయి బ్రహ్మభావమును బొంద నర్హుఁడగుచున్నాఁడు.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి న కాంక్షతి,
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్. ౫౪

బ్రహ్మభావమునకుఁ బ్రాపించిన ప్రసన్నచిత్తుఁడగు మనుష్యుఁడు శోకింపఁడు, ఏమియుఁ గోరఁడు; సకలభూతములందు సమభావమును గలిగియుండి నాపరమభక్తిని బడయుచున్నాఁడు.

భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః,
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్. ౫౫

నే నెట్లున్నాను మఱియు నెవఁడను, దీనిని భక్తిచే వాఁడు యథార్థముగఁ దెలియుచున్నాఁడు, మఱియు

నీరీతి నన్ను యథార్థముగఁ దెలిసి నాయందుఁ బ్రవేశించు
చున్నాఁడు.

సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః,
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్. ౫౬

నాయాశ్రయమును బరిగ్రహించువాఁడు సదా సర్వకర్మలఁ జేయుచుండియుఁ గూడ నాకృపచే శాశ్వతమును, అవ్యయమును నగు పదమును బొందుచున్నాఁడు.

చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః,
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ. ౫౭

మనస్సుచే సమస్తకర్మల నాయం దర్పణము చేసి, నాయందుఁ బరాయణుఁడవయి, వివేకబుద్ధి నాశ్రయించి నిరంతరము నాయందుఁ జిత్తమును లగ్నమొనరించుము.

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి,
అథచే త్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినంక్ష్యసి. ౫౮

నాయందుఁ జిత్తమును లగ్నమొనరించుటచేఁ గష్టములయొక్క సమస్త పర్వతముల నాకృపచే దాటి

పోవుదువు. కాని యహంకారమునకు వశుఁడవయి నామాట వినకుందువేని నశించిపోయెదవు.

య దహంకార మాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి. ౫౯

అహంకారమునకు వశుఁడవయి నేను యుద్ధము చేయను? అని భావింతువేని యీ నీ నిశ్చయము మిథ్య. నీస్వభావమే నిన్నావంకకు బలాత్కారముగా నీడ్చుకొనిపోవును.

స్వభావజేన కౌంతేయ నిబద్ధ స్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్. ౬౦

ఓకౌంతేయా! నీస్వభావజన్యమగు కర్మచే బద్ధుఁడవయియుండుటచే నీవు దేనిని మోహమునకు వశుఁడవయి చేయఁగోరుట లేదో దానిని పరతంత్రుఁడవయి చేయుదువు.

ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.

ఓ యర్జునా! ఈశ్వరుఁడు సకలప్రాణులహృద

యమున వాసము చేయుచున్నాఁడు. మఱియుఁ దన మాయాబలముచే వానిని సారెపై నెక్కిన కుండవలెఁ ద్రిప్పుచున్నాఁడు.

త మేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదా త్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం. ౬౨

ఓ భారతా! నీవు సర్వభావములచే వాని శరణుఁ బొందుము. వాని కృపచేఁ బరమశాంతిమయమగు నమరపదమును బొందుదువు.

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా,
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు. ౬౩

ఈ చందమున గుహ్యములలో గుహ్యమగు జ్ఞానమును నేను నీకుఁ జెప్పితిని. దీని నంతను బాగుగా విచారణచేసి నీ కేది బాగుండునో అది చేయుము.

సర్వగుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః,
ఇష్టో ఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్. ౬౪

మఱియు నన్నింటికంటె గుహ్యమయిన నా

పరమవచనముల నాలించుము. నీవు నాకు మిక్కిలి ప్రియుఁడవు. కాఁబట్టి నేను నీకు నీ హితమును చెప్పెదను.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. ౬౫

నాయందు మనస్సు నుంచుము. నా భక్తుఁడవగుము. నా నిమిత్తము యజ్ఞము చేయుము. నాకు నమస్కారము చేయుము. నీవు నన్నే పడయుదువు. ఇది నా నిజమయిన ప్రతిజ్ఞ. నీవు నాకుఁ బ్రియుఁడవు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః. ౬౬

సర్వధర్మత్యాగ మొనరించి నన్నొక్కనినే శరణు నొందుము. నేను నిన్ను సకలపాపములనుండి ముక్తునిఁ గావించెదను. శోకింపకుము.

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన,
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి.

ఎవఁడు తపస్వి గాఁడో ఎవఁడు భక్తుఁడు గాఁడో, ఎవఁడు విన నభిలషింపఁడో మఱియు నెవఁడు నన్ను ద్వేషించుచుండునో వాని కిది (జ్ఞానము) నీ వెన్నఁడు చెప్పవలదు.

య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి,
భక్తిం మయి పరాం కృత్వా మా మేవైష్య త్యసంశయః. ౬౮

కాని యీపరమగుహ్యజ్ఞానము నెవఁడు నాభక్తుల కొసంగునో వాఁడు నాయందుఁ బరమభక్తినుంచుటచే నిస్సందేహముగా నన్నే పడయును.

నచ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః,
భవితా నచ మే తస్మా దన్యః ప్రియతరో భువి. ౬౯

వానికంటె మనుష్యులలో నా కధికప్రియమైన సేవకుఁడెవఁడును లేఁడు మఱియు నీపృథ్వియందు వానికంటె నా కధికప్రియుఁడగువాఁడు, నయితము లేఁడు.

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః,
జ్ఞానయజ్ఞేన తే నాహ మిష్టః స్యా మితి మే మతిః. ౭౦

మన యీధర్మసంవాదము నెవఁ డభ్యసించునో వాఁడు నన్ను జ్ఞానయజ్ఞముద్వారమున భజించు నని నా యభిప్రాయము.

శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపి యో నరః,
సో ఽపి ముక్తశ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్.

మఱియు నే మనుష్యుఁడు ద్వేషరహితుఁడయి శ్రద్ధాపూర్వకముగఁ గేవలము వినునో వాఁడుసయితము ముక్తుఁడయి పుణ్యాత్ము లెచట నివసించుచున్నారో ఆశుభలోకమును బడయును.

వ్యాఖ్యానము : ఇందుఁ దాత్పర్య మిది : ఎవఁ డీ జ్ఞానముయొక్క యనుభవమును బొందెనో వాఁడే దీని నితరుల కొసంగఁగలఁడు. శుద్ధముగ నుచ్చారణచేసి అర్థసహితముగ వినిపించఁబడువారికివిషయమయి పైని రెండుశ్లోకములు గాదు.

కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వ య్యేకాగ్రేణ చేతసా,
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రనష్ట స్తే ధనంజయ. ౭౨

ఓ పార్థా! ఇది నీవు ఏకాగ్రచిత్తముతో వింటివా? ఓ ధనంజయా! ఈ యజ్ఞానకారణమున నే మోహము నీకుఁ గలిగియుండెనో అది నశించినదా?

అర్జున ఉవాచ:—

నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయా ఽచ్యుత,
స్థితో ఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ. 23

అర్జునుఁడు చెప్పెను: ఓ యచ్యుతా! నీకృపచే నామోహ మంతరించినది. నాకు స్మృతి (వివేకము) కలిగినది. సందేహనివారణ మయినది, నేను స్వస్థుఁడ నయితిని. నీవు చెప్పినట్లు చేయుదును.

సంజయ ఉవాచ:—

ఇ త్యహం వాసుదేవస్య పార్థస్యచ మహాత్మనః,
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్. ౭౪

సంజయుఁడు చెప్పెను: ఈ చందమున వాసుదేవునియొక్కయు మఱియు మహాత్ముండగు నర్జునునియొక్కయు నీ గగుర్పాటును గలిగించు నద్భుతమగు సంవాదమును నేను వింటిని.

22

వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేత ద్గుహ్య మహం పరమ్,
యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షా త్కథయత స్స్వయమ్. ౭౫

వ్యాసుని కృపచే యోగేశ్వరుఁడగు కృష్ణుని శ్రీముఖమున నే నీగుహ్యమగు పరమయోగమును వింటిని.

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్,
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహు ర్ముహుః. ౭౬

ఓ రాజా! కేశవునియొక్కయు మఱియు నర్జునునియొక్కయు నీయద్భుతమును మఱియుఁ బవిత్రమును నగు సంవాదమును స్మరించి స్మరించి, నేను మాటిమాటి కానందము నందుచున్నాను.

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః,
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః పునః. ౭౭

ఓ రాజా! హరియొక్క యా యద్భుతరూపమును స్మరించి స్మరించి నేనత్యంతము విస్మితుఁడనగుచున్నాను, మఱియు మాటిమాటికి నానందమును జెందుచున్నాఁడను.

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ. ౭౮

ఎచట యోగేశ్వరుఁడగు కృష్ణుఁడు కలఁడో, ఎచట ధనుర్ధారియగు పార్థుఁడు కలఁడో, అచట శ్రీ యున్నది, విజయ మున్నది, వైభవ మున్నది మఱియు నవిచలమగు నీతి యున్న దని నా యభిప్రాయము.

వ్యాఖ్యానము : యోగేశ్వరుఁడగు కృష్ణుఁ డనఁగా ననుభవసిద్ధమగు శుద్ధజ్ఞానము, ధనుర్ధరుండగు నర్జునుఁ డనఁగా దాని ననుసరించు క్రియ. ఈ రెంటిసంగమ మెచట నగునో అచట సంజయుఁడు చెప్పినదిగాక మఱొం డేమి పరిణామము కాఁగలదు?

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సన్న్యాసయోగో నామ అష్టాదశో ఽధ్యాయః.

ఓం తత్ సత్.

ఈరీతి శ్రీమద్భగవద్గీతాసూపమగు నుపనిషత్తు
అనఁగా బ్రహ్మవిద్యాంతర్గతయోగశాస్త్ర
మందలి శ్రీకృష్ణార్జునసంవాదముయొక్క
సన్న్యాసయోగ మను పేరుగల
పదునెనిమిదవ అధ్యాయము
ము గి సి న ది.

## మానవాదర్శ గ్రంథమండలి-పోషకవర్గము.

# ప్రధానరాజపోషకులు.

1 శ్రీ రాజా యార్లగడ్డ శివరామప్రసాద బహద్దరు జమీందారు వారు, చల్లపల్లి.

2 శ్రీ రాజా నాయని వేంకటరంగారావు బహద్దరు జమీందారు వారు, మునగాల.

3 శ్రీ మహారాణీ సరళాదేవిగారు, వనపర్తి.

4 శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, ఆంధ్రభారతిపత్రికాసంపాదకులు, మద్రాసు.

5 శ్రీ కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, వైసుచైర్మను, ప్రొద్దుటూరు.

6 శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరిగారు, ఎమ్. ఎల్. సి., భూస్వాములు, జిల్లాబోర్డు ప్రెసిడెంటు, గుంటూరు.

7 శ్రీ కొమ్మారెడ్డి పట్టాభిరామయ్యచౌదరిగారు, భూస్వాములు, ఎం. ఎల్. సి., బందరు.

8 శ్రీ కొండాలి ఉమామహేశ్వరరావుచౌదరిగారు, భూస్వాములు,
జవగ్గవ్రూడి.

9 శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు, భూస్వాములు,
పోతునూరు, ఏలూరు తాలూకా.

10 శ్రీ డాక్టరు మాలూర్వి రంగయ్యగారు, యల్. యమ్. యస్.
పెదపాడు, ఏలూరుతాలూకా.

11 శ్రీ పర్వతనేని భూపయ్యచౌదరిగారు, భూస్వాములు,
నూజెళ్ళ.

12 శ్రీ మెట్టుపల్లి కొండారెడ్డిగారు, భూస్వాములు, చినసెట్టిపల్లి.

13 శ్రీ లింగం భద్రియ్యచౌదరిగారు, ,, బొమ్ములూరు.

14 శ్రీ వల్లభనేని బాపయ్యచౌదరిగారు, ,, వర్తకులు,
గుడ్లవల్లేరు.

15 శ్రీ లక్కు వెంకటరెడ్డిగారు, తాలూకా, జిల్లా, ఎడ్యుకేషనల్
బోర్డుల మెంబరు, కనేకల్లు.

16 శ్రీ చెలసాని వేంకటకృష్ణయ్యచౌదరిగారు, భూస్వాములు,
కురుమద్దాలి.

17 శ్రీ మొగిళ్ళ సుబ్బారెడ్డిగారు, భూస్వాములు, నంద్యాల.

# రాజపోషకులు.

1 శ్రీ దుక్కిపాటి వేంకటసుబ్బారావు & బ్రదర్సు, పెదేవ్యరు.
2 శ్రీ నూదనగుంట అప్పారావుచౌదరిగారు, భూస్వాములు,
మునిపల్లె.
3 శ్రీ కాకరాల భాస్కరరావు చౌదరిగారు, ,, రామపురం.
4 శ్రీ రాజా చినసుబ్బరాయుడు శెట్టిగారు, వర్తకులు, నంద్యాల.
5. శ్రీ అడుసుమిల్లి వీరయ్యచౌదరిగారు, భూస్వాములు, చందరాల.
6 శ్రీ వల్లభనేని రామశాస్త్రిచౌదరిగారు, ,, జొన్నలూరు.
7 శ్రీ కాకర్ల కాశీస్వామిచౌదరిగారు, ,, పెదముత్తేవి.
8 శ్రీ అట్లూరి కాంతయ్యచౌదరిగారు, అంగలూరు.
9 శ్రీ అత్మకూరి సుబ్రహ్మణ్యం శెట్టిగారు, వర్తకులు, నంద్యాల.
10 శ్రీ వంకదారి రామయ్యశెట్టిగారు, ,, గోపాలపురం
11 శ్రీ గుళ్లపల్లి రామబ్రహ్మంచౌదరిగారు, భూస్వాములు,
కురుమద్దాలి.
12 శ్రీ పోలా వేంకటగురవయ్య శెట్టిగారు, వర్తకులు, నంద్యాల.

8 శ్రీ కొండాలి ఉమామహేశ్వరరావుచౌదరిగారు, భూస్వాములు,
జవగ్లపూడి.

9 శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు, భూస్వాములు,
పోతునూరు, ఏలూరు తాలూకా.

10 శ్రీ డాక్టరు మూల్పూరి రంగయ్యగారు, యల్. యమ్. యస్.
పెదపాడు, ఏలూరుతాలూకా.

11 శ్రీ పర్వతనేని భూపయ్యచౌదరిగారు, భూస్వాములు,
నూజెళ్ళ.

12 శ్రీ మెట్టుపల్లి కొండారెడ్డిగారు, భూస్వాములు, చినసెట్టిపల్లి.

13 శ్రీ లింగం భద్రయ్యచౌదరిగారు, ,, బొమ్ములూరు.

14 శ్రీ వల్లభనేని బాపయ్యచౌదరిగారు, ,, వర్తకులు,
గుడ్లవల్లేరు.

15 శ్రీ లక్కా వెంకటరెడ్డిగారు, తాలూకా, జిల్లా, ఎడ్యుకేషనల్
బోర్డుల మెంబరు, కనేకల్లు.

16 శ్రీ చెలసాని వేంకటకృష్ణయ్యచౌదరిగారు, భూస్వాములు,
కురుమద్దాలి.

17 శ్రీ మొగిళ్ళ సుబ్బారెడ్డిగారు, భూస్వాములు, నంద్యాల.

---

# రాజపోషకులు.

---

1 శ్రీ దుక్కిపాటి వేంకటసుబ్బారావు & బ్రదర్సు, పెర్యేరు.

2 శ్రీ నూదనగుంట అప్పారావుచౌదరిగారు, భూస్వాములు, మునిపల్లె.

3 శ్రీ కాకరాల భాస్కరరావు చౌదరిగారు, ,, రామపురం.

4 శ్రీ రాజా చినసుబ్బారాయుడు శాస్త్రిగారు, వర్తకులు, నంద్యాల.

5 శ్రీ అడుసుమిల్లి వీరయ్యచౌదరిగారు, భూస్వాములు, చందరాల.

6 శ్రీ వల్లభనేని రామశాస్త్రిచౌదరిగారు, ,, బొమ్ములూరు.

7 శ్రీ కాకర్ల కాశీస్వామిచౌదరిగారు, ,, పెదముత్తేవి.

8 శ్రీ అట్లూరి కాంతయ్యచౌదరిగారు, అంగలూరు.

9 శ్రీ ఆత్మకూరి సుబ్రహ్మణ్యం శాస్త్రిగారు, వర్తకులు, నంద్యాల.

10 శ్రీ వంకదారి రామయ్యశాస్త్రిగారు, ,, గోపాలపురం

11 శ్రీ గుళ్లపల్లి రామబ్రహ్మంచౌదరిగారు, భూస్వాములు, కురుమద్దాలి.

12 శ్రీ పోలా వేంకటగురవయ్య శాస్త్రిగారు, వర్తకులు, నంద్యాల.

---

# పోషకులు.



1 శ్రీ మొటపర్తి శేషమ్మగారు, (కీ. శే. మొటపర్తి వెంకట నారాయణగారి సతీమణి) దెందులూరు, ఏలూరు తా॥

2 శ్రీ ముల్పూరి చుక్కమ్మగారు (డాక్టరు రంగయ్యగారి సతీమణి), పెదపాడు, ఏలూరు తాలూకా.

3 శ్రీ దావులూరి తులశమ్మగారు, పసుమర్రు. (దావులూరి ప్రకాశరావుగారి సతీమణి)

4 శ్రీ రావుసాహెబు కంఠంనేని వేంకటరంగయ్యచౌదరిగారు, భూస్వాములు, నాగాయతిప్ప.

5 శ్రీ కాపూరి కోదండరామయ్యచౌదరిగారు, భూస్వాములు, కృష్ణాజిల్లా, ఎడ్యుకేషనల్ బోర్డు ప్రెసిడెంటు, మోపిదేవి.

6 శ్రీ యార్లగడ్డ అనంత శ్రీధరం బహద్దరుగారు, బందరు

7 శ్రీ భట్రా జ్ఞానకోటయ్యగారు, భూస్వాములు, వర్తకులు, చైర్మను, తెనాలి.

8 శ్రీ కరిపినేని రాజయ్యచౌదరిగారు, భూస్వాములు, కొల్లిమెర్ల.

9 శ్రీ ఓరుగంటి సుబ్రహ్మణ్యంఅయ్యర్ గారు, బి. ఏ. వకీలు, నంద్యాల.

